# బుద్ధపురాణము





కృతికర్త:

పెన్మెత్స రాజంరాజు

శ్రీ వాసుదేవాశ్రమము
చోడవరము.
1983

మూల్యము
రు. 20-00 లు.



ప్రథమముద్రణము.

వేయిప్రతులు



ప్రాప్తిస్థానము
శ్రీ వాసుదేవాశ్రమము
చోడవరము.
గుండేపల్లి, ఇ. డి. యస్. ఒ.
(వయా) తాడేపల్లిగూడెం,
పశ్చిమగోదావరిజిల్లా.
1 9 8 2

# బుద్ధపురాణ ముద్రణకు

## ఆర్థిక సహాయమొనర్చిన భక్తావతంసులు

| | రు |
|---|---|
| శ్రీ పెన్మెత్స వెంకటరాజుగారు హిందీ లెక్చరర్. డి. యన్. ఆర్. కాలేజి; (భీమవరం) కీ॥ శే॥ వేగేశ్న రాజంరాజుగారి జ్ఞాపకార్థము | 3000 |
| శ్రీ వేగిరాజు వెంకటరామరాజుగారు (కాళిపాడు) | 500 |
| శ్రీ అల్లూరి మూర్తిరాజుగారు (సఖినేటిపల్లి) | 300 |
| శ్రీ గోకరాజు సుబ్బరాజుగారు (జువ్వలపాలెం) | 200 |
| శ్రీ స్వామి సచ్చిదానందగిరిగారు (వీరపాలెం) | 234 |
| శ్రీ వేగేశన సత్యనారాయరాజుగారు (వెలివేరు) | 116 |
| శ్రీ భూపతిరాజు సత్యనారాయణరాజుగారు (వీరంపాలెం) | 100 |
| శ్రీ చిటవర్తి శేషగిరిరావుగారు (వీరంపాలెం) | 100 |
| శ్రీ పెన్మెత్స బంగారురాజుగారు (వీరంపాలెం) | 100 |
| శ్రీ రెడ్డి వెంకటకృష్ణారెడ్డిగారు (వీరంపాలెం) | 100 |
| శ్రీ ముప్పిడి వెంకటరెడ్డిగారు (బంగారుగూడెం) | 100 |
| శ్రీ కోడూరి చిన్నబ్బాయి (అనే వెంకటరత్నంగారు) (బంగారుగూడెం) | 50 |
| ఆకివీడు తాలూకా ప్రాతళ్ళమెరక గ్రామస్థులు | 311 |
| శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు (ప్రాతళ్ళమెరక) | 100 |

శ్రీ జంపన సత్యనారాయణరాజుగారు (వంటి) (పాతళ్ళమెరక) 100

శ్రీ పెన్మెత్స నరసింహరాజుగారు (మొగల్లు) 100

శ్రీ చేకూరి వెంకట్రాజుగారు (తండ్రి భాస్కరరాజుగారు)

(కోడుకాల్లు) 100

శ్రీ మంతెన సత్యన్నారాయణరాజుగారు (ప్రాతళ్ళమెరక) 50

శ్రీ పెరుమాళ్ళ వెంకటేశ్వర్లుగారు

(ఉనికిలిశివారు లక్ష్మీనారాయణపురం) 100

శ్రీ వేగేశన సత్యనారాయణరాజుగారు (వడ్లవానిపాలెం) 50

శ్రీ ఉషా టెక్స్టైల్సువారు (అత్తిలి) 116

శ్రీ గన్నమని రామారావుగారు (చోడవరం) 100

శ్రీమతి భూపతిరాజు వెంకటసుబ్బమ్మగారు (వీరసాలెం) 116

శ్రీమతి గాదిరాజు రుక్మిణి (రాజమండ్రి) 100

లక్ష్మీనారాయణపురం గవరపాలెం మహిళామండలి 50

శ్రీమతి వేగేశన సీతమ్మగారు (వెలిచేరు) 50

శ్రీమతి వేగేశన రామసీతమ్మగారు (వెలిచేరు) 50

శ్రీమతి కొత్తపల్లి విజయలక్ష్మిగారు (పాలకోడేరు) 50

శ్రీమతి వేగేశన సంఘమిత్ర (చోడవరం) 50

శ్రీమతి పెన్మెత్స రామాయమ్మగారు (చోడవరం) 50

మతి పెన్మెత్స సూర్యకాంతమ్మగారు (సత్యవాడ) 75

ంతి వత్సవాయి అనసూయమ్మగారు (సత్యవాడ) 25

# ఒక పర్యాలోచనము.

## బుద్ధుని సంస్మరణ.

"బుద్ధం శరణం గచ్ఛామి - సంఘం శరణం గచ్ఛామి ధర్మం శరణం గచ్ఛామి" మహా గంభీరంగా వినబడుతున్నాయి. కనురెప్ప వేయకుండా చూస్తున్నాను. దడదడ చప్పుడు వినబడింది - పట్టుకోండి అన్న క్రూరమైన కంఠం వినబడింది. "ఆగు" అన్న దుష్టమైన ఆదేశం వినబడింది.

వెంటనే లైట్లు వెలిగాయి. ఎడమవైపునుండి ఒక గంభీరమైన విగ్రహం నెమ్మదిగా ముందుకువచ్చి నిలబడినది. వెనుకనుండి బుద్ధం శరణం గచ్ఛామి .... అన్న స్వరాలు ఆదేపనిగా వినబడుతున్నాయి. మనిషి వదనం మెరిసిపోతున్నది. తల జుట్టు అందంగా గమ్మత్తుగా అల్లబడింది. తలవెనుక భాగాన గుండ్రని ఆకారంలో తేజస్సు ప్రకాశిస్తున్నది. కాషాయవస్త్రం ధరించియున్నాడు. కుడిచేతిని అభయ ముద్రలో పెట్టి ప్రసన్నంగా నవ్వుతున్నాడు. ఆదివ్యమైన విగ్రహాన్ని అలాగే చూస్తుండిపోయాను.

హఠాత్తుగా భయంకరమైన శబ్దం వినబడింది. ఎర్రని వెలుతురులు గజగజా వణికిపోయాయి. నీలిరంగుల మధ్య తెల్లని మెఱుపులు మెరిశాయి. ఆదృశ్యం చూడగానే భయం వేసింది. ఆ భయంలోనే ఒక క్రూరమైన విగ్రహం మహా

ఘోరంగా అరుస్తూ ఆ దివ్య విగ్రహాన్ని సమీపించింది. ఆ క్రూరుని విగ్రహాన్ని చూడగానే నేను కంపించింది. రక్తవర్ణపు రంగులో కాంతులు మరింత భయాన్ని కల్గించాయి. వాడు వికటంగా పెద్దగా అరచినట్లు నవ్వాడు. గుండెలు కొట్టుకున్నాయి. భయంతో చూస్తున్నాను.

కాని చేతిలో పెద్ద కత్తి ఉంది. అది రక్తంతో తడిసిఉంది. వాని మెడలో ఏదో దండ ఉంది. బాగా చూస్తే అవి బొటన వేళ్ళలాగ కనిపించాయి. వాడుత్త అడవి మనిషిలా ఉన్నాడు. దెయ్యంలా ఉన్నాడు. రాకాసిలా ఉన్నాడు. వాడు ఆ దివ్య విగ్రహాన్ని సమీపించి కత్తి ఎత్తి కొట్టబోయాడు!

ఆ దివ్య విగ్రహం ఒక్కమారు కనురెప్పలు ఎత్తి అతని వైపు అలా చూసాడు. అభయ హస్తాన్నెత్తి అతనివైపుత్రిప్పాడు ఆ హస్తం నుండి ఏదో తేజస్సు వెలువడి అతని హృదయాన్ని తాకింది.

ఎరుపు రంగు పోయింది. తెల్లని వెలుగు వచ్చింది. దాంతో వాడు ఆ దివ్య విగ్రహంముందు మోకరిల్లాడు. ఆ దివ్యవిగ్రహంలో అదే ప్రశాంతత కనిపించింది. 'హమ్మయ్య అని హాయిగా నిట్టూర్చాను.

ఆ దివ్య విగ్రహం బుద్ధభగవానుడు. ఆ క్రూరుడు అంగుళీ మాలుడు

బుద్ధపురాణానికి భూమిక వ్రాయమని కోరినప్పుడు వెంటనే ఈ చిన్ననాటి సంఘటన జ్ఞాపకం వచ్చింది. పది పన్నెండు సంవత్సరాలప్పటి మాట! అప్పుడు వినాయక చవితికి చందాలు వేసుకొని వీధిలోనివారు రాత్రి ప్రదర్శనలు యేర్పాటు చేసేవారు. ఇప్పటిలా కాక అప్పటి ప్రదర్శనలు చాలా ప్రమాణపూరితంగా సభ్య సమాజం చూడ తగ్గవిగా ఉండేవి. ఈఏడూ ప్రదర్శనలు చాలా చోట్ల ఏర్పాటుచేశారు. అయితే వినాయకునివంటి అజన్మ బ్రహ్మచారికి రికార్డు డ్యాన్సులు చూపించటంలో ఏమి ఔచిత్యం కనబడిందో నిర్వాహకులకు అప్పుడుమాత్రం మంచి ప్రదర్శనలు చూపించే వారు. చక్కని చిక్కని పాటలు వినిపించేవారు. ప్రఖ్యాత నాటక సంఘాలచేత ఇలాంటి ప్రదర్శనలు ఇప్పించేవారు

“అంగుళీమాలా” నాటకాన్ని అత్యద్భుతంగా ప్రదర్శించిన ఆ నాటక సంఘాన్ని అప్పుడు కలకత్తానుంచి పిలిపించారు. ఎంత అద్భుతంగా నటించారంటే ఆ బుద్ధుని స్వరూపం యిప్పటికీ కన్నులకుకట్టినట్లుగానే ఉంది. ఇప్పటికీ ఆ నాటకంనుండి ప్రేరణ లభిస్తుంది. అనాటకం చూసిన తర్వాతే నామనసులో ఏదో అలజడి మొలకెత్తింది. అదినేడు అధ్యాత్మికంగా మారిపోయింది.

బుద్ధుని జీవితం నాకే కాదు ఎంతోమంది అధ్యాత్మిక సాధకులకు దోహదకారి అయినట్లు మనం గ్రహించవచ్చును.

శ్రీ వివేకానందునకు ముందుగా బుద్ధుని స్వరూపమే గోచరించినదట!

బుద్ధునిలా మరేయితర అవతారంగాని, విశిష్టవ్యక్తి గాని ఆధ్యాత్మిక సాధకులకు ప్రేరేపకుడు కాలేకపోయాడు. క్రీస్తు మనకు కనబడేది సాధనాంతరం మాత్రమే. శ్రీరామ కృష్ణపరమహంస సాధనలు రహస్యంగా కొనసాగాయి. వివేకానందుడు సాధనలుచేసినట్లు కనపడినా అవి సాధకులకు దోహదకారులు కాకుండా ఉన్నాయి.

కాని బుద్ధుడు మాత్రం ఆరంభ సాధకుని మొదలు సిద్ధి పొందే సాధకుని వరకూ ప్రేరేపకుడయ్యాడు. లౌకిక పురుషులు సైతం బుద్ధుని జీవితం చదివి తమ లౌకిక జీవనపు అసారత్వాన్ని గ్రహించి అలౌకికంవైపు దృష్టి మరలిస్తారు. బుద్ధుని జీవితం నాటికీ నేటికీ ఎప్పటికీ సాధకులందరికీ మార్గదర్శకమై నిలుస్తుంది.

ఇతర మహాత్ములున్నారు. దశావతారాలున్నాయి అవి ఇంతలా ప్రాపంచిక మానవుని ప్రేరేపించవు, అవి సాధనలో ఉన్నవారికి ఉపదేశాలందిస్తాయేమోకాని బుద్ధుని జీవితంలా మామూలు మనిషికికూడా ప్రేరణ కల్గించలేవు.

కృష్ణ చరిత్ర, రామ చరిత్ర వీటినుండి ఆధ్యాత్మికతా విషయాలు గ్రహించాలంటే విశిష్ట వ్యాఖ్యానాలవసర మౌతాయి. వారి స్థూల జీవితాలను అనుకరించి సాధకుడు

ఆధ్యాత్మిక పథగామి కాలేడు కాని బుద్ధుని జీవితాన్ని ఉన్నదున్నట్లు అనుసరించితే ఆ సాధకునికి ఆధ్యాత్మిక పురోగతి సాధ్యమౌతుంది.

బుద్ధుడు నిజంగా తనకే ఆదర్శం కాక సాధకులందరికీ ఆదర్శప్రాయుడై చిరఖ్యాతి నార్జించియున్నాడు.

"బుద్ధపురాణం" కవి భూమికను వ్రాయమని కోరినప్పుడు ముందు ప్రామాణిక గ్రంధాలను చూసి వాటినుండి కొటేషన్సు గ్రహించి వ్రాద్దామనుకున్నాను. అది సరిఅయినది కాదేమోనన్పించింది. ఈపురాణాన్ని రచించింది ఒకఆధ్యాత్మిక హృదయం. ఆధ్యాత్మిక జీవితాన్నే గడిపే కవి రచితమైన ఈపద్య కావ్యానికి తదనుగుణమైన ముందుమాటలు చదువరులకు ప్రయోజనకరంగా ఉంటుందనిపించింది. ఒక ఆధ్యాత్మిక జీవి రచించిన భూమికయే ఇది. అందుకే భూమికనంతా ఆధ్యాత్మిక మయము చేయదలచుకొన్నాను. చారిత్రక విషయాలు స్థూలంగా పేర్కొంటూ బుద్ధ చరిత్రయిచ్చే ఆధ్యాత్మిక సందేశాన్ని తెలియజేయుటకై ప్రయత్నిస్తాను.

## కవి యివ్వగోరిన సందేశం.

""విరిసెను దిక్తటంబు లతివేలముగా మధు పుష్ప సంతతిన్
గురిసెను పాదపంబు లనుకూల సమీర కర ప్రబోధతో
మురిసెను ప్రాణికోటి పరిపూర్ణ సుధాంశుని లీల నిందిరా
వరుఁడల శాక్యరాట్కుల వివర్ధనుడై ప్రభవించు వేళలన్""

(1వ, 117 పద్యం)

ఈ ప్రభవించు కాలంకోసం మనం దాదాపు 2500 సంవత్సరాలు వెనక్కి వెళ్ళవలసి ఉంటుంది. నాటికి దేశంలో వైదికమార్గం సంకుచితమైపోయింది. సాంఘిక సమతా జీవనానికి వెలసిన వర్ణవ్యవస్థ జాతి కులాభిమానాలకు దారితీసింది. బ్రాహ్మణవర్గం ఆధిపత్యంతో సంఘాన్ని శాసించటం ఆరంభించారు. వైదిక కర్మకాండలు పెరిగిపోయాయి. బ్రాహ్మణ పురోహితులు కర్మల పేరుతో సంపదలకు దాసులైపోయారు

వైదిక మతోద్దేశం మానవ వికాసం ఆత్మవికాసం అది పేరుకు కూడ కనపడకుండాపోయింది పైగా ప్రజల్లో నైతికత నశించింది ధార్మిక సంస్కృతి నశించింది. నాటి జనాన్ని ముందుగా నీతివర్తనులుగా ధర్మప్రవర్తనులుగా తీర్చి దిద్దవలసిన అవసరం ఏర్పడింది.

ధర్మానికి హానికల్గినపుడెల్ల అధర్మాన్ని శిక్షించి, ధర్మాన్ని పునః స్థాపించటానికై ఎవరో ఒక మహనీయుడు ఉద్భవిస్తూనే ఉంటాడు. అలాంటివారుద్భవించిన దగ్గరనుండి మరల వికాస తత్వాలు ప్రసరింప నారంభిస్తాయి.

హిమాలయాలక్రింద నేటి నేపాళంలో ఉన్న కపిలవస్తు శాక్యాధిపతి శుద్ధోదనునికి అతనిభార్య మాయాదేవికి జనించిన సిద్ధార్థుడు, ఈ మహనీయ కార్యాన్ని నిర్వర్తించవచ్చినవాడు. శాక్యవంశంలోపుట్టిన సిద్ధార్థుడు లోకాన్ని ఎలా ఆనందమయం చేయ బోతున్నాడో కవి ఇక్కడ ముందే ఊహించి స్పష్ట

పరుస్తున్నాడు. మృదు మధుర సుందర సుకోమల పుష్పాలు చల్లని పిల్లవాయువులు పూర్ణ చంద్రుని నిర్మల రోచిస్సులు. ఇవన్నీ మనస్సుయొక్క ప్రశాంతతకు దోహదం చేస్తాయి. బుద్ధుని జననం సకల లోకాలను ఆనంద మగ్నులను చేయ వచ్చినదని కవి చెప్పకయే చెప్పుచున్నాడు. పుష్పాలు, వాయువులు, వెన్నెలలు, ఇవి సర్వ వ్యాపకాలు. సర్వత్రా ఉండేవి, పరిమితులకు లోబడేవి కావు. బుద్ధుడిచ్చే శాంతి సైతం కేవలం శాక్య వంశానికే, కపిలవస్తు నగరానికే, భారత దేశానికే పరిమితంకాదు సుమా! అది ప్రపంచమంతా వెలుగులు విరజిమ్ముతుంది. ఆసియాఖండ జ్యోతి అయిన బుద్ధ సందేశం ఖండ ఖండాంతరాలను జాగృతులను చేస్తుందని కవియొక్క విశాల భావం యిందు సువ్యక్తమౌతుంది. నేడు బుద్ధుని ధర్మం సర్వత్ర వ్యాపించియున్న సంగతి మనమెరిగియే యున్నాం కదా!

సాధకునిలో బోధ (బుద్ధుడు) జనించినాడు. అతని మనసులోని సర్వ మలినాలు నశించి నిర్మల వాతావరణం నెలకొంటుంది. ఎటు దృష్టి తిప్పినా సాధకునిలో ప్రశాంత వాతావరణమే గోచరిస్తుంది. బోధకు ముందు సాధకుని చిత్తం వైదిక మతంలా కకావికలమై అస్తవ్యస్తమై ఉంటుంది. అయితే అది తీవ్రతరమైనప్పుడు, వైరాగ్యరూపమైన బోధ జనిస్తుంది. ఆబోధయే అతని సంకల్పాల సంచలనాలను నిర్దాక్షిణ్యంతో నిశితంగా ఖండించివేస్తుంది. బుద్ధుడు ముందు ముందు అదేపని చేస్తాడు.

"జన్మ దుఃఖమయము జరయు దుఃఖమయమ్మ
రుజయు దుఃఖమయము లోకమందు
కోరినట్టి వస్తుకోటిని కోల్పోయి
దుఃఖపడుట కాంచుదుము సతమ్ము. (5.లో.10)

దుఃఖ తతిని పెంచ దొడగునదే తృష్ణ
తృష్ణనణగ ద్రొక్క తీరవలయు
తృష్ణయణగెనేని దివ్యమౌనిర్వాణ
పథము దొరుకు నెట్టివారికైన" (5. లో 11)

ఆత్మ వికాసాన్ని కాంక్షించు ప్రతిసాధకుడు ముందుగా పై విచారాన్ని చేయవలసియుంటుంది. ద్వైతం, అద్వైతం, విశిష్టాద్వైతం. ఏమార్గ మవలంబించినా శైవం, వైష్ణవం, శాక్తేయం, కాపాలికం - ఏమతం అనుసరించినా, అన్నిటికీ విచారణ అవసరమౌతుంది. ఈవిచారణను త్రోసిపుచ్చిననాడు ఏదీకూడ ఆత్మవికాసానికి దారి చూపలేదు.

బుద్ధుడు జనించినప్పుడే దైవజ్ఞులతడు గొప్ప చక్రవర్తి ఔతాడని చెబుతారు. మరి చక్రవర్తి కాబోయేవారిలాంటి వైరాగ్య విచారణ చేస్తారా? చేయరు బుద్ధుడు సైతం చేయలేదు; ఒక విధంగా విచారణ చేయటానికి అతనికి అవకాశం లభించలేదు.

"అమ్మ యటంచు ముద్దుకొడు కల్లన పల్కగనేర్చి మెల్లగా
గుమ్మము దాటువేళ కనుగొన్న ననిత్రి చలించి అక్కరూ
పమ్మెదలో నటించ ననివార్య దయార్ద్ర మనోజ్ఞ నేత్రప
ద్మమ్ములు చెమ్మగిల్ల సుకుమార కుమారుని యెత్తిముద్దిడున్" (2,లో. 9.)

ఇది బాల్యంలోని కార్యక్రమం

"వేద పురాణకావ్యముల విస్తృత సారమెరింగి శాస్త్రమ
ర్యాదల నాకళించుకొని రమ్యవినోద కళా జగత్తులో
భేదములన్ గ్రహించి పరపీడిత మార్గములన్ త్యజించుచున్
మోదము గూర్చె శాక్యనృప ముఖ్యుని పుత్రు డపూర్వవైఖరిన్"
(2.లో, 17)

ఇది టీనేజ్, కౌమారంలోని పరిశ్రమ.

"తోడి నృపకుమారు లాడంబరంబుతో
తిరుగు చొక్కపొద్దు తురగములను
తోలు నేర్పు చూప తొడగిన పోటీకి
సిద్ధపడెను శాక్య సింహుడెలమి"
"ప్రాలేయ శైల కానన
పాళిని విహరించు శాక్య పతి పుత్రుడు శ్వే
చ్ఛాలలిత సహజ ప్రకృతిం
దేలుచు మృగయా వినోద దీక్షం జనుచున్" (2లో. 24,25)

"రాగమయ ప్రధానమున రాగవిహీనుడుగా మెలంగుచున్
భోగమయంబులైన పితృ పుంగవునంతి పురంబునందెదో
లాగ మనశ్శరీర సుఖలంపట మొల్లక మోక్షమార్గ సం
యోగ రహస్యముల్ నెడు యోజనతో నరిపుచ్చుకాలమున్"
(2. 56)

ఇది క్రీడలలో మరచిన కాలం

బుద్ధుడు సిద్ధార్థనామంతో జన్మించినదాదిగా యౌవన ప్రాయం వఱకు ఇలా నిరంతరం - కాలయాపనలోనే గడిపే

వాడు. శుద్ధోదన రాజే కుమారుని యిలాంటి స్థితిలో పెట్టి యుంటాడు.

ఇది సహజమేకదా! కుమారులకిది ఎంత సహజమో తండ్రులకు కూడ అంతే సహజం. సామాన్యులైతే ఇలాంటి గానుగెద్దు జీవితంలోనె తమజీవితాలను సమాధిచేసుకొంటారు. కాని మహనీయులు కావలసినవారిలో ఏదో ఒక క్షణం ఏదో ఒకదృశ్యం ఆలోచనా భావంవచ్చి వారి జీవితాలను అనూహ్య పథాలను పట్టిస్తాయి. వారెంత లౌకిక జీవితంలో నిమగ్నులై ఉన్నా అంతరాంతరాలలో ఆస్పందనలు గోచరిస్తూనేఉంటాయి సిద్ధార్థుడు చక్రవర్తి అవుతాడని ఏకచ్ఛత్రాధిపతి ఔతాడని దైవజ్ఞులు చెప్పారు. అయితే సన్యసించే అవకాశం కూడ కలదని చెబుతారు. లేక లేక పుట్టిన కొడుకు, తన వారసత్వం స్వీకరించక సన్యాసి కావటం ఏ తండ్రిమాత్రం సహిస్తాడు! శుద్ధోదనుడు అందుకే ముందునుండే సర్వ జాగ్రత్తలూగైకొని కుమారుడు ఎల్లప్పుడూ సంతోషంగాను ఉత్సాహంతోను ఉండుటకై యత్నించాడు.

యౌవనం అంకురిస్తున్నప్పుడు మానవ హృదయంలో ఏదో వెలితి కనబడుతుంది. సామాన్యుల దృష్టి కామం — భోగం, ఆవెలితిని పూరించునని భావిస్తుంది. అందుకే వారు ఆప్రయత్నాలలో పడిపోయి, చివరికి మునిగిపోతారు. సిద్ధార్థునికిసైతం ఆవెలితి దృగ్గోచరం కాసాగింది.

"ప్రతి దినంబు హృదయ పద్మమం దేది యో
భావసుధను చిలికి జీవితమును
సార్థకంబుసేయ జాలు మార్గమెరుంగ
చింతనం బొనర్చు శ్రీ ఘనుండు" (2. 57)

"బంధుగులు ప్రాణ మిత్రులు
విందులు వేడు కలటంచు విహరించగ నా
నందించక శుద్ధోదన
నందనుడే కాంత సీమ నాలోకించున్" (2. 60)

"నీవెరుంగని ధర్మముల్ లేవటంచు
తెలిసియుండియు తండ్రినై పలుకుచుంటి
ధర చతుర్విధ పురుషార్థ దాయకమ్ము
అఖిల బుధ నుతమగు గృహస్థాశ్రమమ్ము" (2, 73)

సామాన్యుల ఆకాంక్షలకు మహనీయుల అభీష్టాలకు ఇదే తేడా. సామాన్యుల కోరికలెప్పుడూ స్వార్థ ప్రయోజన పరిమితులకు దాటి వెళ్ళవు. అన్నీ తనకు, తన దేహ సుఖానికి, తన భార్యా బిడ్డలకు తన కుటుంబానికి మాత్రమే కావాలని కోరుకుంటాడు సామాన్యుడు. అందుకే అతని జీవితం పశుపక్ష్యాదుల్లా తినటం - త్రాగటం - పిల్లలను కనటం చావటంతో సమాప్తమైపోయింది.

కాని, మహనీయులెంత స్వార్థపూరితమైన జీవనంలో చిక్కుకున్నా వారి అంతరంగం మాత్రము స్వార్థపుహద్దులను దాటి పయనిస్తుంది, లోక పరిధులను అధిగమించి ఆలోచిస్తుంది. తన భోగం, తన సుఖం మాత్రమే సార్థక జీవన

ధ్యేయం కాదని తోస్తుంది. ఎదలో ఎక్కడో సర్వసంగ పరిత్యాగం, మహావైరాగ్యం సర్వజీవగతమైన సుఖాభిలాష లుంటాయి. ఇలాంటి బీజాలున్నవారే దేశంకోసం ప్రాణా లర్పిస్తారు. భగత్‌సింగులా, అల్లూరిలా వీరోచితంగా దేశం కోసం పోరాడుతారు. ప్రపంచ మానవ సుఖంకోసం నూతన మార్గాలను తొక్కుతారు వివేకానందునిలా.

సిద్ధార్థుని మనసుకూడ ఈమార్గంలోనే ఆలోచించ సాగింది. అతని వదనంలోని ఉదాసీనతను శుద్ధోదనుడు గమనించాడు. భయం వేసింది. సన్యసిస్తాడేమోనని!

ఈలోకంలో మనిషి ఇతరమైన అన్నిటికీ దోహదం చేస్తారుకాని, ఆధ్యాత్మికతకు వెళ్ళేవారికి ఎందుకు సహాయ సహకారాలందించడో అర్థంకాదు. శుద్ధోదనుడు తనకుమారుడు లౌకికప్రాయుడుగానే మిగిలిపోవటానికి అందరి తల్లిదండ్రుల్లా ప్రణాళికలు ఆలోచించాడు. పుత్రుని ఎలాఅయిన ఇంటి వాడుగానే ఉంచుటకై అన్ని యుక్తులూ ప్రయోగించాడు. సంసారంపై మమతను త్యజించని మానవులు అధ్యాత్మికతను విని విచారిస్తారు. "అయ్యో! ఈసంసారంలో మా జీవితమంతా వ్యర్థమైపోయినదే" అని అనుకొంటారు. అలా అనుకొని సరైన మార్గాన్ని అనుసరిస్తే బాగానే ఉంటుంది. కాని అలాచేయరు. పైగా తమ సంసార మార్గం. ఆధ్యాత్మికంగా సరైన దెలా అవుతుందోననే చూస్తారు. ఈ సంసారాన్ని ఆధ్యాత్మికత ప్రయోజనానికి అనుగుణంగా సమర్థించాలని చూస్తారు.

అలాంటివారికి గృహస్థాశ్రమాన్ని గురించి చెప్పిన గొప్పలు కనబడతాయి. గృహస్థాశ్రమం సర్వ ఆశ్రమాలకు ఆశ్రయభూతమైనదని చెప్పబడిన గొప్పమాటలు గ్రహిస్తారు. అంతటి ఉత్తమాశ్రమంలోనే కదా తాము న్నామని మురిసిపోయి సన్యాసంకంటె సంసారం మేలు, ఇహపరాలు రెండూ దీని ద్వార సాధించవచ్చని మురిసిపోతారు. అంతటితో వారి తపన తగ్గిపోతుంది. సంసారంలో మేము అధ్యాత్మికతని సాధిస్తున్నాము. జనకమహారాజులా అంటూ, ఆధ్యాత్మిక మార్గావలంబులను ఎద్దేవా చేసారు. వీరంతా జనక చక్రవర్తులైనట్లా? జనకుని భార్యపేరేమో రామాయణం చెప్పదు. అసలతడు సంసార లంపటంలో చిక్కుకున్నాడా! పేరుకు గృహస్థే కాని, అతని జీవనమంతా సన్యాస జీవితమే కదా! అయినా జనకునితో తమ్ము పోల్చుకొని తృప్తిపడి ఇతరులను కూడ "ఇంటివాడవుకమ్మని'' బోధిస్తూ దానికి గృహస్థాశ్రమం ఎంతో ఉత్తమమైనదంటూ సమర్థించి సన్యాస జీవితాన్ని ఎందుకూ పనికిరానిదిగా భావిస్తారు.

శుద్ధోధనుడుకూడ ఈ ప్రయోగం చేశాడు.

" నీవెరుంగని ధర్మముల్ లేవటంచు
తెలిసియుండియు తండ్రినై పలుకుచుంటి
ధర చతుర్విధ పురుషార్థ దాయకమ్ము
అఖిల బుధనుతమగు గృహస్థాశ్రమమ్ము '' (2–73)

సామాన్య ధర్మాన్ని విశేష ధర్మం కొట్టి పారవేస్తుంది. అయితే ఇలాంటి యుక్తులు ఎన్నేవారు విశేష ధర్మాన్నికూడ సామాన్య ధర్మంగానే గణించి తమ ప్రయోజనం నెరవేర్చుకో చూస్తారు. సిద్ధార్థుని ధర్మజ్ఞుడని పొగడి గృహస్థ జీవనం కూడ అధర్మాలలోదేకదా! అంటాడు. పైగా విజ్ఞులు సైతం దాన్ని మెచ్చుకొన్నారంటాడు. ఉత్తమ సంస్కారం గలవానికి యుక్తమైన వాదం నచ్చుతుంది. సిద్ధార్థునికి సన్యాసం విశేష ధర్మం అని తోచలేదు. అదీ సామాన్య ధర్మమే అనుకొన్నాడు. అలాంటప్పుడు విజ్ఞులు పొగడే గృహస్థ ధర్మాన్నే ఎందుకు స్వీకరించకూడదు అనుకున్నాడు.

ఇలాంటి సందిగ్ధమైన స్థితిలో సరైన గురువుగాని శ్రేయోభిలాషిగాని తటస్థపడితే తప్ప, సామాన్య ఆరంభ జిజ్ఞాసువులకు పురోగమనముండదు. అటువంటి గురువెవరైన తటస్థపడి సన్యాసంపై మనసు అంతగా మరలితే దానిని స్వీకరించు సర్వాన్ని నిర్లక్ష్యంతో త్యజించివేసి సన్యాసం స్వీకరించు. అదే పరమ పురుషార్థం అవుతుంది. కాని అంటి గురువు లభించుట కష్టం.

సిద్ధార్థునికి ఇలాంటి ఉద్బోధ నిచ్చేవారు ఎవ్వరూ కనపడలేదు. మరి చేసేది లేక వివాహబంధానికి తానుగ లోబడిపోయాడు. అందమైన సతి సాంగత్యంలో పడిపోయి సత్ సాంగత్యాన్ని విస్మరించాడు.

"సుందర హర్మ్యహర్మ్యముల పరిశుద్ధ తలంబుల పూవుఁదోటలం
దెందటొ సేవ కాంగనలహీన ధృతిన్ గొలువన్ యశోధరా
సుందరితో చరించుచుఁబ్రియ సూనున కన్య జనాళి వేదనా
క్రందన చూడ రాని గతి కట్టడి జేసె నరేంద్రుఁడెంతయున్"
(2-112)

లోకమందు ఇలాంటి తండ్రులే ఎక్కువ కదా!

"ఇది దివసం బిది వారము
గద నెల యిది యేడ టన్న కాలవియమమే
మది నెన్నక సిద్ధార్థుఁడు
సుదతీమణితోడ గడపుచుండెను దినముల్. (2-118)

మనిషి జీవితం ఇంతటితో ఫుల్‌స్టాప్. అంతవరకు ఎంతో ఉత్సాహంతో ఎంతో కార్యశీలత కావాలన్న ఆశయం ఉంటుంది పెండ్లయిందో తనమాట మరచి పోతాడు. తనఆశయాలు మరచి పోతాడు. తన ఉత్సాహం కోల్పోతాడు. కేవలం సతీలలామ కోసం తనకుతాను అర్పించుకుంటాడు. భగవంతునికై చేయవలసిన సమర్పణ, ఒక మాంసలమైన దేహం కోసం చేస్తాడు. అందుకే మనిషి తానుగా చనిపోయి కేవలం పోషకుడుగా మిగిలిపోతాడు. ఏమి ఆలోచించినా ఏమిచేసినా ఎన్నెన్ని ప్రణాళికలు రూపొందించినా అన్నీ భార్యాబిడ్డలకోసమే చేస్తాడు తద్వారా తానేదో ఘన కార్యం సాధించినట్లు భావిస్తాడు. తానేదో ఉత్తమత్వాన్ని సాధించానన్న మాయలో పడిపోతాడు.

3)

ఇది సామాన్యుని సంగతి సామాన్యుడు మాయవశుడు కాని మహనీయులు మాయావశులు కారు. మాయాతీతులు. మాయను ఆడించే వారేకాని మాయచేతిలో ఆటబొమ్మలు కారు. సిద్ధార్థుడు కేవలం సామాన్యమానవునిలా సిద్ధార్థునిగానే మిగిలపోవుటకు రాలేదు. అతడు బుద్ధుడై లోకులకు బుద్ధి గరప వచ్చినవాడు.

"వచ్చిన సంధ్యయే తిరిగి వచ్చిన రీతి నిరంత భోగ్యమై
ముచ్చటగూర్చు పోడుములె ముందును కూడ లభించుచుండ నా
సచ్చరి దాత్మ(డంతిపురి చానలతో విసుగెత్తి యన్యమౌ
పచ్చని లోకమున్ గనెదు భావమరందము ఊరనెమ్మదిన్"

(3-4)

"దినయామిన్యౌ సాయంప్రాతః శిశిరవసంతౌ పునరాయాతః;
కాలంక్రీడతి గచ్ఛత్యాయు స్తదపినముంచత్యాశా వాయుః"

(భజగోవిందం)

మామూలు మనుషులు సూర్యుడుదయిస్తే ఇకపనులుచేసుకొందామని సూర్యుడస్తమిస్తే ఇకపడుకుందామని రోజులు గడిపేస్తుంటారు. ప్రతిరోజు ఇదే జీవితాన్ని అనుభవిస్తున్నా వారికి విసుగువేయదు ఆశుష్కమైన జీవితంలోనే ఆనందరసాన్ని వెదుక్కోవటానికి విఫల ప్రయత్నం చేస్తుంటారు. కాని బుద్ధునిలాంటి ఉన్నత జీవులకు ఈజీవితం ఎంతభోగమయంగా ఉన్నా ఎంత రంగుల హంగులతో విరజల్లినా అతిత్వరలోనే విసుగు జనింపచేస్తుంది ఈ విసుగు సంసారంలో ఆశించిన ఫలితాలు నెరవేరక పోవటంవల్ల జనించింది కాదు.

అలాంటి విసుగులను సామాన్య మానవులు దినానికి ఎన్నెన్నో చవి చూస్తుంటారు. అవి నీటి బుడగల్లా ఇలా వచ్చి అలాగే పోతుంటాయి.

కాని వికాస ప్రవృత్తి గలమానవుల విషయంలో ఒక్క మాటు జనించిన విసుగు సర్వోన్నతిని పొందేవరకు నిలచిఉంటుంది

Religion begins with a tremendous bissatisfaction with present state of things. with our lives and hatred an intense hatred for this patching up of life an unbounded disgust for fraud and lies.

అని వివేకానంద స్వామి అంటాడు. "అత్యంత తీవ్రమైన అసంతృప్తి మతం. తత్వాన్వేషణ వైపు దారి తీస్తుంది. తన యెదుట ఉన్న పరిస్థితులు జీవితాలు వీటియందలి తీవ్రఅసంతృప్తియే. మానవుని మతంవైపు త్రిప్పుకుంటుంది. చిందరవందరైన జీవితాన్ని చూపి ఏవగించుకునినవాడు బాగా ఏవగించుకొనినవాడు వంచనలను అసత్యాలను చూచి విసిగిపోయిననాడు మానవుడు తత్వంవైపు మరలుతాడు.

ఆధ్యాత్మికతను అసహ్యించుకునేవారే కాని సామాన్య మానవులు తాము గడుపు కృత్రిమ జీవితాలను అసహ్యించు కొంటారా ?

బుద్ధునికి తన గృహస్థ జీవితంలో ఇట్టి విసుగే ప్రవేశించింది. దానినుండి ఎలా బయట పడాలో తెలియలేదు. కాని

ఇలాంటి దశలో ఉన్నవారికి మార్గం అదే కనివిస్తుంది. మామూలుగా గణనీయాలు కాని విషయాలే ఇటువంటివారికి ప్రేరేపణలౌతాయి.

''సారథీ చీము నెత్తురు నీరు కలసి
కారు వ్రణముల వాసన మీఱుచున్న
దాత డీరీతి గుమిలెడు హేతువేమి
యనిన రథ చోదకుడు ఛన్నుడనియె నిట్లు. (3-8)

''కాలు చేతులు మిగుల వంకరలు పోయి
బాధతోచను నొక పక్షవాత రోగి
కాన వచ్చిన శాక్య భూజాని సుతుడు
తల్లడిలిపోయె వాని యాతననుఁ జూచి.

పండు ముసలి యొకడు కూర్చుండలేక
ఁత కొక కర్రను చేతఁబట్టి
తలయు చేతులు వణకగా దారిప్రక్క-
గాని జెందుట కనుగొనె రాసుతుండు'' (3-12-13)

మనకు రోజూ ఎంతమంది రోగులు వికలాంగులు కనిపించరు? ఎందరు ముసలివారు కన్పించరు? ఎంతోమంది కన్పిస్తారు అయినా మనం వారలా ఎందుకున్నారో ఆలోచించిన పాపానపోము? అట్టి దశలు మనకూ వస్తాయని భావిస్తామా? ఎంతటి దుఃఖం ఉంటుందో దాన్నిగురించి ఆలోచిస్తామా అబ్బే! ఆలోచించము. సామాన్యుడు మూఢమతి ఇది తనకేదో సంబం

ధించని విషయాలుగానే భావించి నిర్లక్ష్యం చేస్తాడు. తాను చూచేవారివీ దేహాలే తనదీ దేహమే పాంచభౌతికమైన దేహాలలో ఇన్ని తేడాలు ఎందుకు వస్తున్నాయి! తన దేహముకూడ అట్టి స్థితులకు గురైన అప్పుడు ఎంత దీనావస్థ అవుతుందీ! అన్న ఆలోచన మామూలు మందమతి చేయడు. తన దేహమేదో విలక్షణ మైనదనీ సర్వరోగాతీత మైనదని భావించుకుంటాడేమో!

కాని నిశిత మనఃప్రవృత్తిగల సిద్ధార్థుని వంటి వారికి అత్యల్ప విషయాలు సైతం మహాగంభీర విషయాలుగా మారిపోయి మహాత్ములు లోకులను మాయచేసి తమదారిని తాము పురోగమిస్తారు. వారి మార్గం ముందే నిర్దేశితమై వుంటుంది. కాని లోకులకు తాము ఏదో సాధనచేస్తూ గమిస్తున్న భ్రమను కల్పిస్తారు. లేకపోతే వీరి జన్మల్లో కూడ రాని ప్రజ్ఞ విచారణ వివేకం కేవలం అతి మామూలు విషయాలు చూడగానే జనించాలా ? మనుషులకు రోగాలు రావా ? ముదిమి రాదా ? ఇవి ఎందుకంత గంభీర విషయాలై పోవాలి.

అది అంతే ఏదోవిధంగా తమ అన్వేషణను సాగించుటే మహాత్ముల విధి. దానికేదో నెపం మిషలా వెదుకుతుంటారు. ఎవరో కవి అన్నట్లు కవిత్వ ప్రాయు ఉబలాటమున్నవాడికి "నిబ్బుబిళ్ళ" "కుక్కపిల్ల" "అగ్గిపుల్ల" ఏదైనా కవితావస్తువై పోతుంది. అలాగే తాత్వికునికి ప్రతిదాని నుండి ఆధ్యాత్మికతా ప్రేరణ లభిస్తుంది. మూఢులకు రమణీయదృశ్యంకూడ కవితను

దర్శింప చేయదు. మరణంలాంటి గంభీర దృశ్యాలుసైతం తత్వాన్ని బోధించలేవు. అంతే మూఢునికి పులోగతిలేదు. అధోగతే! దృశ్యపదార్థాల సత్యత్వాన్ని వివేకించనంతవరకు అతఎంత ప్రజ్ఞా పారమితజ్ఞాని అయినా సునిశిత బుద్ధిచాతుర్యానికి గని అయినా అతను మూఢుడే అవుతాడు. చదువు సంధ్యలు రాని వారు మూఢులు కారు సదసత్ విచారణ చేయలేని వాడెవడైన మూఢుడే. మూర్ఖుడు ఎన్నిచావులు చల్చినా ఎన్ని మరణాలు చూచినా స్పందించడు.

కాని సిద్ధార్థుడో అతడు స్పందనా-మూర్తియే అయున్నాడు.

"...... మరణించిన నరుని బంధుమండలి యేడ్పుల్
పరిజనుల యూరడింపులు
ధరణీవరు సుతుని మదిని తల్లడ పరచెన్. (3-14)

ఆ దృశ్యం ఆ నిర్జీవ దృశ్యం ఆ శోకసంతప్తమైన దృశ్యం సిద్ధార్థునిలో తీవ్రమైన అలజడిని కల్గజేసింది. ఏదేహం కోసం తాను సర్వభోగాలలో మునిగియున్నాడో ఆదేహం ఇలా నిర్జీవమై పోతుందా ? ఎ దేహంకోసం బందుమిత్రులందరియందు మమతానురాగాలు కల్గి ఉన్నాడో ఆదేహం అందరినీ కాదని తనవి విడిచిపోతుందా! ఎప్పుడో ఇది తన శ్రమల నన్నింటిని తిరస్కరించి పతన మౌకూందన్న మాట.

సిద్ధార్థునిలో బోధకురావలసిన బీజాలు ప్రకృతి వేసింది. అవి మంచినేలలో పడ్డాయి. కాని మనవంటి వారం ఆ బీజాలు

స్వీకరించనైనా స్వీకరించం. యువావస్థలో నున్నవారి కసలు మృత్యువనేది ఒకటుందని కూడ నమ్మశక్యము కాదు. అంటే ముసలివారి కుంటుంది మనకెంకూ అవి పరీక్షకు నెట్టేస్తారు.

మృత్యువు మనకు గురువన్న సంగతి విస్మరించి దాన్నేదో పిశాచిలా తరిమేస్తాము. మాటల సందర్భములో చావు అన్నమాట వివనొల్లని మనం ఇంకేమి పురోగతి సాధించగలము? మృత్యువు ఎలాగు తప్పదు. దాన్ని ధైర్యంగా ఎందు కెదురొక్కకూడదు. దానినుండి మనం పాఠాలెందుకు నేర్చుకోకూడదు.

కాని నేర్చుకోము. శ్రీకాళహస్తి శతక కర్త అన్నట్లు "యతులునైతం మృతివాత వడకుండ వైద్యులను మందుమాకులను మంత్రతంత్రాలను ఆశ్రయిస్తారే తప్ప భగవత్తత్వాన్ని తద్వారా తెలుసుకోవటానికై యత్నించరు" అంతటి యతులే అలావుంటే సామాన్యులం మినమెంత వారమని ఊరుకోవటమేనా వివేకంతో విచారణ చేయాలి. సర్వదా సంతాప కారణమైన దేహ బంధము నుండి నిదువడే ఉపాయాన్ని ఆలోచించాలి.

"జగతి యందున్న ప్రాణి సంచయ మదెల్ల
జర రుజామృత్యు భయదవం వరణ నుండి
అవ్యయానంద వనధియం దలర జేయు
యోచనా మార్గమున జీవుడున్న యపుడు. (3-34)

భయం శోకం దుఃఖం ఆది వ్యాధి మొదలైన సకల విపత్తుల నుండి సర్వదా ముక్తుడైయుండే తెరవు గూర్చి? ఆలో

చించాలి, అల్పానందం మిథ్యాసుఖం గడ్డిపువ్వువంటి స్థితినుంచి బైటపడి అవ్యయానంద సత్యానందం కొరకు తపించాలి. అన్వేషించాలి. బుద్ధునిలో యీ విచారణ బలపడింది. తదనుగుణంగా అతనికి మరొక రూప దర్శన మయింది.

''ఊరుకవ్వల గల పెద్ద భూరుహమ్ము
క్రింద కూర్చుండి తప మాచరించు కొనెడు
పరమ మౌనీంద్రు జీవిత సరణి సరసి
సంభ్రమాశ్చర్య పులకిత స్వాంతుడగుచు.

''ఉండ యిల్లు లేక పండ చాపయులేక
చీకు చింత విడచి చెట్టుక్రింద
కనులు తెరువ కున్న ఘనుడీత డెవరని
ధన్ను నడుగ వాడు విన్నవించె" (3-21-12)

ఆ రూపం యొక్క ఔన్నత్యాన్ని కవి ఎంత చక్కగా క్రింద గీటుగల పదాలద్వారా ధ్వనింపచేస్తున్నాడో చూడండి. ఆ రూపం మౌనీంద్రుడు ఘనుడు. కేవలం మౌని అంటే సిద్ధార్థునికి తృప్తి కల్గించదు. తాను రారాజు కాబోతున్నాడు. అలాంటి మౌను లెందరో ఉంటారు. కాని ఆ మునివరేణ్యుడు రారాజులకు రాజైన త్రిలోకాధిపతి ఇంద్రునితో దీటు వచ్చువాడు. అంతటి ఘనుడు కనుకనే సిద్ధార్థునికి ఆ తాపసి ఆకర్షణీయుడయ్యాడు.

భౌతిక జీవితం ఎంత ప్రశస్తమైనదైనా త్యాగమయ జీవితానికి సాటిరాదని కవి చెబుతున్నాడు. తైత్తిరీయంలో ఆనందా

స్థాయిలను తెలుపుతూ ఒకదాని కొకటిగా నూరు రెట్లాధిక్యత గల అనేకానందాలు వివరింప బడతాయి. భౌతికానందం గంధర్వానందం దేవతానందం ఇంద్రానందం బ్రహ్మానందం ఇవన్నీ చెప్ప బడతాయి. మనం మామూలుగా భౌతిక మానవానందమే పొంద లేము. ఇక బ్రహ్మ లోకానందాల నెలా పొందగల్గుతాం.

అయితే ఈ ఆనందాలన్నీ ఒక ఎత్తు, ఆత్మానందం ఒక ఎత్తని ఆ ఉపనిషత్తు పరిష్కరించి చెప్పుతుంది. ఆత్మానందంలో ఇవి అల్పాతి అల్ప అంశానికి కూడ సాటిరావని అంటుంది. ఈ ఆత్మానందం కేవలం త్యాగమయ జీవితం ద్వారానే సాధ్యం. అంతటి ఉత్కృష్టత ఆత్మానందానికుంది కాబట్టే ఇల్లూ వాకిలీ లేని ఆ తాపసిని ఇంద్రుడు ఘనుడు అని కవి సన్మానిస్తున్నాడు.

మనం ఇలాంటి వారిని చూసైనా గుణపాఠం నేర్చుకొంటామా? అబ్బే ఈ తాపసులెవరో పిచ్చివారని తీసిపారవేస్తాం. కాని సిద్ధార్థుడట్టి మూర్ఖపు పని చేయలేదు. ఆ తాపసి జీవనసరళిని పరిశీలించి అదేనిజమైన ఆనందమార్గమని తెలుసుకున్నాడు.

తెలుసుకొన్నంత మాత్రాన సరిపోయిందా? దానిని స్వయంగా అనుభవించవద్దా? భగవంతుడున్నాడని విశ్వసించి నంత మాత్రాన వివేకానందుడు ఊరకుండి యుంటే ఇంతటి వాడయ్యేవాడా? లేదు అతను విశ్వసించుటయే కాదు, ఒకరు భగవంతుని దర్శించినప్పుడు తానెందుకు దర్శించ కూడదని పట్టు

పట్టి అన్వేషణకు పూనుకొని దాన్ని సాధించాడు మధ్యలో ఎన్ని విఘ్నాలెదురైనా లెక్కచేయలేదు. అదీ! తత్వాన్వేషకు డలా ఉండాలి! దేవునిసైతం ప్రశ్నించ గలగాలి ?

సిద్ధార్థునికి తాపసిని చూడ్డంతో మార్గం లభించింది. అనుసరించడమే తరువాయి. ఈ సంసారంలో ఎన్నెన్ని అడ్డంకులో కదా! అందంతో ఆడుకున్నందుకు గాను అతనికి ప్రకృతి పుత్ర బంధాన్ని ప్రసాదించింది. అదనంగా వచ్చిన ఈబంధాన్ని ఎలా వదిలించుకోవాలో అతని కర్థంకాలేదు.

"క్రొందలి రాకునం దలరు కోమల పుష్పమన్ యశోధ రా
సుందరి పాణి పద్మమున శోభిలుచున్న కుమారుగాంచి యా
నంద మరంద వీచికలు నాట్యము చేయ గడంగ శాక్య రా
ణ్ణందను డంతరంగ మున నవ్వునుగాని చలించ డంతగా

(3-46)

పుత్రబంధం అతనికి విషాదపు నవ్వునే గల్పించినది కాని ఆహ్లాదాన్ని గొల్పలేదు. పుత్రవంతుడైన తన కుమారునికి రాజ్య మప్పగిస్తే తనను వదలిపోయే అవకాశమేమీ ఉండదని ఎంచి కాబోలు శుద్ధోధను డతనికి రాజ్య భార మప్పగించ దలచాడు.

"నాపలు కాదరించి యవినాశన రాజ్యరమన్ గ్రహించి పృ
థ్వీపతులెల్ల నీ చరణ పీఠమునన్ దలలుంచి మ్రొక్క నం
దీపిత సద్య శస్సులను దిక్కులు పిక్కటిలంగ జల్లుచున్

పాపల రీతిగా ప్రజల పాలనజేసి తరించు పుత్రకా. (3-50)

"ఏవాడో యిది నీవు పుచ్చుకొని నా కీపాటికే నిశ్చల
జ్ఞానాన్వేషణ చేసుకోదగిన విశ్రాంతిన్ బ్రసాదించి వి
న్నాణం బొప్పగ రాజ్యమేలదగి యున్నా నింక వేమేల నీ
వీ వాడైన పరిగ్రహింపుము తనయా యీ సర్వ రాజ్యేందిరన్.
(3-52)

"ధర్మార్థ కామ మోక్షము
లర్మిలి సాధించు కొఱకు నహరహమును స
త్కర్మంబుల నొనరించుచు
నిర్మలముగ పాలనంబు నెరపుము తనయా (3-54)

లౌకికుని అధ్యాత్మికతా వ్యాఖ్యానాలు ఇలాగే ఉంటాయి. లౌక్యంలో అలౌక్యాన్ని చూపెట్టే ఇంద్రజాలం వీరిది. జాగ్రత్తులో స్వప్నాన్ని సమన్వయించే చర్య వీరిది. వీరి చర్యలు కవికి బాగా అనుభవమేమో! ధ్వని పూరిత పదప్రయోగాలతో ఎంత నిక్కచ్చిగా విమర్శిస్తున్నారో చూడండి. రాజ్యరమన్. సద్యశస్సు, పాపలరీతి. తరించు.

గౌతముడు ముక్తికాంతను పొందగోరుతుంటే రాజ్యమనే రమణినిచ్చి మభ్యపెడుతున్నాడు. మనిషిని మోహపరచేది నారి తనం సన్మానాలు స్తుతులు అధికారాలు. శుద్ధోధనుడు వీటినే ధర్మమనే ముసుగుతో కప్పి గౌతమునకు అందిస్తున్నాడు. పైగా ఇంతకంటె తరుణోపాయం లేదంటూ "తరించు" పదప్రయోగం

ద్వారా చూపిస్తున్నాడు.

అదే తరుణోపాయమైతే తానెందుకని పొందలేదు? అని ఎక్కడ ప్రశ్నిస్తాడోనని ముందుగానే దాన్ని పరిష్కరిస్తున్నాడు యువ వయస్సులో రాజ్యధర్మం నిర్వహిస్తే ఆతర్వాత జ్ఞానాన్వేషణ అధికారం అర్హత లభిస్తాయని తన పరంగా చెబుతున్నాడు.

లౌకికులు ఎంతకైనా తగుదురు పాపం త్రిమూర్తులకు సైతం భార్యా బిడ్డలను సృష్టించి అంతటివారే సంసారులైయుండగ తామెందుకు సంసారంచేస్తూ తరించకూడదని వాదిస్తారు.

అయితే ఆత్రిమూర్తులు తరించినట్టు కనబడరు. అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ పాపం! భార్యా బిడ్డలతోనే సతమతమౌతున్నారు. కేవలం ఆ నారాయణు డొక్కడే వటపత్రశాయియై ఆనందిస్తున్నాడు.

మనకు ఆదర్శం వటపత్రశాయి కాని త్రిమూర్తుడు కారు త్రిమూర్తులు మనకు గుణపాఠం నేర్పేవారే! సంసార జంజాటం ఇదిరా బాబు! మమ్ములను చూచైనా ఈ సంసారానికి దూరంగా ఉండమని చెప్పటానికే యీ త్రిమూర్తులు. ఈ త్రిమూర్తులకు ఆత్మానందము బొత్తిగా ఉండదు. బ్రహ్మకు సృష్టితోనే సరిపోతుంది. విష్ణువుకు పోషణతోనే సరిపోతుంది. శివునకు సృష్టిని విలీనం చేసుకోగల్గిన తపస్సుతోనే సరిపోతుంది. వటపత్రశాయి మాత్రమే ఆనందసాగరంలో తేలియాడుతుంటాడు.

సిద్ధార్థునికి అప్పటికే తండ్రి యుక్తులు స్పష్టమైనవి. విశేష ధర్మాన్ని సామాన్యీకరించి తనను లౌకికునిగానే ఉంచేందుకు ప్రయత్నిస్తున్నాడని తెలిసిపోయింది. మోక్షమనేది విశేష ధర్మం. దాన్ని ధర్మార్థ కామములతో కలుపరాదు. అందుకే రామాయణకర్త ఈమూడింటిని మాత్రమే పేర్కొంటాడు. అది శ్రీరాముని లౌకిక జీవితం మాత్రమే కదా! వ్యాసభగవానుడు శ్రీకృష్ణ భగవానుని విశేషించి భాగవతంలో వర్ణించి అతను అన్ని సామాన్య ధర్మాలకు అతీతుడైనట్లు చెబుతాడు.

మోక్షం సర్వాతీతం దాన్ని అనుసరించుటే మానవధర్మం అంతేకాని మనిషి దాన్నిసైతం ఒక వరుసలో పెట్టుకొని ఆ క్రమముతో అనుసరించటం కాదు. మోక్షాపేక్ష లేనప్పుడు దానిజోలికి పోకుండా ధర్మార్థ కామమయ జీవితాన్నే గడపాలి. మోక్షాపేక్ష కలిగిందా సర్వధర్మాలను పరిత్యజించి దాన్నే అనుసరించాలి. మోక్షం అస్పర్శ విశేష ధర్మం, దాన్ని ఈ మూడింటితో కలుపరాదు; అలౌక్యాన్ని లౌక్యంతో ముడివేయరాదు.

గౌతము డీ సందేశం ఇవ్వటానికే నన్నట్లుగా సాహసంతో లౌకిక ధర్మాలన్నిటిని అలౌక్యంకోసం పరిత్యజించివేశాడు.

"వరవి నిరువది తొమ్మిదేం డ్లరుగు తరిని
విశ్వ మానవ దుఃఖమ్ము వెడలచేయు
పథము వరయగ రాజ్య సంపదను కూడ
విడవి వెడలెను సిద్ధార్థు డడవు లకును. (3-117)

సంసారాటవి కన్న ఘోరమైన దేదీ కానరాదుకదా! ఈ సంసారారణ్యమునుండి బైటకు పడితేచాలు వానికి సత్య దర్శనం ఖాయం. ఈ జన్మలో దొరకవచ్చు మరు జన్మలో దొరకవచ్చు, కాని సంసారాన్ని వీడితే చాలు. ఇక అంతా భగవద్రాజ్యమే! ఆ రాజ్యమునుండి వెనక్కి వచ్చే ప్రమాదాలు లేవు. ఎందుకంటే భూకక్ష్యలో ప్రవేశించిన రాకెట్టును ఇక యితర గోళాలు ఏమీ చేయలేవు. భూమాత ఆరాకెట్టును తనవైపు తానుగానే లాక్కొంటుంది. భగవద్రాజ్యం కూడ అంతే! ఒక్క మారు భగవంతుని పరిసరాలలో ప్రవేశించామా ఇక భగవంతుడే మనలను తన దరి చేర్చుకొంటాడు.

గౌతముడు రాజ్యారణ్యాన్ని వదలిన తర్వాత క్రమంగా పురోగతి సాధించాడు. అనేక మార్గాలలో పడి ముందుకుసాగి పోయాడు. చివరకు గయలోని బోధివృక్షం చెంత పరమ శాంతిలో నిమగ్నమైనాడు. దీన్ని కవి ఎంత హృద్యమంగా చెబుతున్నాడో చూడండి.

"అవి సుగతుని యిరువది యె
న్మిది రోజుల నిష్ఠ హృదయ నీ రేజములో
ప్రిదిలెడు జ్ఞాన దళమ్ములు
సదమల నిర్వాణ సార సౌరభ ముకలెన్. (4-125)

"నిరతి శయ భవ జలధి సంతరణమునకు
సాధనము తోచినట్లుగా శాక్యమునికి

దీర్ఘతరమైన యజ్ఞాన తిమిరములను
త్రోసివేయుచు పూర్ణచంద్రుడు జనించె". (4-126)

"క్షితిని పాలించు సర్వార్థసిద్ధి రాజు
గౌతముం డయ్యె లోక దుఃఖము హరింప
లోక శోకాంత మార్గావలోకనమున
బుద్ధ డయ్యెను జ్ఞాన సముద్రుడయ్యె. (4.127)

సిద్ధిపొందిన తర్వాత కూడ దానిని నిలుపుకొనుట కూడ సాధనలో ఒక దశ. విశ్వామిత్రు డెన్నిసార్లు పతనం చెంద లేదు? కాని నారాయణ ఋషి మాత్రం స్థితప్రజ్ఞతోనే ఉండి తనను పతనం వేయవచ్చిన కామున్నె తన దివ్య సౌందర్య దీప్తితో పరాజయం జేశాడు.

జ్ఞాని అయిన బుద్ధుణ్ణి కామం ప్రలోభ పరచబోయింది. కాని బుద్ధుని ముందా కామాధిదేవుడు మూఢుడు ఘోరపరాజయం పొందాడు,

'బేసి కంటి వాని రోసమ్ముతో మేను
నాశ మగుటచే ననంగు డయ్యె
తిరిగి నేడు బుద్ధదేవుని నవ్వుతో
హృదయమే నశించ చెదరిపోయె. (4.14')

ప్రతి ఆధ్యాత్మిక సాధకుడు ఇది గ్రహించాలి. కాని సాధనకు ముందు, సాధన దశలో, సాధనానంతరము కూడ

ప్రలోభ పరుస్తుంటుంది. కామం దుర్భేద్యమే కావచ్చు. కావి దాన్ని జయించక తప్పదు. కనుకనే సాధకులు సాధ్యమైనంత వరకు లౌకిక వాసనలకు దూరంగా ఉండే ఆ అలౌకిక నిర్వాణ స్థితిని పొందగలరు గాక అని కవి బుద్ధ చరిత్రద్వారా అందచేస్తున్నాడు.

ఆ తర్వాత బుద్ధుడు లోకులకు బుద్ధి గరప వెళతాడు. అది అతని స్వంత విషయం. మనకింత మాత్రం సందేశం చాలు.

కావ్యము – దాని సంక్షిప్త పరిచయము

పై సందేశం "బుద్ధ పురాణం" అనే యీ కావ్యాన్ని అనుసరించి తెలియజేయటం జరిగింది. బుద్ధపురాణమనే ఈ కావ్యంలో (9) పర్వాలున్నాయి. అవతార. ప్రమోద. నిష్క్రమణ పర్వాల్లో కవి స్వీయ కథనము. బుద్ధ జననము బాల్యాది అవస్థలు. వివాహ బంధము. వైరాగ్యం-ఆ తరవాత రాజ్య పరిత్యాగము. వివరింప బడినాయి.

అన్వేషణ. పర్వంలో బుద్ధుని సాధనలు చివరకు ఆత్మబోధ కలిగిన వివరాలు తెలియచేయబడ్డాయి.

సంచార. పర్వంలో తనకు లభించిన జ్ఞానాన్ని లోకుల కందరికీ ముఖ్యంగా రాజ్యాలేలే రాజులకు స్పష్టపరచి తద్వారా జనంలలో సుఖ శాంతులు నెలకొల్పుట మనకు కనబడుతుంది.

సుందరీనంద. పర్వము విశిష్టమైనది. లౌకికానందానికి అలౌకికానందానికి మధ్య జరిగిన అపూర్వ పోరాటం ఇందు ధ్వని గర్భితమై ఉంది. లౌకిక సౌందర్యాధిదేవత యైన మానవ సౌందర్యం ఆత్మ సౌందర్యాధిదేవత అయిన బుద్ధుని ముందు ఎందుకూ కొరగాకుండా పోతుంది. తరుణి అందాన్ని క్రోలుతున్న మనిషి తథాగతుని ఆదేశంతో దాన్ని తిరస్కరించి వేయుట కనిపిస్తుంది. ఆత్మ సౌందర్యంముందు అతివ సౌందర్యమెంత? ఈ విశిష్ట వృత్తాంతం సుందరీ నందుల కథ ద్వారా కవి తెలియ జేస్తాడు.

జాతక కథా. పర్వములో బోధిసత్త్వుని వివిధ జన్మగత వృత్తాంతాలు అతనుచేసిన కార్యాలు తెలుపబడ్డాయి.

ఎనిమిదవ పర్వం నిర్వాణ పర్వంలో తథాగతుని మహా పరి నిర్వాణము. అంటే ఇహలోక అవతార ఉపసంహరణం తెలియజేయబడింది.

ఆ తర్వాత బుద్ధుని ధర్మం ఎవరెవరు ఎలా ప్రచారం చేసి వ్యాప్తిలోకి తెచ్చారో ఆవిషయాలు చివరిదైన "విశ్వవ్యాప్తి పర్వం" చెప్తుంది. ఇందులో అశోకుని కృషి హర్షుని కృషి చాలావుంది. అశోకుడే బుద్ధ ధర్మాన్ని ఆసియా ఖండ మంతా వ్యాపింప చేశాడు. శిలలపై చెక్కించి దూతలను పంపి భిక్షుకులను పంపి బౌద్ధ విహారాలు స్థాపించి ఎంతగానో కృషిచేశాడు.

తానుగా బౌద్ధ ధర్మానికి అంకిత మగుటే కాక తన పుత్రీ పుత్రులను కూడ అందుకై నియోగించినవాడు అశోక చక్రవర్తి.

## కావ్యం లోని విశేషాలు

1 ప్రకృతి రామణీయకతలు : ఈ కవి ప్రధానంగా ప్రకృతిమాత ఒడిలో పెరిగి జీవించినవాడు. ఇప్పటికనీ ప్రకృతి మాతనే సేవిస్తూ జీవనం గడుపుతున్నాడు. ప్రకృతి తల్లి ప్రేమ చ్ఛాయలో సేదదేరుతున్న వారికి ఆమె సర్వవిధాలా శాంతిప్రసాదిస్తుందనటానికి ఈ కవి జీవితమే ఉదాహరణము.

శ్రీ పెన్మెత్స రాజంరాజు ప్రకృతిమాత ద్వారా తాను పొందిన అనందాలను వీలుదొరకినపుడెల్లా బుద్ధపురాణ కావ్యంలో చిత్రించి పాఠకులచే కూడ ఆ రసామృతాన్ని పానం చేయిస్తాడు.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. ప్రకృతిని చూచి ఆనందించేవారు సామాన్య మనస్తత్వం కలవారు కారు. మామూలు మనుషులూ చూస్తారు. కొండలు కోనలు సెలయేర్లు అరణ్యాలు నదులు సముద్రాలు పశుపక్ష్యాదులు తరులతాది ప్రకృతిమయ జీవాళిని.

అయితే ఎంతమందిమి ప్రకృతి దివ్యత్వాన్ని గ్రహించి స్పందిస్తాం ? ఎంతమందిమి సూర్యోదయాస్తమయాలను చూచి దివ్యానందానికి లోనౌతాం ? ఎంతమందిమి వర్ష ధారలను వినీల గగన చంద్రుని చూచి మురియగలం?

ఎంతోమందిలో యే ఒక్కరో ఈ మహదనుభవాలను పొందుతారు. ఒక రవీంద్రుడు ఒక వర్డ్సువర్తు. ఒక దినకర్. ఒక కాళిదాసు ఒక వాల్మీకి ఒక మిల్టన్ లేక టెన్నిసన్ ఇలా వేల వేల మందిలో వ్రేళ్ళపైనే ఉంటారు ఇలాంటివారు. కాని విశేష మేమంటే ఇలాంటి ఏకొద్దిమందో ప్రపంచంలో చిర యశస్సును గొని మరీ జీవిస్తారు.

ప్రకృతిమాత నుండి ఆనందాన్ని గ్రహించేవారి మనస్సు భగవత్తత్వానికి అతి చేరువగా ఉంటుంది. వారు ఆధ్యాత్మిక జీవులైతే తప్ప ప్రకృతిలోని ఆనందాలు లభ్యంకావు. బుద్ధ పురాణం రచించిన కవి హృదయం ఆధ్యాత్మికతా మయమైఉంది. అందుకే ఇందలి ప్రకృతి దృశ్య చిత్రణ పాఠకులను అలరించి వేస్తుంది.

అత్యున్నతోరు హిమాలయాగ్రము నుండి
  పరతెంచు సెలయేటి పరతి పాట
లలివిచ్చి కులికించు తెలిదమ్మి విందులో
  రొదసేయు కొదమ తుమ్మెదల యాట
కమనీయ వనలతాంతముల కౌగిలి పొందు
  మరిగిన పిల్ల తెమ్మెరల నీటు
నసివాసి ప్రియుదు రోదసి నెందు కనరామి
  తపియించు కోకనద దములపాటు
ప్రసవ మకరంద బిందు సంపదను కురిసి
హిమకణంబుల నీరాడి యేపు మీరు

తరుణ సుమ రాజీ వికస నోత్సవపు గోటు
స్వాగత మొసంగె నా రాజ చంద్రమునకు. (2-30)

సెలయేటి గలగలలు తుమ్మెద ఝుంకార భ్రమణాలు పిల్ల వాయువుల మందగతులు మంచుబిందువులతో నున్న కోమల సుమాలు ఇలాంటి వెన్నో మనకు గోచర మౌతుంటాయి. కాని వీటిలోని అందాలు ఆటపాటలు మన కెలా తెలుస్తాయి. కవి హృదయం తావాలండీ! కావాలి కవి హృదయం మనిషి కీమాత్రం స్పందన లేకపోతే ఇంతమాత్రం ప్రకృతిలో లీనం కాలేకపోతే. ఇక మనిషికీ పశువుకీ తేడా ఏమిటి ? రోజు కొక్కమారైన కృతిమాతను పరివృత్తి చేయండి. ఒక్కమారు ఆ కోనలోకి చూడండి, జూలో మీకేం కనబడతాయి. నీరసించి ఏడ్చే విలాపాలు మాత్రమే! మరిక్కడో!

బాలార్క కిరణ చుంబిత
లోన్నత శిఖర రాగ సంపద తమితో
కేకించుచు శుక పిక
హలమైన పెద్ద కోనను డాయన్. (2-29)

సజీవరూపంతో సచైతన్య స్వభావంతో మీకు పశు పక్ష్యాదులు కొండలు కోనలూ దర్శనమిస్తాయి. మీలో నిర్భయత్వాన్ని ప్రసారం చేస్తాయి. ప్రకృతి తప్ప మనిషికి మంచి గురువు ఎవ్వరూలేరు. మనసును ఏకాగ్రంచేసి ఆ కూతలు వినండి ఆ శిఖరాలు చూడండి ఋషుల కంతా ఈ ప్రకృతియే జ్ఞాన విజ్ఞా

లను ప్రసాదించింది. యోగాసనాలన్నీ ఈ అడవి జీవులను చూసే సృష్టించారు. ఆరోగ్య సూత్రాలన్నీ వనాలను పరిశీలించే సృష్టించారు. ప్రకృతిమాతకు దగ్గరకండి ఎందుకు దూర దూరంగా పోతారు. ఎందుకు కృత్రిమ వాతావరణంలో కూరుకుపోతారు?

చూశారా! అదిగో వినీలాకాశంలో ధవళకాంతు లీనుతూ
ఆ పక్షు లెంత క్రమబద్ధంగా వెళుతున్నాయో చూడండి.

"చారు సువర్ణ కాంతుల నెసంగు విహాయస కాంత దాల్చు ము
క్తా రమణీయ హార మనగా కలహంసలు శీతశైల కా
సారము చేర బారులయి సాగుచునున్న మనోజ్ఞయాత్ర న
క్కారుణి కాంత రంగుడు పఖావళితో తిలకించు చుండగన్.
(3-34)

వలసపోయే పక్షులు "V" ఆకారంలో వెళ్తాయని భ్రమించేవి బారులుతీరి పోతాయని పక్షితత్వ శాస్త్రజ్ఞులు చెబుతారు. వాటిలో ఉన్న క్రమత్వ నియమతత్వం మానవులలో ఎందుకుండరాదు ?

ప్రకృతి నుండి మన మెన్నోపాఠాలు నేర్చుకోవాలి. శ్రీ దత్తాత్రేయ భగవానునికి 24 మంది గురువులని భాగవతం చెబుతుంది. వారంతా ప్రకృతి మయులే చెట్లు పక్షులు చేపలు ఇవన్నీ దత్తాత్రేయునికి ఆధ్యాత్మికతలో పాఠాలు వల్లిబోధిస్తాయి. మనలో గొప్ప గొప్ప శాస్త్రజ్ఞులు సైతం ప్రకృతినుండే అనేక విషయాలు గ్రహించారన్న సంగతి మరువ వద్దు విమాన సృష్టికి వినువీధి

నెగసే పక్షి, స్టీమరు సృష్టికి నేటిపై తేలియాడే చేపలు, జలాంత
ర్గాముల సృష్టికి కారణం సాగరాంతర జీవాళి, ఇలా ప్రకృతి
మాతయే మన శాస్త్రీయ పరిశోధనలకు కారణమైనది.
ఔతుంది కూడ.

అయినా ప్రకృతిమాయ పాఠాలు గ్రహించుట మనధర్మం.

"హాయలుగా విను వీధి పయనంబు సాగించు
జలదంబు చేయు నిస్వార్ధ సేవ
లోకాంధకారంబు పోకార్చ పద్మినీ
విభు డొనర్చెడు జగద్వినుత యాత్ర
దూర పరీవృత దుర్గంధమును తోలి
తనిసెడు సుమవల్లి త్యాగబుద్ధి
తనలోని బడబాగ్ని కనలు చున్నను విశ్వ
కళ్యాణమును గోరు కడలి హోరు
ప్రతిదినంబు హృదయ పద్మమం దేదియో
భావసుధను చిలికి జీవితమును
సార్థకంబు చేయజాలు మార్గ మెరుంగ
చింతనం బొనర్పు శ్రీఘనుండు, (3-57)

మబ్బుల నుండి నిస్వార్ధ సేవను రవినుండి లోకకళ్యాణ
కార్యతత్పరతను సముద్రమునుండి విశ్వకళ్యాణాన్ని ఇలా ప్రతి
దృశ్యమునుండి మనం పాఠాలు నేర్చుకోవాలి. నేర్చుకొను

కెందుకు ? మాతృగర్భ నరకంనుండి శాశ్వతంగా తప్పించుకో టానికే! అదే సార్థకమైన జీవనం.

,,ఆకాశా రామా విహార భూములు చూడ
జాలిన తుహినాద్రి సమ్మదంబు
సకల భూతముల విశ్రాంతికై వెన్నెల
పాలు వోయు హిమాంశు ప్రాభవమ్ము
పట్టి పాములు తన్ను భక్షింప కుందని
శ్వసనుని సముదార సహనశక్తి
ప్రతిఫలంబును గోరు వాంఛయే లేనట్టి
తరు లతాదుల ఫలదాన పరత
చెక్కు చెదర కన్య చింతన యే లేక
అఖిల జీవులకు సదా దరమున
నీరమొసగు రోహిణీ నదీ దానమ్ము
మనన చేయుచుండు జినుడు మదిని. (2-58)

త్యాగశీలత. సేవానిరతి. నిష్కామత్వం, నిస్వార్థత, ఇవి అధ్యాత్మిక జీవితానికి తోడు నీడ లౌతాయని స్వామీ వివేకానం దుల వారు పదేపదే చెబుతుంటారు. వారు తమ రచన లన్నిటి లోను వాక్కులలోనూ యీ మూలసూత్రాలనే పరిపోషిస్తారు. రాజయోగం గాని కర్మయోగం కాని భక్తియోగం కాని వారి ఏ వివరణలు గ్రహించినా వాటిలో యీ మూలసూత్రాలు తప్పక ఉంటాయి. మానవుడు మహాత్ముడు కావలెనంటే వీటిని సదా

మది నుంచుకొని వివేకముతో విచారణ చేయవలసి ఉంటుంది.

కవి ఆధ్యాత్మిక జీవి అయితే తప్ప ఇంతటి ఉదాత్తమైన సందేశాత్మక వర్ణనలు చిత్రించ బడవు. పెన్మెత్స రాజం రాజు కవి బాల్యమాదిగ ఆధ్యాత్మికతా హృదయం కలవాడు. జీవితం నుండి పరిసర మనుష్య వ్యవహార ప్రవృత్తులనుండి ప్రకృతి దృశ్యాల నుండి ఆధ్యాత్మికతా పాఠాలు నేర్చుకొని యిప్పుడు ప్రశాంతమైన జీవితం గడుపుతున్నాడు.

బుద్ధ పురాణంలోని ప్రకృతి వర్ణనలన్నీ సందర్భోచితములై ఇలా గంభీర భావాలతో కూడి ఉన్నవి.

(క) తత్వ విచారణ ; యోని నుండి గమించి తిరిగి యోనిని చేరుట-అది అధోగతి. కుండలినీశక్తి అధోముఖమై ఉంటే సంసార లంపటము మోహాసక్తి పెరుగుతాయని ఆశక్తి ఊర్ధ్వగామి అయిన హృదయ గ్రంధులు వీడి సంసార బంధాన్ని దాటుతుందని యోగక్రియలలో చెబుతారు.

"సార హీనమైన సంసార కూపమే
నిత్యమనుచు వెలికి నిగిడి రాక
మెలగు చుండు వాని మృత్యువు దిగమ్రింగు
మరలపుట్టు వాడు ధరణియందు. (5-19)

మరల పుట్టుకలేని తత్వ మెఱుగుటయే మనిషి కర్తవ్యం.

(బి) మార్గం : ఈ తత్వానికి మార్గముంది దాన్ని అనుస రించిన తప్పక లభిస్తుంది.

"దానము శీలము తలుప నిష్కర్మ
సరవి నధిష్ఠాన సత్యమ్ము కరుణ
క్షాంతి యుపేక్ష ప్రజ్ఞా వీర్యములను
పది పారమితల సమ్ముద చిత్తు లగుచు
పూరించి నిర్వాణమును బొంద నగును. (5-15)

ఇది బుద్ధుడు తత్వ (నిర్వాణానికై) చూపిన పారమితలు. కవి ఈ కావ్యంలో పలుచోట్ల ఈ తత్వ విచారణ అతి రమ్యముగా చేస్తాడు సహృదయులు ఆ తత్వాన్ని అరయుదురుగాక!

(గ) బోధలు : మనిషికి సందిగ్ధావస్థలో మంచి బోధ ఎంతో సహకరిస్తుంది కవి పలు పాత్రల ద్వారా ఈ బోధలు. నీతిబోధలు చేయిస్తాడు. మచ్చుకి ఒకటి రెండు చూద్దాము.

పగ ! "పగ వలన పగ నశించదు
జగతీ వలయమున నెట్టి సందర్భమునన్
పగ నణచివేయ ప్రేమయె
సుగమ పథము దాని విడువజూడకు తనయా. (5-16)

స్వర్గం : "లోక మావల కాదు యీ లోకమందె
స్వర్గ నరకంబులుండె నిస్సంశయముగ
సత్యము నహింసతో భుజన్కందమందు

నిలుప స్వర్గంబుగా మహీవలయ మగును. (5-43)

ప్రేమ : "కల్లలాడ వద్దు కలనైన నొరులను
దూర వద్దు చెడ్డత్రోవ నడుగు
పెట్టవద్దు పరుల ప్రేమించి వారల
ప్రేమ చూరగొనుడు బిడ్డలార. (6-15)

ఇలాంటి రమ్యమైన సందేశాత్మకమైన బోధలు కావ్యంలో మనకు చాలచోట్ల దర్శనమిస్తాయి. వాటిని పాఠకులు సంగ్రహించుకుంటే అశాంతిగా ఉన్నప్పుడు చదువుకొనుటకు వీలుగా ఉంటుంది. బాల విద్యార్థులకు వీటిని నేర్పితే వారిలో మానసిక ఔన్నత్యం కలిగే అవకాశముంది.

ఇవియే కాక కవి అనేకమైన లౌకిక పారలౌకిక విషయాలు సందర్భానుసారం తెలిపియున్నాడు.

## కవిత్వము

"బుద్ధపురాణం" కవి అయిన శ్రీ పెన్మెత్స రాజంరాజు సహజ కవి. ఇతని కవిత్వం, నేర్చుకొని అభ్యసించి వచ్చినది కాదు. పిన్న వయసులోనే కవితాధార ఇతని హృదయం నుండి వెలువడింది. సహజ కవితాధారకు తోడు భావుకుడు కూడ అగుటచేత ఇతని కవిత కొక నిండుదనం వచ్చింది. కవి కేవలం భావుకుడే కాదు మానవతా హృదయం కలవాడు అందుచే ఇతని కవిత సూటిగా హృదయాల్లోనికి చొచ్చుకుపోతుంది.

ఇంత వరకు మీరు ఇతని కవితా రీతిని చూచారు కదా! అవి ఎంత సరళంగా ఉన్నాయో అంత ధారాళంగా ఉన్నాయి. కాస్త రసజ్ఞుడైన పాఠకుడైతే చక్కగా కంఠంవిప్పి పాడుకోవచ్చు.

"బుద్ధ దేవుని పురంబునకు తోడ్కొనిపోయి
తనయింట నాతిథ్యమును నొసంగి
శ్రీఘనుం డటవీవ్ర చెంగట గల జేత
వనమున నివసింప మనసు పొడమ
దానికై బంగారు నాణెములుల్ పరచి య
నాధ పిండుడు కొని నమ్రుడగుచు
ప్రభువు కర్పణ చేయ భద్రాత్ముడందు స
శిష్య సంయుతుడై వసించి ముక్తి
మార్గ మెరింగించుచుండ కోమటి యశేష
భోగములు వీడి వవ ధర్మ బోధకాలకు
జీవితమ్మును ధనము వెచ్చించి దీన
సేవలో మున్గి సార్థక జీవి యయ్యె. (8-8)

మరొక పద్యం చూడండి,

"ఇతడు జన్మస్థలి కేగునాడు కుమార
హర్షుబు భక్తి ప్రేమాతిశయత
విడువనేరక చాల వివశులై పదయోజ
నముల దవ్వేగి వినమ్రులగుచు

కౌగిట చేర్చి లో కన్నుల నీరూర
వీడ్కోలొసంగిన వెడలి మాతృ
భాషలో భరత భూ భాగాన తా గన్న
వింతలనెల్ల సవిస్తరముగ
కావ్యమల్లి మూట కట్టుక పోయిన
గ్రంథములను సూరి గణము మెచ్చ
ననువదించె జీవితాంతమ్ము వరక చం
చలిత మైన దీక్ష చౌకళింప (9-143)

ఎంతటి గంభీర విషయమైనా యీ కవి చేతిలో సీసంలా కరిగి పోతుంది అది యీ కవి కవితా విశిష్టత.

పోలికలు : కొందరు ప్రాచీన కవుల పద్యాల నడకలను కూడ యీ కవి స్వీకరించి వారియందు తనకున్న గౌరవాన్ని వ్యక్తపరుస్తుంటాడు. పాఠకులు కావ్య పఠనంలో ముందుకు పోతున్నకొద్దీ అటాంటి పద్యాలు కనబడతాయి. అయినా భావాలలో స్వతంత్రత కానవస్తుంది.

ఛందస్సులు ; తిక్కనకు ప్రియమైన కంద పద్యాన్ని ఈ కవి చాల నిపుణంగా రచిస్తాడు. కందం చాల కష్టమంటారు కాని ఆకష్టం యీ కవి కేర్పడినట్లు లేదు.

''జను డందు ప్రజకు తృష్ణా
వి నివారణ పథము తెలుప వేలాది జనుల్
చనుదెంచి ధర్మ దీక్షను

ాదగిరి శాక్యమునిని కొనియాడి కడున్. (8-33)

వృత్తాలు ఇతర దేశీ ఛందస్సులు కూడ ఈ కవి అతి
గా ధారాళంగా కురిపిస్తాడు. పాఠకులా రసజ్ఞతను అనుభ
లరు.

అలంకారాలు ; కవిత్వంలో అలంకారాలు అనుకోకుండ
చ్చి పడుతుంటాయి. అందులో భావుకుడు ఆధ్యాత్మిక జీవి
కవి కవిత అలంకారాలతో విరాజిల్లుతూ ఉంటుంది. ఈ
పుడాలంలో మన కలాంటి రమ్యమైన అలంకారాలెన్నో
స్తాయి. నాకు వ్యాకరణం గూర్చి అంతగా తెలియదు.
స్థూలంగా అలంకారాలను ఒకటి రెండు పేర్కొంటాను.

ను కొండ లెదిరి దండిగా ఢీకొను
నట్లు పోరు చండె నుభయ
ములు జయమ్ము సమకూరు టెవరికో
గరాని యట్లు హీన ముగను.

తిశయోక్తి అలంకారం గర్భితమై యుంది.

ాజ లావణ్య సుమము దుస్సహ కరాళ
ంఘము వెత్తిపై రాలినట్లు
త్యాగమ్ము వినిన యాతలిరుబోడి
మూర్ఛల్లి నేలపై కూలిపోయె.

కవితా దోషాలు : ఎంతటివారి కవితలోనైన దోషాలు

ఎన్నటం కొందరు పనిగా పెట్టుకుంటారు. కాళిదాసు వాల్మీకి వంటి కవుల కవితల్లోనైతం ఏవేవో దోషాలు చూపుటకై ప్రయత్నిస్తుంటారు.

బుద్ధ పురాణ కావ్యం రమ్యంగా సరళంగా అర్థ గాంభీర్యంతో సాగిపోయింది. ఇంత మంచి యున్నప్పుడు దోషమేమైనా ఉన్నా అది లెక్కలోనికి రాదనే అనుకుంటాను. పాఠకులు ఈ అభిప్రాయంతో సమ్మతులౌతారనే నా ఆశయం,

## బుద్ధుని వ్యక్తిత్వం

పూవు పుట్టగానే పరిమళాలను వెదజల్లుతుంది. అలాగే మహనీయుల వ్యక్తిత్వం బాల్యంనుండే బయట పడుతుంది. బుద్ధుని వ్యక్తిత్వం ఎలా వికసించిందో కవి తన యీ బుద్ధపురాణంలో చక్కగా తెలియచేస్తాడు.

"తల్లి తనకిడు మధుర పదార్థములను
పేద బాలుర కొసగి సంప్రీతి వారు
తిని ప్రమోదము చెందగా మనమునందు
క్రిందు కొను వేడ్క నలరు రాజ్ఞందనుండు.

స్వార్థ పరిత్యాగం పరమార్థ చింతనయే మహనీయతకు తొలిమెట్టు. బుద్ధుడు ముందు ముందు పరుల దుఃఖాలను నివారించేందుకై పూనుకోబోతాడు. ఆ బీజాలు చిన్ననాటనే ఎలా అంకురిస్తున్నాయో కవి పై పద్యంలో తెలియజేస్తున్నాడు,

మనములో నేను, నాది అన్న భావంపోతే గాని ఇతర జీవుల యందు అహింస, కరుణ, వాత్సల్యం, సానుభూతి లాంటి ఉత్తమ గుణాలు చేకూరవు. బుద్ధునికి బాల్యంనుండే ఆ ఉత్తమ గుణాలు అలవడ్డాయి.

అందుకే క్రూరుడైన అంగుళిమాలుడు సైతం బుద్ధుని దర్శించగనే హింసాదూరుడై పోయాడు. అహింసావ్రతుల సత్వ దీప్తి ఎదుటివారిని కూడ సాత్వికులనుగా మార్చివేయగలదు.

బుద్ధుని వ్యక్తిత్వం జన్మతహగా వికాస దశను అందు కొన్నది కాబట్టె అచిర కాలంలోనే సర్వాత్మ భావనారూపమైన నిర్వాణ బోధను దర్శించ గల్గాడు.

శ్రీ పెన్మెత్స జగ్గంరాజు కవి బుద్ధుని వ్యక్తిత్వ వికాసాన్ని చక్కని చిక్కని పద్యాలలో రమ్యంగా వ్యక్తపరచాడు, పాఠకులు చదివి తప్పకుండా ఆనందించగలరు.

ఇంతటి మంచి కావ్యానికి నన్ను భూమిక వ్రాయమని కోరుటలో నా యోగ్యత ఏమీలేదు. అంతా ఆ కవియొక్క విశాల హృదయం ఆత్మీయత తప్ప మరేంకాదు. లౌకికులైన వారిచేత భూమిక వ్రాయించుట ఇష్టంలేక యోగ్యుడను సమర్థుడను కాకపోయినా నాచేత భూమిక వ్రాయించుకొన్నాడు.

కవియొక్క ఈ అపార వాత్సల్యానికి ధన్యవాదాలు. పాఠకులు ఈ భూమికను పఠించి బుద్ధుని దివ్యసందేశాన్ని కాస్త

ఋనా అలవరచుకొన్నా, బుద్ధుని వ్యక్తిత్వాన్ని పోషించుకొన్నా, అదే ఈ భూమిక వ్రాసినందుకుగాను అత్యధిక ఫలముగా భావిస్తాను.

అందరికీ ధన్యవాదాలు

ఇక బుద్ధ పురాణం చదివి ఆనందించండి.

హరిః ఓం సర్వం

శ్రీకృష్ణ పరబ్రహ్మార్పణ మస్తు

ఇట్లు,
"ఒక సత్యాన్వేషి"

29-10-1982
హైదరాబాదు.



శ్రీ పెన్మెత్స వెంకటరాజుగారు
(హిందీ [illegible]ర్) డి. యస్. ఆర్.
కాలేజి. భీమవరము

బుద్ధపురాణ
కర్త
రాజంరాజు

# అ భి నం ద న ము

రామ కృష్ణ నరేంద్రులే మాకు కీవ
పార మార్థిక గురుదేవు లైర హింప
అలివి పెన్మెత్స వేంకట రాజవరుడు
వ్యావ హారిక దేశిక ప్రవరు డగును.

ముప్పదారేండ్లుగా దయ మూదలింప
దంబ మును వీడి కష్ట సుఖంబులందు
తోడు నీడౌచు వితత సంతోష గరిమ
గారవము చూపుచుండిన ఘనుడు కరగి.

బుద్ధ పదాంకితమ్మయిన బుద్ధపురాణము యిర్వదేండ్లుగా
బద్దిత పేటి కాంతర నివాసముగా కవి ముద్రణార్థమై
యొద్దికతో ధనం బొసగె నూర్జితభక్తి నశేష దాతయై
సద్దయతోడ నీఘనుని శాక్యమునీంద్రుడు బ్రోచుగావుతన్

తమకు కృతి నీయ బడిన గ్రంథమును నేడు
అచ్చు వేయించి యిచ్చుటే యబ్బురంబు
కాగ దైవాంకితంబైన కావ్యములను
అచ్చు వేయించ ధనమిడు యధిపులేరి ?

# బుద్ధపురాణము

## విషయానుక్రమణిక

### అవతారపర్వము



### కథాప్రారంభము



### ప్రమోదపర్వము

## నిష్క్రమణ పర్వము



## అన్వేషణ పర్వము

సంచారపర్వము



సుందరీనందపర్వము

జాతకకథా పర్వము



నిర్వాణ పర్వము

## విశ్వవ్యాప్తి పర్వము

ఆనందుడు

అశోకుడు

కనిష్కుడు

శాతవాహనులు

పాహియాను

హర్షుడు

హూనిత్సాంగు

క్రైమోద్పు

శ్రీ బుద్ధగీత

(సంగ్రహము)





బుద్ధభగవానుని ధర్మచక్రప్రవర్తన ముద్ర
సారనాధము

# బుద్ధపురాణము

## అవతార పర్వము

### సంబుద్ధి

శ్రీకారంబు ఘటించినాడ, కృతి
కాశీస్సుల్ ప్రసాదించి, య
స్తోక క్లేశ విమూఢ మోహమయమై
శోషిల్లు, యీ మానవా
నీకాంతర్గత దీన జీవనలతా
నీకంబు పుష్పించి, సు
శ్లోకానంద రసాబ్ధి తేలుగతి
నాలోకించు బుద్ధ ప్రభూ 1

పాండిత్యం బిసుమంతలేని జడుడన్. ప్రజ్ఞావిహీనుండ. నిన్
గొండాడంగ దొరంగుచెల్లను. దయా కూపార నీవే సదా
దండన్ నిల్చి ప్రబోధ సేయుటను కాదే; లేక తా వత్కథా
కాండమ్మున్ వివరించు శక్తి కలదే? కాసంత నాలో ప్రభూ. 2

ఆమనిలో రసాల వని నారసి పొంగు పికాంగనం బలెన్
నీ మహనీయ బోధలు వి నిర్మల జీవితగాథ లన్నచో
నామన మూగిపోయి భవనాశ పదాంకితమైయెసంగు నీ
కోమల పాదమూల మునకున్ బ్రణమిల్లి భజించునో ప్రభూ. 3

అని. బుద్ధప్రభు నా మతించి కరుణాయత్తాత్ముడై నట్టి శ్రీ
ఘను చారిత్రము నేనెరింగిన గతిన్ కావ్యాకృతిం దీర్చ నె
మ్మన మందున్ దలపోసి సేద్యసుకళామాన్యుల్ మదీయాన్వయుల్
మును వర్ధిల్లిన తీరు దెల్పి పిదపన్ బూరింతు సర్వస్వమున్. 4

## స్వీయ చరిత్ర

పూర్వాంధ్ర భూపాల పుంగవులలో న
స్మరణీయ మగు ధనంజయ గోత్ర మందు
వినుత మౌ పెన్మెత్స వేశ్మ నామమున
రాజిల్లె ''రాజమ రాజు'' వర్యుండు
నాకు ముత్తాత యౌ మహనీయు డతడు
స్తవనీయ గౌతమీ సలిలమ్ము తోడ
చనుదెంచు చుండు గోస్తన నదీతీర
మున బొల్చు "సత్యవాడ" ను పెంపు కనిన
భూస్వాములం దొక్క భూస్వామియై యాంధ్ర
భాషా మనీషి నా ప్రఖ్యాతి వడసె. 5

ఆ రాజం రాజన్యు డు
మారకు లేవురును నిరుపమానోత్సాహ
స్ఫూరితులై మని వారి
ద్ధారుణిలో, సాటివారు తమ్మను తింపన్. 6

పృథుల గీర్వాణ భాషాప్రవీణ యగుచు
వెలయు సీతమ్మ, తనకు దేవేరి కాగ

సూర్యనారాయణా హ్వయ సూ్ర్తి నలరు
పత్రి తామహు డందులో మధ్యముండు. 7

ఆ దంపతుల సుకృ తారామ వీధిలో
పొలుపారు సంపంగి పూవురీతి
ప్రభవించె మత్పితృపాదు డౌ వేంకట
నరసింహరాజు భాసుర యశుండు
వడ్లూరుగ్రామ నివాసి వేగేశన
బంగారురాజుపుత్ర ప్రవిమలాంగి
లలిత పతివ్రతా తిలకంబు నానొప్పు
సత్యమాంబ కరంబు సంగ్రహించి
పైతృకంబైన యా సత్యవాడ నుండి
తరలి యేతెంచి యీ చోడవరము నందు
ప్రవిమలంబైన సేద్య జీవనము తోడ
పేరు వడసెను, సహజ సంస్కారి యనుచు. 8

నిరతము శ్రీహరి సేవా
పరులగు. యీ దంపతులకు ప్రభవించితి మి
ద్వర మందు రామ రాజన
వరలెడు సోదరుడు వెనుక వాడగు నాకున్. 9

జనకుని తాతయు జనయిత్రి తాత
రమణీయ తనులు రాజమ రాజులగుట
సకల బంధువులలో స్మరణీయ మనుచు
పిలుతు రా రీతినే ప్రేమతో నన్ను. 10

'రామా యమ్మాహ్వాయ యగు
భామిని గేహినిగ దీన బంధుప్రియయై
క్షేమముల నరయుచు నుండం
గా, మా కిల బొడమె పుత్రి కాత్యాయ మెలమిన్. 11

'సంఘ మిత్రయు, 'రుక్మిణి, 'శారదాఖ్య,
నలరు దుహితలు మమ్మ నెయ్యమున గొలువ
'రంగ రాజను, జామాత రహిని సేద్య
జీవనంబున తోడ్పడి చెన్ను మీరె. 12

ప్రాథమిక విద్యతో నేను బడిని విడిచి
ద్వాదశాబ్దాల శైశవ ప్రాయమున నె
జనకు నానతితో వ్యవసాయమందు
లీనమైనాడ నానంద మానసమున. 13

అసమ సౌందర్య ప్రకృతి గేహాంతరమున
అధివసించియు దర్శించ నలవి కాని
విశ్వ నిర్మాత కొలువులో వివశమంది
సహజ సాహిత్య రస పిపాసకుడ నైతి. 14

వ్రాసి యుంటిని శైశవ ప్రాయమున రామ
చంద్రాద్రి కి తమ్మిగా శతక మొకటి
కల్పించితిని పెక్కు ఖండకావ్యమ్ములు
"చిత్రవాణి" సమాఖ్యను చెన్ను మీర
సంతరించితి మున్నె "సంయుక్త" పృథ్వీరాట్

చరిత్రమ్మను కవీంద్ర చంద్రు లెన్న
స్వీయాంతరంగ నంవేదనా భరమైన
"ప్రణయ తపస్విని" పలికియుంటి
"అమరలోక" "నలీమాల" కొమరు చాటి
సమయ సీమను తమ సాటి జనుల వలన
ప్రదిలి దురపిల్లు ఉద్విగ్న హృదయములను
స్పష్ట పరచితి నా యథాశక్తి కొలది. 15

అభిలాష

భూరుహ శాఖ వీడి పడిపోయిన పక్వ ఫలమ్ము రీతిగా
కోరిక లంతరించ తనకుం గల సర్వము వీడి విశ్వ సం
సారము నందు మ్రగ్గెడు రుజాయుత దీనులనోమ సత్కృపా
వారిద మాలయై వెలయు వారి చరిత్ర దలంతు సర్వదా. 16

"ఆత్మ వత్సర్వ భూతాని" యను పవిత్ర
ధర్మ మాలించి హృదయ పద్మము ద్రవించు
శాక్యసింహుని నిర్వాణ సరణి వినిన
భువన మంతయు రోమాంచమును వహించు. 17

బాల్యమాదిగ యీనాటి వఱకు కృషిక
జీవనుడ నయ్యు సాహితీ సేవయందు
మునిగి తేలుచు ముప్పది మూడుయేండ్ల
ప్రాయమున "బుద్ధ చరితంబు" వ్రాయు చుంటి. 18

విశ్వ సాహిత్య జగతిలో వేనవేలు
శాస్త్ర విజ్ఞాన మహనీయ శక్తియుతులు
స్వీయ కవితా విశిష్టతల్ చింది పార
చెప్పి యుందురు సర్వార్థ సిద్ధి గాథ. 19

ప్రతిబా వ్యుత్పత్తుల సం
గతి వడయని నే వహో జగన్నుత మహిమా
న్వీత జిన చరిత్ర వ్రాయుట
కతని ప్రబోధమున గాక సన్యము కలదే ? 20

పలుకు నది బుద్ధ చరితము
పలికించెడు వాడు బుద్ధ భగవానుండౌ
పలికెద భవ బంధ నములు
తొలగుటకై సుప్రశాంతతో వెలయుటకై. 21

పంచ లక్షణములతో రచించ బడిన
యది పురాణంబు నా జెల్లునండ్రు బుధులు
పంచ లక్షణములు చూప బడని దయ్యు
తనరు నియ్యది బహు పురాతన చరిత్ర. 22

వి న తి

రాజ హంస ప్రాణ రక్షకా నీ పాద
పద్మయుగళ మెదను బాదు కొలిపి
ప్రస్తుతించు వాడ భవ బంధనంబులు
బాయుటకును ముక్తి వడయుటకును. 23

వ్యాకరణా లంకారపు
శ్లోకదల నెరుంగనట్టి మూర్ఖుడ నయ్యున్
నీ కరుణా లోకనములు
నాకృతి కాధారమని ఘనంబుగ నెంతున్. 24

కరుణా విధి యగు బుద్ధుని
చరణ రజము మౌళిదాల్చి జగతీ స్థలిలో
స్థిర కీర్తి గనిన శాక్యుల
వర వంశము నే నెఱుంగు వర కెరిగింతున్. 25

# కథాప్రారంభము




## శాక్యులు

సరలోక వంద్యమై భా
స్కర వంశోద్భవ నృపాల చంద్రుల కిరవై
సరయూ తటాంచ లమ్మున
వరలు నయోధ్యా పురంబు భరతోర్వరపై. 26

ధర కలంకాత భూతమా తత్పురంబు
నేలెను "సుజాత" నామ నృపాల మౌళి
సగర మన్వాది నృపుల భాస్వ ద్యశస్సు
తనమహస్సున లుప్తమై చనగ తొల్లి. 27

అతడు సహధర్మ చారిణి యందు★ పుత్ర
పంచకంబును పుత్రికా పంచకమును
పడసి మహనీయ స్వర్లోక వైభవముల
దేలుచుండెను రిపు కోటి దిగులు పడగ. 28

భౌతికానంద లంపటత్వమ్ము కొంత
పొడుగు కొనియున్న కాముక హృదయు డగుట
నొక మృగాక్షి "జయంతి" పై నొప్పుదాని
దాసుడై యుండె నినకులోద్భవ నృపుండు. 29

ఆ రుచిరాంగి వ శంవదు
డై రాజొక నాడు తమిని డాసి ప్రియా నీ
కోరిక యేదైనను నెర
వేరుతునని పలికె కామ వివశుం డగుచున్. 30

కోరె నామె తన కుమారు "జయంతుని"
రాజుచేసి యితర రాకుమార
వరుల సీమనుండి తరిమివేయు మటంచు
క్షితిలేంద్రు గుండె ఝల్లు మనగ. 31

---

★ పుత్ర పంచకము. ఓపురుడు, నిపురుడు, కరకండకుడు: ఉల్కాముఖుడు, హస్తిశీర్షుడు, అనబడువారు పుత్రికా పంచకము జల. జలి, శుద్ధ, విమల, విజీత అనబడు వారు.

పాయ కేపొ్రద్దు వ్రుణయ విహాయసమున
నాట్యమాడెడు నృపతి మానసఖగమ్ము
తేనెపూసిన కత్తెయౌ తీపులాడి
క్రూర తాంక్ష శరాహతిన్ గూలి కుమిలె. 32

ఆడిన మాట తప్పని ధరాధిపు డా వగలాడి యట్లు తన్
వేడగ తల్లడిల్లి పరివేదన చెంది మనంబులోన మా
రాడుట పాడిగాదని నిజాత్మజులన్ బిలిపించి సర్వమున్
వీడని ప్రేముడిన్ వినిచె విజ్ఞులు తన్ గని నిందసేయగన్. 33

పితృ భక్తి పరాయణులగు
క్షితినాథుని తనయులెల్ల చింతింపక యే
పితృ రాజ్య రమకు దవ్వుగ
ధృతి మతులై చనిరి పొరుగు దేశమ్ములకున్. 34

రాజు, కుమార వర్గమును రాజ్యమునుండి బహిష్కరించగా
రాజ కుమారులందు అనురాగము గల్గిన పౌరు లెందరో
రాజును దూరి బంధు నికరమ్ము సతీ సుతులెల్ల వెంట రా
రాజ కుమారులం గలసి రాజ్యము వీడిరి త్యాగమూర్తులై. 35

కోసలేశ్వరు డనా యాసంబుగా వారి
కాశ్రయం బొసగి నెయ్యంబు చాట
సమ్మోదమంది సుజాతుని కొమరులు
నిజ ప్రజానీకమ్ము నెమ్మి కొలువ

వర్ధిల్లుచుండి రవ్వ సుమతీ నాథుడు
వారెల్ల రభివృద్ధి వడసి తనకు
యే కీడుకూర్తురో యెరుగ రాదని యెంచి
తరిమివై చెను రాజధానినుండి
యోగ్యు లయ్యును స్వీయదౌర్భాగ్య వశత
ఆశ్రయము గోలుపోయి వెన్నంటి వచ్చు
పౌరులంగూడి భీకర వనపథాల
తరలిపోయిరి హిమగిరీంద్రమ్ము దెసకు 36

ఉ॥ హిమశైల సానువులయందు దయించి స్రవించు రోహిణీ
వాహిని యొడ్డునన్ బ్రకృతి వైభవమున్ వెదజల్లు దృశ్య సం
దోహము లెల్లవారి కనుదోయికి విందొన రించ నైహికో
త్సాహ పవిత్ర జీవనము సల్పుటకందు వసించిరెల్లరున్ 37

కపిల మహాముని పూర్వము
తపమొనరించిన పవిత్ర ధారుణి యందా
నృపతులు నిర్మించిన పురి
కపిల వస్తు నామమున జ గన్నుతి గాంచెన్. 38

1 ★ పురిశాకకూట వనమున
వరలుటచే వారు శాక్య వంశము వారై
ధరణీవర మండలిలో
చిరకీర్తి గడించుకొనిర శేషప్రజ్ఞన్ 39

2 శత యోజన విస్తీర్ణ
క్షితి తమ కైవసముగాగ శీఘ్రోన్నతితో
అతుల కళాహేళా సం
గతమై తద్రాజ్యలక్ష్మి రాజిల్లె కడున్. 40

అల సుజాతుని బిడ్డలందు కనిష్ఠుడౌ
హస్తిశీర్షుని పుత్రుడతుల బలుడు
శుద్ధోదనుండన చెలువారు వానికి
నలుగురు కొమరులు లలితతములు.
శుద్ధోదనుండును శుక్లోదనుండు ధౌ
తోదనుండన నమృతోదనుండు

---

1 * సూర్యవంశజుడైన సుజాతుని కుమారులు కపిలవస్తు నగర నిర్మాణము చేసిన పిదప సగోత్రకన్యల వివాహమాడిరనియు తన కుమారుల అభివృద్ధివీనిన సుజాతుడు ముదిత హృదయుడై తన తనయులు సగోత్రీయ కన్యల పెండ్లియాడుట శాస్త్రసమ్మతమా? అని బ్రాహ్మణ పండితులతో చర్చించగా వారు రాకుమారులు తామున్న పరిస్థితిని బట్టి వివాహమాడిరిగాన నది "శక్యము" శాస్త్రసమ్మతము అని నిరూపించుటవలన వారందరు శాక్య వంశమువారన బ్రసిద్ధి వడసిరనియు కొన్ని చరిత్రలయందు కలదు, కాని నాకిది సమంజసముగా తోచుటలేదు.

2 * బుద్ధుని జనము నాటికి శాక్యుల రాజ్య విస్తీర్ణము 900 చ. మై.ని కొందరు చరిత్రకారులు వ్రాసియున్నారు.

ననువార ఉదయించి రావెన్క సత్యంత
సుందరాంగి మరాళ మందగమన
"అమిత" యను పుత్రికారత్న మవతరించి
యౌవ నాంకుర వేళనే జీవితమ్ము
భగ్నమైపోవ స్వీయదౌర్భాగ్యవశత
కుష్టజాడ్యప్రపీడ్యయై కుమిలె మిగుల 41

విపుల సామ్రాజ్యనేతలౌ నృపకుమారు
లనుగుసోదరి రోగమ్ము నపనయింప
కడు శ్రమించియు సఫలతకాంచరైరి
మీరరాదౌర ప్రారబ్ధమేరికైన. 42

అనుభవపూర్ణుడైనె గడినట్టి భిషగ్వరుడొక్కరుండు కా
వన గిరి గహ్వరాంతరమువన్ నివసించిన నామయంబు
పోవుననుచు నిశ్చయించ నృపపుంగవ సూనులు సోదరీమణిన్
వనమున నిల్పియందు తగు వారల బంచిరి సేవ చేయగన్. 43

వన మహౌషధ గంధ వహ స్పర్శవలననో
తనపురాకృత సుకృతమ్ము వలనొ
ప్రళయ భీకర మేఘ పటలమ్ములోజిక్కి
తిరిగి వెల్వడ్డ చంద్రిక విధాన
పూర్ణేందువదన సంఫుల్లాంబు జాతాక్షి
అమిత సారోగ్యమ్ము నందిమగుడ
పరిపూర్ణ యౌవనోద్భాసియై వనలతా

వీధిలో విహరించు వేళయందు
కోలుడను రాజతపసి యా సుందరదన
సహజ లావణ్య నవవిలాసములకలరి
వేడ కవగూడలేమ మాతాడ కొప్ప
పెండ్లియాడెను గాంధర్వ విధిని వనిని. 44
వేరు తావుల నుదయించి పారు రెండు
యేరు లొకచోట లీనమై మీరునట్లు
వార లవ్వని నొకయింటి వారలగుట
పసిడికిం దావి యబ్బిన పగిది నమరె. 45
ఆ మనోహరగాత్ర మహాతపస్వి
యైన కోలుని గృహలక్ష్మియై నితాంత
దీప్తిమంతుల విజ్ఞాన దిగ్గజంబు
లనదగు కుమారులను గాంచె వనమునందు. 46
తమయేకైక సహోదరి
క్రమముగ నారోగ్యమంది రాజర్షిని స
క్రమరీతి వరించి యటన్
కొమరుల కమబెరిగి రాజకొమరులు వారిన్. 47
మోదమున తోడుకొని వచ్చి యాదరించి
కోలమునివరు డాత్మీయ కోటియెల్ల
ప్రవిమలోత్కృష్ట భోగసంపదలతోడ
★ దేవ దేహపురాన వర్ధిలుటవినిరి. 48

★ కొన్ని చరిత్రలందు "దేవదేహ" మనియు కొన్నింట "దేవదహ" మనియు వాడబడియున్నది.

కోలియనాయక కులవిభూషణము
గా సుభూతుడు వాసి గాంచె లోకమున
ఆ తేని కొమరిత లపురూప తనులు
సౌజన్య సౌభాగ్య సౌందర్య నిధులు
మాయా మహాదేవి మరిప్రజా వతియు
తన మనో వీధిలో తాండవంబాడ
పిందిలి నీరై మనో రథ సిద్ధి కొఱకు
పొరిది పెండ్లాడెనా శుద్ధోదనుండు. 49

శుద్ధోదనుడు

సింహహంతుడు త్రిదివము చేరినంత
పై తృకంబైన సామ్రాజ్య భారమెల్ల
తన భుజస్కంధ యుగళిపై దాల్చిమించె
మన్నతా దర్శధనుడు శుద్ధోదనుండు. 50

తనను ప్రజలు కన్నతండ్రిగా భావించి
అడుగు తామరలకు మడుగులొత్త
స్తుతచరిత్రుడయ్యె శుద్ధోదనుండల
విపుల రాజ్యసింహ పీఠమెక్కి. 51

పరిపంథి హృదయ తల్పంబు మీదనగాని
నిదురించ నొల్లడు మృదుల శయ్య
పరదార నిజ సహోదరి భావననెకాని
వీక్షించ నొల్ల డెవ్వేళ నైన

చిరుచిరంబగు ప్రజా సుఖ జీవనమెకాని
కాంక్షించ నొల్లడే కామితములు
శరణాగతత్రాణ సరణి నేగుట గాని
బాధించ నొల్లదెప్పగిది నొరుల

పూర్వ శాక్యరాజపుంగవులేలగా
కాన రాని వింత జాణతనము
స్వీయ రాజ్యలక్ష్మి స్నిగ్ధాననంబులో
వెల్లి విరియనేలు బల్లిదుండు 52

ఆ రాజన్య కులావతంసుని విశిష్టావల్ప కీర్తి ద్యుతుల్
స్వారాజ్యాధిపు కొంచెపుచ్చుననిన్ శంకించ రెవ్వారు దు
ర్వారోదగ్ర విశాల విక్రమకళా పారీణులా సీమలో
పౌరుల్ స్వామి హితానువర్తనుల రెబ్బంగిన్ విలోకించినన్. 53

కానరు! శీల గౌరవ వికాస మహోన్నతి గాక నన్యమున్
మానరు. భర్త్రసేవ ఋజుమార్గవిహీనుల నాదరించిగా
బూనరు. ధర్మజీవన విభూషితలై చెలువారు తత్పురీ
మానవతీ లలామ లభిమాన ధనాఢ్యలు సర్వరీతులన్. 54

తుచ్ఛాస్వచ్ఛ నికృష్ట దుర్వసన సందోహాత్ములై నిత్యకా
మేచ్ఛాలోల వికీర్ణ జీవనముతో హేలాగతిన్ సజ్జన
స్వేచ్ఛావిత్తము దోచువారల శిరచ్ఛేదమ్ము గావించగా
రచ్చల్ చిచ్చులు చిమ్ముచుండునట నేరంబెన్న గన్పించునే. 55

న్యాయ విశారదుడగు నర
నాయక పాలమును దగ బెనంగొని సతమున్
జాయా లవంగ లతికలు
శ్రేయము సమకూర్చు చుండ్రె శేషప్రేమన్ 56

శాంత్యహింసలు కవగూడి సత్యమునకు
దీప్తి సమకూర్చునట్టు లద్దేవియుగళ
మప్రమేయానురాగ సంయమన యుక్త
లగుచు సేవించ్రు నిజనాథు నాత్మలందు. 57

ఏ లోపంబెరుగని సువి
శాలోన్నత రాజ్యమునకు శాసకుడగు భూ
పాలాగ్రణి హృదయమ్మున
చాలగ దురపిల్లు తనకు సంతతి లేమిన్. 55

జన్మము లొనర్చె వేల్పులు నంతసిల్ల
దానములు చేసె భూసురోత్తములు తనియ
తీర్థ యాత్రలలో పెక్కు దేవళములు
స్థాపన మొనర్చెరాజు సంతతినికోరి. 59

కాంక్షవిగులు చుండె కాలాంబరంబుపై
బ్రతుకుప్రొద్దు జేరబడెడు కొలది
ప్రభువులోని మ్లాన భావంబు నెరిగిన
ప్రజలు కూడ బిట్టు పరితపింత్రు. 60

## స్వప్నము

అంతట నొక శశిరమ్యమున
కాంతిని గొల్పడిన ప్రకృతి కాంతామణి న
త్యంతో పశమన మోద
స్వాంతను గావించ నవ వసంతము తోచెన్. 61

అంతి పురాంతర స్థల విహార వనాంతర సౌధసీమ న
త్యంత పరిమళా నిలములంతు మనోహర చైత్ర చంద్రికా
కాంతులలో నిశాంతమున గాఢము నిదురించియున్న భూ
కాంతుని పెద్దరాణి★ కలగాంచిన దీగతి సంభ్రమంబుగన్ 62

అదము చిందులాడ కమలాయతనేత్రలు దేవభామినుల్
కొందరు వచ్చి పుష్పకములో గొనిపోయి వియత్తరంగిణీ
సుందర తీరమందు పరిశుద్ధముగా జలకమ్ములార్చి సా
నందముతో డ నందన వనంబునకున్ గొనిపోయి కోమలిన్. 63

భక్తి ద్వివార నందొక్క స్వర్ణ పీఠి
నధివసింపగజేసి నెయ్యము దలిర్చ
వేల్పు టింతులు కొలువ భూవిభుని దేవి
సంభ్రమాశ్చర్య పులకిత స్వాంత యగుచు. 64

కనులు మిరుమిట్లు గొలుప దిగ్వలయమెల్ల
తనమ మనోహర దీప్తిలో మునుగజేయు

★ ఈ స్వప్నము పలువురు పలురీతులుగా వర్ణించి యున్నను
స్వప్నము వచ్చినట్లందరు వ్రాసియున్నారు.

చొక్క కిరణంబు చనుదెంచి యులిదకుక్షి
లో చొరంబడ మేల్కొనె లోల నయన. 65

ధవుని మేల్కొల్పి సముచితోత్కంఠతోడ
తాను గాంచిన స్వప్నవృత్తాంతమెల్ల
విన్నవించిన రేడు ప్రసన్న హృదయు
డగుచు మరునాటి కొలువునం దాదరమున. 66

దైవజ్ఞ శిఖామణులకు
దేవేరీక్ష్ణస్వప్నకథను తెలుపగవారల్
భావించి మతోదయమౌ
"దేవర" కని తెలిపి పరిస్తుతించుచు మరియున్. 67

"యావన్మహీశ మకుట
శ్రీ విలసిత దీప్తులం దశేషోన్నతితో
తావక తనూజు పదరా
జీవమ్ము లెసంగు" నని వచించిరి పేర్మిన్. 68

ఆ కార్తాతిక సూక్తులు
భూకాంతు నమేయ మోద భూషితు జేసెన్
లోకోత్తర సత్కారము
గైకొని దైవజ్ఞ బుధ నికాయము పొంగెన్. 69

తలప నీ జన్మ సంతతి కలుగు ననెడు
ఆశ లడుగంటిపోయి నిరాశ ప్రబలి

యున్న వేళల కార్త్రాంతి కోర్కి తిరిగి
వలపు ఊరించె రాజ దంపతుల కెలమి. 70

దౌహృదములు

అనుపమ లీల నరేంద్రుని
ప్రణయ లతిక సాగి చిగురు పట్టె ననంగా
విన యాత్మ యైన మాయా
వన జాయత నేత్ర గర్భవతియై మించెన్. 71

ఆ వదృశాదరమున వసుమతీ నాధుండు
దేవి దౌహృదములు తీర్చు చుండ
ప్రాణ విభుని రాగ భావాంబ రంబుపై
సుదతి దనరు వేగు చుక్క పగిది. 72

ప్రాత రోషస్సులో మ ధుభార మెదను
దాల్చి వెలుగొందు బంగారు తమ్మి రీతి
గర్భమున బాలచంద్ర సం కాశుడైన
వినుగు పెంపొంద నలరె నా వెలతమిన్న. 73

చిరత రానంత వాంఛిత సిద్ధి వలన
ననుప మానంద వనిధిలో మునిగె రాణి
మొనసిపొందిన స్వాతి చినుకును వహించి
శుక్తి వారాసి కుక్షిలో చొచ్చునట్లు. 74

## ప్రయాణము

లలి నా గతి నవ మాన
మ్ములు విందిన వెనుక విభుని మ్రోలను మాయా
లలితాంగి తెలిపె జనకుని
నిలయమ్మున కరుగువేడ్క నెమ్మి దలిర్పన్. 75

దేవ దేహమునకు పోవ నర్థించిన
దేవి కాంక్షితమును తీర్చ వేడు
తు హిన శైల సాను గహన మార్గమ్మును
బాగు చేయ బనిచె భట వి తతిని. 76

మెరక పల్లములను సరిచేయ జానైన
పథముపై సువర్ణ రథము నెక్కి
అనుగు చెల్లి వెంట చనుదేర దేవేరి
బయలు దేరె నొక ప్రభాత మందు. 77

ప్రత్యూష పవన సంస్పర్శలో మేల్కాన్న
కోకిలమ్ముల కుహూ కుహూ రవాలు
చిగురాకు పొత్తిళ్ళ నెగడి వన్నెలు దేరు
అడవి మల్లెల మనోహర వికాస
మరవిచ్చు తెలిదమ్మి మెరుగు చెక్కిలి ముద్దు
కొలకు సాగెడు భాను కిరణ శోభ
నసి వాసి ప్రియుడు దుర్వ్యసన లోలుండౌట
గని బిట్టు కుందు చెంగలువ వలపు

పులక లెగెఱించి మేన నబ్బురము గొలుపు
వేళ కమనీయ కాంతార వీధియందు
రాగ రంజిత శుభ మనో రథమువోలె
సాగి పోవుచు నున్న దా స్యందనమ్ము. 78

సర సాలోకనముల నుం
దర సృష్టిం గల పద్మాననను తనతో
దరి కెరిగించ ప్రజాపతి
పర మాద్భుత భంగి నిట్లు పలుకదొడంగెన్. 79

"ఆక్కా గ్రహించితే! యా
చక్కని లేమావి చిగురు పాపాడు పికం
బొక్కక్క మారుపాట ను
లుక్కు పడెడు దుక్కు పెద్దులోగల భీతిన్. 80

భవ్య పర్వం సహా సభా భవన వీధి
కంబు వాప్తు నిజాగమనంబు తెలుపు
మాగధుని వోలె నీ మధు మాసవేళ
కూయుచున్నది గనుమ పుంస్కోకిలమ్ము. 81

జిలుగు సంధ్యా రుణాంబర మ్ములను చేర్చి
ప్రాగ్దిశా కాంత వింత ఛత్రము ధరించి
అఖిల జగదేకనాథు సభాంగణమున
నిలిపి నట్టున్న పొదువు గుబ్బలిని కనుము. 82

నిఖిల నగరాజ కోటి యెన్నికకు నిలువ
మంచు మలకబ్బె నీ హేమ మకుట మనగ
ప్రాత రారుణ కిరణ సంపదల లోన
తుహిన గిరి శీర్ష మొప్పె నద్భుతము కనుమ. 83

అనుగు నెచ్చెలి స్నేహ బంధనము నుండి
వేరు పడలేక వెన్నంటు వెలది పగిది
మిన్ను విడచిన మన రోహిణీ స్రవంతి
కలుసుకొను చున్న దా కొండ మలుపులోన. 84

బాటకా వంక లోయలో పడి స్రవించు
రోహిణీ నది కెరటాలలో జనించు
కిల కిలారావములు విని కలత జెంది
చూచు మృగ శాబకమ్ముల జూడుమమ్మ. 85

వాలిపోవుచు సెలయేటి జాలులోన
తాన మాడుచునున్న కదంబవితతి
కమ్మ పుష్పాది తేనెలు తుమ్మెదలకు
విందు చేయుచు నుండిన విధము కనుమ. 86

కడువిచిత్రము. ఎన్ని యుగాల నాఁడొ
ధరణి నెందైన సాటి పోటరిని కనగ
శిరము నెత్తిన హిమగిరి శేఖరుండు
తిరిగి వంచని స్వాతంత్ర్య దీక్ష చూడ. 87

యుగ ధర్మముతో మారుట
జగతికి సహజంబె కాని శాంతధనుండై
నెగడు హిమవంతు లోపల
వగ పడ దే మార్పు యుగము లరిగిన కూడన్. 88

అవని సర్వము జలమయం బైనవేళ
మగుడ సృష్టికి వలయు సామగ్రి నెల్లి
నోడపై నిడి మనువు గారాడు తరిని
తావొనంగిన భువన ప్రదాత యితడు. 89

ఆది ముని కోటి హృద్వీధి నవతరించి
వేద బాలిక లవ్యయా మోద గరిమ
నాడు కొని యుండ్రు యుగ సంధ్యలందు నీచట
పాడుకొని యుండ్రు తమ మహత్వములు వెలయ. 90

అనుచు ప్రజా పతి హిమనగ
మను గూర్చి ప్రశంసచేయ మునుకొని మాయా
వన జాయతాక్షి పలికెను
వినయాంచిత మృదులఫణితి వివశత దోపన్. 91

" పదములుకుదించి కల్పనా పథమునందు
పయన మొనరించు సుక విభానముల మాడ్కి
చల్లగాలికి కైలాస సరసిదెనకు
బయలు దేరిన హంసదంపతుల గనుమ. 92

ప్రమార దర్శ కపంబీ
గిరిపై సాగించి మును భగీరధుడు మహ
త్తర గంగ వెంట రాగా
భరతోర్విని గడచిచేరె పాతాళమ్మున్. 93

ఊరు కోపానల కీలల
స్మరు నంత మొనర్చినట్టి శంకరు డిందే
తిరిగి గృహస్థుండై ధర
వరలుట యమ్మేటి మహిమ వలనంగాదే! 94

ఇతని కడుపు చలువయే భారతోత్తర
భూమియెల్ల మూడు పూవులారు
కాయలై యెసంగగా మర్త్య తతియెల్ల
స్వర్గ సుఖము పొందజాలి యుంట 95

అక్కయైన వియన్నది వనుగమించ
విగ్రమించెడు మన రోహిణీస్రవంతి
వాలు కెరటంపు తూగుటుయ్యాల మీద
బాల భానుని లాలించు లీల కనుమ. 96

అని పలుకు చుండ నరదము
జన పద మార్గముల వెంట పొగునెడ సుహృ
జ్జన మండలి జీవనములు
కని వెందియు మాయ పలికె కనికర మొలుకన్. 97

వేగు బోక మునుపె వెడలిన భర్తల
కోగిరములు కొను చు నేగుచున్న
పల్లెటూరు కాపు పడతుక లదె వారి
జీవనమ్మె న్యాయ జీవితమ్మె 98

పొట్ట వెన్నుగంటి పోయిన ముదుసలి
సమిధలేరి బ్రతుకు సరణి చూడు
కల్లలాడి పరుల మల్లె దోచెడు వాడు
పోల రితని పాద ధూళితోడ 99

ఆలమంద శాద్వలాలకు చనవాని
ప్రాపుకొలకు పాగు గోపకాళి
కొసరి కూయు చున్నకోకిల పాటతో
గొంతు కలిపి గెలుచుకొనిరి చూడు, 100

కోరక లీరిక లెత్తగ
తీరికగా చేరి హిమనదీ తీరములో
నీ రాట లాడు కృషిక కు
మారుల యానందమెరుగ మనకు వశంబే? 101

పట్టులందు భాసిల్లు సహజ ప్ర
నాన రమను రాజధానులం దు
కానలేము చెల్లి కర్షక వృత్తి యే
క్షితలమునకెల్ల జీవ గఱ్ఱ. 102

గుబురు మావినెక్కి గోపాలు డొనరించు
వేణుగానమునకు వివశమంది
ధేనువితతి యేటి తీరాన మేతలు
విడచి యాలకించు విధము కనుమ. 103

వా యెండలో నితాంతా
ప్యాయతతో పనులుచేయు పడతు కలెంతో
తీయగ పాడెదు జన పద
గేయములో దైవభక్తి గీల్కొనె వినుమా. 104

సేద్యగాని శ్రమిక జీవన సారమై
వెల్లివిరియు పంట కళ్లమందు
రాసియైన ధాన్య లక్ష్మియే మనరాజ్య
లక్ష్మి కెపుడు ప్రాణ రక్షణమ్ము. 105

లలినట పల్లవించిన విలాసపు పూపొదరింట లెస్సగా
కులికెడు గువ్వ జంటలను గూల్చగవచ్చిన డేగ తానె చి
క్కులు వడె తీగలందు కనుగొంటె? సుహృజ్జన కోటికెప్పు డె
గ్గులు తలపోయు వారలకు గూడ నిదేగతి పట్టు పో భువిన్. 106

సురుచిర మందహాస సుమ శోభిత కుంజ కుటీర వాటిలో
వరలెడు పొన్నపొంత తల వంచిన లేత గులాబి కన్యకా
పరిణయ సంగతిన్ దనరు బంధుతతిం బలె కీరశారికల్
గిరికొని యాడువేడుక సఖీ కననెంత ప్రమోదమయ్యెడిన్. 107

నలుగడలందు కంచెలిడి నట్టి రసాల వనాంతరంబునన్
గల చిగురాకులన్ మెసవగా గమకించెడు లేడిపిల్ల చై
పుల ఐరికించు మెంతటి ప్రమోదము గూర్చుచునుండె ధారుణీ
వలయము నందు ప్రాణుల విపద్దశ బాపగ జూడరెవ్వరున్. 108

మూగ జంతు కష్టములను గాంచి తపించు
అక్కగారి మాట లాలకించి
కడు ద్రవించియున్న కలికి ప్రజావతి
పలికె లేతనవ్వు తొలకరించ. 109

"ఇంతటి పవిత్ర కరుణా
స్వాంతవు నీ కడుపులోని చల్లని తండ్రిం
కెంతటి దయా మయుండై
చింతా రహిత ప్రపంచ సేవలు కొనునో" 110

తేరు సాగుచుండ దేవేరులా రీతి
సృష్టి కావ్యమున పటిష్ఠ ఘట్ట
ముల సమీక్షయందు మునిగితేలుచు నుండ
గా క్రమముగ కుతప కాలమయ్యె. 111

రాజోద్యాన వనంబై
రాజిలు "లుంబిని" వనాన రాట్సుతలకు న
వ్యాజోన్నత స్వాగతమిడి
రోజను నచ్చోటచేరి యున్నట్టి చెలుల్. 112

## జననము

అంబరము నంటు సాల కదంబ వకుళ
మృదులతా నీక పుష్పితోత్సవ వనాన
సము చితోల్లాస దాసీ జనముల కొలువ
విశ్ర మించిరి శాక్యభూ విభుని సతులు. 113

పథ పరిశ్రమంబు వదలిన పిమ్మట
చరమ గిరికి మిహిరుఁడరుగు తఱిని
చిగురుటాకు చంక దిగిసాగు రవగాలి
స్వాంతమును కదల్ప సమయ మందు. 114

వన విహారకాంక్ష జనియించ ప్రియ సఖీ
వితతి కొలువ సంజ వెలుగులోన
సంచరించు శాక్య సామ్రాజ్ఞి కంతలో
వృద్ధిచెందె ప్రసవ వేదనమ్ము. 115

సందర్భం బెఱిగి సఖీ
బృందము కై దండలొసగి ప్రేమోద్వేగా
నందమున పట కుటీరము
నందుంచిరి సత్వరమె ధరాధి పుని సతిన్. 116

పట కుటీరమందు ప్రసవ వేదన చెందు
రాణి గర్భ సాగరమున నుండి

లోకమునకు జ్ఞాన రోచిస్సులందీయ
శారదేందు నిభుడు * సంభవించె. 117

పరమ సాధ్వి శాక్య పరిషన్మహేశుని
వెలది సుతుని గనిన వేళయందు
పుడమి పులకరించె కడలి మేరలు మీఱె
క్రిందుకొనియె మింట చందమామ. 118

విరిసెను దిక్తటంబు లతివేలముగా మధు పుష్ప సంతతిన్
గురిసెను పాదపంబులనుకూల సమీర కరప్రబోధతో
మురిసెను ప్రాణికోటి పరిపూర్ణసుధాంశుని లీల విందిరా
వరుడల శాక్యరాట్కుల వివర్ధనుడై ప్రభవించు వేళలన్. 119

పున్నమ చందమామ గతి పొల్పెసలారు కుమార శాక్యునిన్
కన్నయనుంగు సోదరిని గాంచి ప్రజావతిపొంగిపోయె, లో
కోన్నత దివ్య మూర్తిమెయి నొప్పెడు సంస్తవనీయ లక్షణా
భ్యున్నతి నాత్మగోరుచు ప్రమోదము నందిరి సేవకాంగనల్. 120

ఆ శుభ వార్త రయంబున దూతలు
చనితెల్ప శాక్యరాజన్య వరుడు

---

* బుద్ధభగవాను డవతరించిన లుంబినీ వనమున అశోక సార్వభౌముడు ఒకశిలాస్తంభమును పాతించెనని అది నేటికిని కలదని. శ్రీ వేలూరి సత్యనారాయణగారి "బౌద్ధయుగమను" దేశ చరిత్రయందు కలదు.

విశ్వ విశ్వంభరా విభవంబు తనయొడిన్
బడినయట్లా నంద పనిధిఁదేలి
కపిల వస్తువు నలంకారంబు గావించ
నియమించి తా లుంబినీ వనమున
తనయునిగాంచు మఱ్ఱ్కంఠతో చనుదెంచి
రమణమై నిజమనో రథము వోని

కొమరునింగని యాశ్రిత కోటికెల్ల
దాన ములుచేసి, నిజ రాజధాని కేగె
బాల కువితోడ ప్రణయ రాజ్ఞీ లలామ
అందలము మీద వెనువెంట నరుగుదేర. 121

సుందర మందహాస సుమశోభిత భవ్యవనాంతరమ్మునన్
నందను గన్నరాణి స్వజనమ్ములతో యిలు చేరువార్త కా
నంద రసాబ్ధిదేలి యవినాప్రభు భక్తి గలట్టి భామినుల్
వందలు వేలుగా జని నృపాలసుతున్ గని పొంగిరెంతయున్. 122

దీపములేని యింటికొక దివ్వె లభించిన రీతి తీవ్రసం
తాప తమిస్రమందు హిమధాముని దర్శన మబ్బినట్టులా
పాపని పుట్టు పండువున భాసిలు వేడ్కలు కన్నలోకులు
దీపిత సమ్మదాంబుధిని తేలి ముతించిరి ముద్దుబాలునిన్. 123

★ వర్యార్థములు వీని జననంబు చేత
సమకూరు నని సూరి జనులు వాకొనగ

"సర్వార్థ సిద్ధి" యౌ జన నాథ సుతుని
"సిద్ధార్థుడ" నుచు వచింతు రెల్లరును. 124

ఎన్నాళ్ళనుండియో హిమశైల కందరం
బ్బున దపంబొనరించు మునివరుండు
అసితా హ్వాయుండు మా యాదేవి తనయుని
వీక్షించు కోర్కెతో వెడలివచ్చి
నెత్తమ్మిపూరేకు పొత్తిలి బిడ్డను
దర్శించి చిరమహో త్కంఠతోడ
భవ మహాంబుధి మున్గి పరితపించెడు జీవ
కోటిని కాపాడ నేటి కిలను

అవతరించిన దేవుడీ యధిపు డనుచు
మ్రొక్కి సిద్ధార్థు పాదాబ్జములకు మగుడ
వెడలిపోయెను భయదాటవీ పథాన
నవని నాథుండు పమ్మదాశ్రువులు విడువ. 125

పరమేష్ఠి సము డగు ముని
వరుడా గతి శిశువు మహిమ వా కొని చన వి
స్ఫురితాత్మయైన మాయా
తరళాక్షి వ్యథాత మోహ తత్పర యగుచున్. 126

అనుపమ దీప్తి మయంబై
వినుత శరచ్చంద్ర కిరణ విభవాన్వితమై

తనరు కుమారుని వదనము
కను గొని మరి కాంచి కాంచి కౌతూహలియై. 127

భవ సాగరంబులో బడి
నవసెడు జీవులను కావ నాగర్భ ము నం
దవ తార మె త్తియుండిన
భవపాశ విదూరలోక పావన చరణా. 128

ఇన్నినాళ్ళ దనుక యే మాయ తెరలయం
దునికి తెలియ నీయ కొదిగి యుంటి
వన్న నిన్ను గనెడు కన్నులనిత్యమౌ
జగతి నింక చూడ జాలనోయి. 129

అనుచు మిగుల వివశయై ప్రజావతి యొడిన్
తనయు నునిచి శాశ్వతమ్ము గాను
★ కన్నుమూసె లోక కళ్యాణ నిధియైన
సుతుని గన్నతల్లి ధృతి యుతముగ 130

మానవ జీవితంబు పరిమాణము జేసెడు మృత్యుదేవతా
నూన కఠోర దంష్ట్రముల నుండిప్రియన్ విడిపించలేక భూ
జాని తుపాను పాల్పడిన సాలము లీల చలించి నిశ్చల
జ్ఞానము గోలుపోయె సహజంబగు భౌతికమాయ పెంపునన్. 131

---

★ సిద్ధార్థుడుదయించిన యేడవ దినముననే మాయాదేవి పరమ
పదించెనని కొన్ని చరిత్రలయందు కలదు.

పుత్రోద్భవానంద మునఁదేలుచున్న
కపిల వస్తు పురంబు కన్నీట మునిగె
నానాటి నడురేయి నవ్వీటి కాటి
యందు వెల్తురు గాంచి అతిలోకుడైన
గట్లరాయని గుండె కరిగినీరయ్యె. 132



# బుద్ధ పురాణము

## ప్రమోద పర్వము

### బాల్యము.

పెను తుపానున వంగిన వనజమెట్లొ
నిలువరించి తలిర్చిన ట్లెలమి శాక్య
రాజు; పత్నీవియోగ వారాశి గడచె
సమయ దేవతమృదు కర స్పర్శ లోన. 1

వెలుగుం జీకట్లుం బలె
పొలసెడు సుఖదుఃఖములకు పురుషుడు లోనై
కలగియు దిటవూనని చో
తలమే జీవింప భూతధాత్రి నిజము గన్. 2

శరదిందు బింబ నిభమై
పరగు తనూభవుని వదన పద్మము నందా
పరమ పదించిన జాయా
సురుచిర తేజమున్ ఱేడు చూచి శమించెన్. 3

సత్యలోకమందు సంచరించెడు మేటి
శాక్యరాజు నింట జనన మంది
వృద్ధిఁ బొందె బాల సిద్ధార్థు డనుపేర
శుద్ధ పక్ష చంద్ర శోభ పగిది. 4

సోదరి నిర్యాణము తో
ఛేదింపం బడిన యెదకు సిద్ధార్థ కుమా
రోదంచిత పోషణ మా
స్వాదన మొన గూర్చగా ప్రజావతి సతమున్. 5

చిన్నికుమారుని గనవుల
వెన్నెలలో తడిసిపొందు వివశతతో నా
కొన్న పసిబాబు నోటను
క్రన్నన పాల్వోసి మోద కలితాత్మయగున్. 6

జలకమార్చి నుదుట తిలకంబు సవరించి
కొండెవేసి పూల దండ జుట్టి
పాన్పుమీద చిట్టి బంగారు తండ్రిని
పవ్వళింప జేసి పాడుచుండు. 7

జోల పాడి తల్లి జోకొట్టు వేళల
చిట్టిబాబు వదన సీమయందు
వెల్లివిరియు నవ్వు వెన్నెలవాకలో
తడిసిపోవు సౌధ తలమదెల్ల. 8

అమ్మయటంచు ముద్దుకొడుకు కల్లన పల్కగనేర్చి మెల్లగా
గుమ్మము దాటువేళకను గొన్న సవిత్రి చలించి యక్కరూ
పమ్మెదలో నటించ ననివార్య దయార్ద్రి మనోజ్ఞ నేత్ర ప
ద్మమ్ములు చెమ్మగిల్ల సుకుమారకుమారుని యెత్తిముద్దిడున్. 9

నడువ నేర్చినట్టికొడు కుచేష్టలలోని
సహజ సౌమ్య శీల సంపదలను
కాంచి పొంగి పోవు కలికి ప్రజావతి
సరసి జేడు మోది తాత్మ్మదగును. 10

తల్లి తనకిడు మధుర పదార్థ ములను
పేదబాలుర కొసగి సంప్రీతి వారు
తిని ప్రమోదము చెందగా మనమునందు
క్రుందు కొనువేడ్కనలరు రాణ్ణందనుండు. 11

## విద్యాభ్యాసము

ఐదు వత్సరమ్ము లరుగ విశ్వామిత్రు
డను మనీషి విద్యలను గఱపిన
చదువ దొడగె లెస్స సర్వార్థ సిద్ధుండు
గురవరేణ్యు డెదను వెరగుఁ జెంద. 12

ఉపనయనం బొనరించెను
నృపుడు సుతునకెనిమిదేండ్లు నిండుటతోనే
అపురూప దానములతో
విపులాస్థలిఁగల జనములు వినుతింపగడున్. 13

ఇరవొప్పగ నృపసుతు డ
క్షర రమ్యత నెరిగి శబ్దసాగరమెల్లన్
సరిలేని ధారణా మం
దరమున మథియించి మించె దక్షత మెరయన్. 14

శరమును సంధించుటలో
తురగారోహణమునందు దుర్వార రణాం
తర ఖడ్గ చాలనములో
గరకరియై రాకుమార గణమున నెగడెన్. 15

పితృదేవు నెడదలో గల
అతులిత విద్యాభిలాష కనుగుణ్యముగా
నుత గుణుడు గౌతముం డా
తత విద్యా వేత్తయగుచుఁ దద్దయు మెఱసెన్. 16

వేద పురాణ కావ్యముల విస్తృత సారమెరింగి శాస్త్ర మ
ర్యాదల నాకళించుకొని రమ్యవినోద కళా జగత్తులో
భేదములన్ గ్రహించి పరపీడిత మార్గములన్ త్యజించుచున్
మోదము గూర్చె శాక్యముని ముఖ్యుని పుత్త్రుఁడపూర్వ వైఖరిన్ 17

అ యను నక్షరం బభ్యసించిన దాది
సంసారమెల్ల నసారమనుచు
తలపోయు నట్టి సిద్ధార్థుడె వ్వేళల
ప్రకృతి కావ్యము లోని ప్రతి పదంబు
పరిశీలన మొనర్చు పట్టులందున పెక్కు
ప్రాణులు తమపాటి ప్రాణివలన
హింసకు లోనై సహించ జాలని బాధ
కగ్గలంబగుచు దేహము దొరంగు

ఉరసి నంత విచలి తాంతరంగుం డౌచు
జీవులెల్ల దుఃఖ జీవితమును
వాసి సౌఖ్య పదము వడయు మార్గమునకై
అనయ మూహసేయు మనమునందు. 18

హాల కర్షణోత్సవము

సతతము శుద్ధోదన భూ
పతి రాజ్యము నందపార వైభవములతో
క్రతువులు సంఘోత్సవములు
చతురతతో దివిజులెన్న జరుపుదురు జనుల్. 19

ఆ యుత్సవముల యం దత్యంత ఘనము
ప్రతివర్ష ఋతువులో బరతెంచు మహము
★ హాల కర్షణోత్సవం బను మహోత్సవము
కర్షక తతిపాలి కల్పభూ రుహము
సాగించబడెనొక్క సంవత్స రమున. 20

కపిల వస్తు పురాన గల సేద్య గాండ్రెల్ల
తత్పురి బాహ్య భూతలమునందు

---

★ ఈహాల కర్షణోత్సవము కొన్ని చరిత్రలందు లేకపోయినను శ్రీ శశిభూషణ సేన్ వంగభాషాకృతిమాతృకగా శ్రీబాలాంతరపు సత్యనారాయణగారు వ్రాసిన "సిద్ధార్థ యన" వచన రచనలో మాత్రం కలదు.

తమ తమ వృషభ సంతతి తోడ నిలచిన
మోదంబుమీర శుద్ధోదనుండు
చనుదెంచి సుతునితో జనసమూహముగొల్వ
కడగె దున్నంగ నాగలిని బూని
ఆ వెన్క రైతులు పావన చిత్తులై
వసుధావిదీర్ణోత్సవము నొనర్చ
దీర్ణమై పోవుచున్న ధాత్రీ తలమ్ము
నుండి వెలువడ్డ క్రిముల నుద్దండ లీల
పట్టి మెసవుచు నాకాశ పథమునందు
వలయములు చుట్టి యాడెను పక్షితతులు 21

భేకములు మహీలత ల
స్తోకముగా నెలవు బాసి సుడిముడి వడుచో
కాకములు గొరు వంకలు
చే కొని భక్షించ సాగె చెచ్చెర వానిన్. 22

అది ఘోరహింసగా నాత్మలో తలచి
కరుణామయుడు బాలగౌతముం డపుడు
కలియించు నెడదతో జనకుని జేరి
ఈ హింస తిలకించ యేనొల్ల ననుచు
తరలి పోయెను మహోత్సవ భూమివిడచి
తనయుని వైరాగ్య తత్త్వాంతరమును
గమనించి కృషిక సంఘమును పంపించి

తపియించు నెడదతో ధరణీ ధవుండు
వేశ్మాంతరము నకు విజయంబు చేసె. 23

## అ శ్వ చో ద క త్వ ము

తోడి నృపకుమా రు లాడంబరంబుతో
తిరుగు చొక్కపొద్దు తురగములను
తోలు నేర్పుచూప దొడగిన పోటీకి
సిద్ధ పడెను శాక్య సింహుడెలమి. 24

ఆ యశ్వచోదక వ్యాయామక్రీడలో
నిర్దేశ పథమందు నిలుప బడిన
హయ స మూహమ్ము నిర్భయముగా కను తెప్ప
పాటులో విడువంగ బడినయంత
సర్వార్థ సిద్ధుని స ప్తి యాక్షణములో
సాటి గుఱ్ఱములను దాటిపోయి
అనిల వేగమున గమ్యము చేరి విజయంబు
సమకూర్చిరొొప్పెడు సమయ మందు
వారు వముడిగ్గి విజయోత్సవమును మరచి
దాని ఘర్మము నుత్తరీయమున తుడిచి
పిసరచుం బల్కె నెల్లరు వెరగుచెంద
పరమకరుణా మయుండు భూవరు సుతుండు. 25

"జీవములను లెక్కచేయక నా కునై
కోరి యిట్లు జయము కూర్చినావు

విజయ ఫలము నాది వేనట నీయది
స్వార్థపరుడనే న హా నిజముగ" 26

అనుచు, తన తురగరాజ
మ్మును దోడ్కొని చనెను విజయ మోదము గొనకే
ఘన చారిత్రుఁడు గౌతముఁ
డని తరకరుణాంతరంగ మారాట పడన్. 27

## మృగయా వినోదము

ప్రాలేయశైల కానన
పాళిని విహరించు శాక్య పతి పుత్రుడు స్వే
చ్ఛాలలిత సహజ ప్రకృతిం
రేఁచు మృగయా వినోద దీక్షం జనుచున్. 28

బాలార్క కిరణ చుంబిత
శైలోన్నత శిఖరరాగ సంపద తమితో
వాలోకించుచు శుక పిక
కోలాహలమైన పెద్ద కోనను డాయన్. 29

అత్యున్నతోరు హిమాలయా గ్రముననుండి
పరతెంచు సెలయేటి పడతి పాట
లలివిచ్చి తులికించు తెలిదమ్మి విందులో
రొదసేయు కొదమ తుమ్మెదల యాట
కమనీయ వనలతాంతముల కౌగిలి పొందు

మరగిన పిల్ల తెమ్మెరల నీటు
ననిపాసి ప్రియుడు రోదసినెందు కనరామి
తపియించు కోకనదముల పాటు

ప్రసవ మకరంద బిందు సంపదను గురిసి
హిమ కణంబుల నీరాడి యేపుమీఱు
తరుణ సుమరాజి వికసనోత్సవపు గోటు
స్వాగత మొసంగె నారాజు చంద్రునకును. 30

ఆరమణీయ ప్రథాన
శ్రీ రమణీ దర్శనమ్ము శ్రీఘను నెదలో
పేరిన దయార్ద్ర భావో
దారతను పరివృద్ధిచేసె తగనీరీతిన్. 31

తనకు దాపున చాల దట్టంబు గానున్న
పొదరింటి కావలి పొలమునందు
హరిణమొక్కటి శాద్వలాంకూరమును దిను
వేళ గన్గొనిన భూపాల సుతుడు
శరమెత్తి పెనువింట సంధించి విడువగా
బూనిన నయ్యది ప్రాణభయము
చే తల్లడిలిపోవ శ్రీఘను డద్దాని
దయనీయ జీవితోత్తమ విధాన

మాత్మతల పోసి శర ప్రయో గాత్మకమ్ము
క్రూర కర్మక పని యెంచి వారువమును
వెనుక కుందిప్పె మిత్రులు వినుతిసేయ
తరునికాయము కుసుమ మంజరులు కురియ

### రాజహంస సంరక్షణము

మరియొక తరి సిద్ధార్థుడు
పురికావల నున్న పెద్ద పూదోటను సుం
దర చరమ సంధ్యలోజని
తిరుగుచు నందున్న కొలను తీరము చేరెన్.

చారు సువర్ణ కాంతుల నెసంగు విహాయసకాంత దాల్చుము
క్తా రమణీయ హారమనగా కలహంసలు శీతశైల కా
సారము చేర బారులయి సాగుచు నున్న మనోజ్ఞ యాత్ర న
క్కారుణి కాంతరంగుడు సఖావళితో తిలకించు చుండగన్.

గగనమున నేగు కలహంస గములయాత్ర
నరయు చుండిన ★ దేవదత్తాభి దుండు
స్వాంతమున గల ఘోర హింసా ప్రవృత్తి
జాగరిత మైన యట్లకస్మాత్తు గాను

పెను విల్లు వేగ గైకొని
గుణమును సారించి వాడి కోలను త్రుటిలో

---

★ యీ దేవదత్తుడు సిద్ధార్థుని పినతండ్రి కుమారుడట.

వినువీధినేగు చక్రాం
గన కుం గురి జాలివిడిచె కడునేర్పరియై 36

జనన మందిన దాదియాక్షణము వఱకు
పరుల కెగ్గుదలంచివి సరళ జీవి
మృత్యు దేవత కోరలు మెఱయు తన్ను
మ్రింగగా పొంచి యుండు టెఱుంగ దయ్యె. 37

మానస సరోవరాంతర మధుర బిసము
తిను తలంపున దండులో చనెడు ఖగము
భయద ముని శాపమున వార్ధిబడినయట్టి
శీతకరు నట్లు బుద్ధుని చెంతకూలె. 38

దాని; విపద్దశం గని వదాన్య చరిత్రుడు గౌతముండు పెం
పూనిన జాలినెత్తి లలితోక్తుల తోడ భయంబు తీర్చి నె
మ్మేన గఱట్టి తూపు మెల మెల్లన బాపి చికిత్స చేయగా
బూనె స్వకీయ హస్తమున పూర్తిగ నెత్తురుకార కుండగన్. 39

జీవ కారుణ్య ధనుడైన జినుడు దాని
ప్రాణ రక్షణకై శ్రమ పడు చునుండ
దేవ దత్తుడు విల్లెక్కుదించి వచ్చె
హంస నాదియటంచు వాదించు కొఱకు 40

అవ్విలు కాని కండ్లార కాంచగనె
భయకంపితాంగియై పసిడి రాయంచ

సిద్ధార్థు వదన రాజీవమును కనుచు
గద గద లాడుచు యొడి నొదిగి యుండ
దేవ దత్తుడు చాల తీవ్రముగ పలికె. 41

"రాకుమార పక్షిరాజము నాయది
అస్మదీయ విక్రమాతి శయము
నెల్లరెరుగ గూల్చి తిప్పుడు నీ విట్లు
చేతబట్టి కులుక జెల్లునోయి 42

గారడి పల్కులేల చిరకాలము నుండి మనంబునందు నే
కోరి మరాళ మాంసమున కున్ తపియించుచు నేటికిట్లు దు
ర్వార శరాహతిన్ భువికి రాల్చితి గావున వీడుమా" యనన్
భూరి దయా సముద్రుడు ప్రభూత యశస్కుడు గౌతముండనెన్. 43

'వీరుడవౌదువౌక్కొ వినువీధి చరించుచు జీవితమ్ము నం
దేని కి యెగ్గుకోరని యహీనచరిత్ర హిమాలయాద్రికా
సార మృణాళ భోజనము సల్పితరించెడు సౌమ్యమూర్తి య
క్రూర గుణాఢ్య నీగతిని కూల్చగ జాలిన యంత సోదరా? 44

నీమనో వీధి నుదయించి నిరతమెగయు
దుష్ట భావాండజమ్మును దునుములేక
పొగడు కొందువు రోదసి నెగయు ఖగము
నొక్కదెబ్బకు కూల్చితా హా యటంచు. 45

చచ్చిపోయిన యొక చిన్ని జంతువునకు
జీవమును పోసి బ్రతికించ లేవుగాని

అడవులను బట్టి యాకుల నలములందిను
ప్రాణులను చంపి భక్షింపబూని కావు. 46

ఘోర శరాహతి దివసం
చారమ్ము దొరంగు వేళ చక్రాంగన క్రేం
కారమ్ము తోడ శరణము
కోరిన కాపాడ పూనుకొంటిని కావన్" 47

అనిన దేవ దత్తు డాగ్రహమ్మున "హంస
నాది" యనగ జినుడు కాద నంగ
తగవు పెరిగి తుదకు ధర్మాధి కారితో
విన్నవించి రెల్ల విషయములను. 48

ఆ యిరువురి వాదన లా
ప్యాయతతో న్యాయమూర్తి యాలించి బుధ
జ్ఞేయ మగు ధర్మ సూత్రమె
హాయని పరు లెన్న తెలిపె నుత్త మరీతిన్. 49

ఆర్తత్రాణ పరాయణ
వర్తనులై రాకుమార వరులుండగ దు
ర్వర్తనమున దీనుల సమ
వర్తిపురికి బంప ప్రజకు వశమగు నె భువిన్. 50

బాణహతిని తనువు బాసియే యుండిన
హంస పడతి నీది యగును కాని

బాణమును పెకల్చి పాణంబు వోసిన
గౌతమునకు చెంద కలదు ఖగము. 51

అని చెప్పి న్యాయ మూర్తులు
వినుతించగ గౌతముండు విహగము తోడన్
జచె; నదిగని శుద్ధోదన
జనపాలు డపార మోద జలధిని తేలెన్. 52

కరుణామయు డగు బుద్ధుని
పరిపోషణము న మరాళి ప్రాణ భయంబున్.
దొరగి మ రి కొన్నినాళ్ళకు
పురికొనె నెల నడిమి చంద్రముని కాంతి గతిన్. 53

దాని స్వాస్థ్యమెరి గి మానసమున చాల
తృప్తి చెంది బుద్ధదేవు డొక్క
సంజవేళ మింట చను నంచ పిండుతో
గలసిపోవ విడిచె కౌతు కమున. 54

మనః ప్రవృత్తి

ఆ గతినెల్ల జీవుల సుమార్ద్రతితో తిలకించు నమ్మహా
త్యాగధనుండు గౌతముడు తత్వవివేచనుడై నమస్తవై
భోగములందు చిక్కుకొను బుద్ధి హాయంబునులాగి పట్టుచున్
స్వాగతమిచ్చు విశ్వహిత శాంతి రమామణి కాత్మనెప్పుడున్. 55
రాగమయ ప్రధానమున రాగవిహీనుడుగా మెలంగుచున్
భోగమయంబులైన పితృ పుంగవు నంతిపురమ్ము నందెదో

లాగ మన శ్శరీర సుఖ లంపట మొల్లక మోక్ష మార్గ నం
యోగ రహస్యముల్ గనెడి యోజనతో నరి పుచ్చు కాలమున్ 56

హాయలుగా వినువీధి పయనంబు సాగించు
జలదంబు సేయు నిస్వార్థసేవ
లోకాంధకారంబు పోకార్ప పద్మినీ
విభుఁడొనర్చెడు జగద్వినుత యాత్ర
దూర పరీవృత దుర్గంధమును తోలి
తనిసెడి సుమవల్లి త్యాగబుద్ధి
తనలో ని బడబాగ్ని కనలు చున్నను విశ్వ
కళ్యాణమును గోరు కడలి హాదు

ప్రతిదినమ్ము హృదయ పద్మ మందేదియో
భావ సుధను చిలికి జీవితమును
సార్థ కంబు చేయ జాలు మార్గ మెరుంగ
చింతనం బొనర్చు శ్రీ ఘనుండు. 57

ఆకాశరామ విహార భూములు చూడ
జాలిన తుహినాద్రి సమ్మదంబు
సకల భూతముల విశ్రాంతికై వెన్నెల
పాలుపోయు హిమాంశు ప్రాభవంబు.
పట్టి పాముల తన్ను భక్షించ కుందని
శ్వసనుని సముదార సహన శక్తి
ప్రతి ఫలంబునుగోరు వాంఛయే లేనట్టి

తరుల తాడుల ఫలదాన పరత
చెక్కు చెదర కన్య చింతన యే లేక
అఖిల జీవులకు సదా దర మున
నీర మొసగు రోహిణీ న దీ దానము
మనన సేయుచుండు జినుడు సతము. 58

వీరత్వమను పెద్ద పేరుతో పశు పక్షి
వితతిని చంపించు వేట లనిన
సామ్రాజ్య భద్రత సాకుగా పొలిమేర
రాజ్యముల్ కబళించు రగడ లనిన
స్వీయాగ్ర వర్ణ విశిష్టతకై సాటి
నరుల క్రిందికి ద్రొక్కు సరణులనిన
పరలోక భోగ సంప్రాప్తికై పశువుల
సమయించి చేయు జన్నంబు లనిన

యేవగించుచు ధరలోని జీవ కోటి
తన బహిప్రాణమని సర్వ జన వితాన
మరపి ప్రేమించి బ్రతుక లేదా యటంచు
నాత్మ దల పోసికుములు సిద్ధార్థుడెపుడు. 59

బందుగులు ప్రాణ మిత్రులు
విందులు వేడుకల టంచు విహరించగ నా
నందించక శుద్ధోదను
నం దనుడే కాంత సీమ నాలోచించున్. 60

ధీరుడు సమస్త విద్యా

పారంగతుడయ్యు శాస్త్ర పద్ధతులందే
కూరుకొని పోక బాహ్యావి

చారణలేదేవొ లోకశాంతికి చేయున్. 61

ఆత్మ విషయానురక్తుడై యహరహమ్ము
రాజకీయపు లోక మర్యాదలందు
మమత జూపని తన ముద్దు కొమరు నడత
మోదమును కూర్చదయ్యె శుద్ధోదనునకు.

పరితాపము


చిరకాల తపః ఫలమై
వరలిన సుకుమార మూర్తి ప్రవిమల జ్యోతి
దిర కేలు పట్టగా దగు
తరుణుడు శీతాంశు ముఖుడు దాసీనముగా 63

మెలగుట గని దైవజ్ఞులు
పలికిన వాక్యములు హృదయ పద్మము నెంతో
కలగించివేయ నరపతి
తలపోయును సుతుని లౌక్య తత్పరు జేయన్. 64

ఊహాతీతముగా బహు
దోహదముల నలరు పూవు దోటల యందు
త్సాహపడి కొమరు డైహిక
మోహములో జిక్క ననుచు మనుకొనువేడ్కన్. 65

ఉర్వశాదర్శరచిత రమ్యోరు వనిని
అన్యచింతలు చొరరాని హర్మ్య మందు
కాపురము పెట్టి ప్రజల దుఃఖములు ముద్దు
కొడుకు కనరాని యంత కట్టడి యొనర్చె 66

ఆవిధమ్మున కొన్నినాళ్లరిగినంత
కొమరు డికనైన రాజకీయముల యందు
రక్తి చూపు నటన్నయా సక్తి తోడ
రాజ్యమున కంతటికి యువరాజుఁజేసె. 67

ఆవెనుక నొక దినమ్మున
భూవిభుడు కుమారు జేరి పూర్ణోత్సాహ
శ్రీ వెలయ పెండ్లి చేయగ
భావించి వచించె నిట్లు ప్రవిమల ఫణితిన్. 68

నాయను రాగవల్లి యవనీపతి భక్తి కిపాలవెల్లి దీ
ర్ఘాయువు లేనిదై చనినదన్న నినున్ గనినట్టి తల్లి పెన్
గాయమొనర్చి నాయెదకు కాని నినున్ గని గుండెగాయమున్
మాయము చేసుకొంటిని కుమారక త్వత్పరిపోషణంబునన్. 69

జీవితభాను డస్తగిరి చేరుచు నుండెను యింద్రియాలలో
చేవ నశించుచుండె సరసీరుహ నాభుని సంస్మరించు చున్
భావిని వెళ్లుచుప్పుడగు భాగ్యము నాకులభించు పుత్రకా
నీవొక యింటి వాడవయి నిర్మల రాజ్య రమన్ గ్రహించినన్. 70

కాదని చెప్పబోకు చిరకాలము సంతతిలేక చాల వి
ర్వేదవచెంది చెంది యల శ్రీహరి సత్కృప నీవు పుట్టగా
మోదము పట్టలేక కనుమూసె సవిత్రి ప్రజావతీ సతీ
యాదర భాగ్యమబ్బ తనయా నినుపెంచి తరించినామురా. 71

కన్న కడుపు తీపి యెన్నగా బిడ్డల
కన్నవారె రుంగ గలరుకాని
అన్యులెరుగ జాలరవ్వా మదీయాను
భవము ముందు భోధపడును నీకు. 72

నీవెరుంగని ధర్మముల్ లేవటంచు
తెలిసి యుండియు తండ్రినై పలుకుచుంటి
ధర చతుర్విధ పురుషార్ధ దాయకమ్ము
అఖిల బుధనుత మగు గృహస్థాశ్రమంబు. 73

నీవు వల్లెయటన్నచో నిఖిల భువన
పాలనోద్ధతులైన నృపాలవరుల
నందనల నిందు రప్పింతు నందు నీకు
తగిన కన్యను వరియించ దగు కుమార." 74

"ఆ రీతిని పితృదేవు డు
గారవమున పలుక జినుడు కడు వినయముతో
వారము గడువొసగిన ని
ర్ధారణ మొనరించి చెప్ప దలచితిననియెన్. 75

### అశోకఖాండోత్సవము

ఆ వారము సిద్ధార్థుడు
జీవిత మర్యాదలను ప్రసిద్ధోత్తములౌ
భూవిభులు చనిన మార్గము
లోవెలసిన భువనవిహిత రూపము లరసెన్. 76

తా జగమ్మున కవ్యయా ధర్మధనము
పంచి జీవిత ఫలము సాధించు కొఱకు
బ్రహ్మచర్యంబసంపూర్ణ పథమ టంచు
యెంచి గార్హస్థ్యమును స్వీకరించ దలచె. 77

తనయుని నిర్ణయ మును విని భూపతి
యెనలేని సమ్మోద వనధి తేలి
లోకంబు మెచ్చ నశోక ఖాండోత్సవం
బొనరించగా మది నూహ జేసి
తన మహా మాత్యులాస్థాన పండితులతో
మంతనం బొనరించి చింతదొరగి
సకల దిగ్దేశ రా జన్యుల యాస్థాన
ములకు తదా హ్వానములను పనిచి

మాన్యగతి వారి కన్యకా మణులు సకల
దాస దాసీ జనమ్ముతో తరలి రాగ
కోరి తనరాజధాని సింగారమునకు
ఆజ్ఞ యొసగెను శాక్య రాజాధిరాజు. 78

చతురంబోధి పరీవృత
క్షితి వలయం బేలు రాజ శేఖరులు సమం
చిత గతి తమ తనయల నా
దృతితో పంపించ సమ్మతించిరి, వరుసన్. 79

శారద మిత్రవింద మృగశాబ విలోచన యిందిరా సతీ
భారతి కల్పవల్లి నవ పంకజ లోచన కృష్ణవేణి క
స్తూరి సుగంధగంధి యను చోద్యపుఁబేరులు సార్థకంబులై
మీఱెడు రాకుమార్తెల నమేయ గుణాఢ్యల జేర్చి రప్పురిన్. 80

ఆ రమణీ లలామముల యందరితోడ నరేంద్ర మందిరా
గారము లొప్ప సాగె త్రిజగన్నుత నందన కాన నంబులై
శారద చంద్రి కాంతులయి సారసంయుత మైన దివ్య కా
సారములై నితాంతజన సంతతికిన్ కనువిందు చేయుచున్. 81

లల నల యొయ్యా రముగని
కల హంసలు రిత్తపోయి కళవళము పడున్
కల కంఠుల గళములు కో
కిలములనే చిన్నబుచ్చి కెరల గడంగెన్. 82

జిలుగు వన్నెల వసనాల వెలుగుతో ద
కే కి పింఛాక్షి రుచులనే గేలిసేయ
జాలు ననబోంట్ల లావణ్య జలధిఁదేలి
రాజ నగరెల్ల శృంగార రాశి యయ్యె. 83

ఆపై శుభ వాసరమున
శ్రీపతి పభ బోలు చిత్ర శిల్పమ్ములతో
యేపారు సభాగారము
లోపల నుపవిష్టులైరి లోలాక్షులొగిన్ 84

నిండు రతనాల బంగారు కుండలందు
కుసుమితానంత కంకేళి కుసుమ గుచ్ఛ
ముల నలంకార మొనరించి లలితరీతి
పూజ లొనరించి లొలగిరి భూమిసురులు. 85

ఆ సమీపమ్మునం దుచితాసనము న
లంకరించిన సిద్ధార్థ రాకుమారు
ననుమంతంబున నొక్కొక్క వనజగంధి
వచ్చినన్ హేమ భాండంబు లిచ్చుచుండె. 86

దరహాస వదన పద్మమ్ముతోడ నశోక
భాండంబు గైకొను పడతి యొకతె
తారహారములయందాల కాంతులతోడ
కానుకలందెడు కలికి యొకతె
నిడువాలు జడనుండి వెడలు సౌరభముతో
నుడుగర గైకొను నువిద యొకతె
కట్టిన వసన సింగారమ్ము వెలయగా
బహుమానమును గొను వనిత యొకతె

తూగ నా పూవు బోడులు కాన్కలంది
విడిది గృహముల కేగెడు వేళయందు
సహజ లావణ్య శృంగార సరసివోలె
చేర వచ్చిన దొక్క బంగారు రాశి. 87

ఆ మనోహర గాత్ర మహా యశస్వి
నవ్య నవనీత హృదయ వినమ్రరాశి
★ దండపాణి తనూజ చందనపు బొమ్మ
సార్థ కాఖ్య యశోధర యన బరంగు 88

వెల్లి విరిసిన సమ్మోద వల్లి పగిది
దేహ కాంతుల కాల చంద్రికల నీన
హేలగా వచ్చి నిలచి పూర్ణేందు వదన
చూచె స్నిగ్ధార్ద్ర దృష్టి నా సుతుని మోము 80

ఎంత సేపటి నుండియో యిగురు బోండ్ల
కంచి తోత్తమ కాన్క లందించు చుండ
కడమ వచ్చిన చిన్నారి కలికి చూపు
గ్రుచ్చు కొన్నది సిద్ధార్థు గుండెలోన. 90

తరుణి వాల్చూపు ప్రాపుగా మరుశరమ్ము
రాగ రసహీన భావసామ్రాజ్య మందు

---

★ ఈ దండ పాణి ఏ ప్రాంతమేలిన వాడో నాకు తెలియలేదు.

మోడు వారిన హృదయంబు తోడనున్న
శోభ నాకారు ధైర్య కంచుకము చించె. 91

ఒక్క నిమిషంబు చేష్టలు దక్కి నిలచి
నిండు తమినిచ్చు బంగారు కుండ తోడ
చెలువ మొలికించు తనయెద నలరుచున్న
హేమ మణిమాల వైచెను లేమ మెడను. 92

## వివాహము

ఆ విషయము వినినంతనె
భూ విభుడానంద మంది భూసురవరులన్
రావించి దండ పాణికి
వే వేగమె తెలుప బంపె వియ్యంబందన్. 93

సర్వ సర్వంసహా రాజ చంద్రులందు
మేటియగు శాక్య భూపతి తోటి వియ్య
మబ్బునని విని యుబ్బి తబ్బిబ్బు వడని
దండపాణి హీమ సురోత్తముల కనియె. 94

" నాయనగు తనయ కొఱకై
మీయువ రాజిటకు వచ్చి మేధాయుతుడై
న్యాయముగ నిందు మాచే
చేయ బడు పరీక్షలందు జితుడైన యెడన్. 95

అఖిల బుధకోటి నిర్ణయ మాదరించి
శాక్య రాజన్యు లాజ్ఞ శీర్షమున దాల్చి
మామ కౌదర్య విజ్ఞాన ధామమైన
తనయ నర్పింతు నృపలోక వినుతముగను." 96

దండపాణి వచస్సులా దరముతోడ
తెలియ జేసిరి ధారుణీ దేవులేగి
నరవ రుండెల్ల విషయమ్ము లెఱుగ జేయ
కాదనక యొప్పె సిద్ధార్థుఁడాదరమున. 97

క్షాత్రకుల భూషణుండైన శాక్యరాజు
భృత్య సామంత పండితా మాత్యవరులు
బలసి సేవించగా దండపాణి పురికి
వచ్చి విడిసెను తగ శుభ వాసరమున. 98

సముచిత సత్కారంబులు
క్రమ మొప్పగ దండపాణి గావించి మహా
దరము వెట్టి పరీక్ష కునై
రమణీయ మహా సభాంతరమునకు పిలిచెన్. 99

ఇభ సన్నిభులగు మల్లుర
ప్రభావములు సడల జేసె ప్రత్యక్షముగా
త్రిభువన జన వందితమగు
సభలో సిద్ధార్థుడసమ సాహస ధనుడై. 100

మును కవ్వడి గతి నత డట
ధనువున్ శరమూని చాల దవ్వుగనెందో
గణ గణమను యంత్రధ్వని
విని నంతనె కూల్చె శబ్ద భేదన విద్యన్. 101

అశ్వ శిక్షణమున నసి చాలనమ్మున
వ్యూహ రచన యందు యోధ వరుల
గర్వమణచ గలిగి నిర్విరామమ్ముగా
విజయమందె శాక్య విభుని సుతుడు. 102

ఆ వెనుక పండితావళి
కావించిన వాదనమున ఘనవిజయుండై
పూవునకు నవ పరిమళ
మావేశించిన విధాన యలరారె కడున్. 103

వేద శాస్త్ర పురాణాది వివిధ గ్రంథ
పరిచయమ్మును బలదర్పపాటవమును
కాంచి పులకించి నిజ సభాగారమందు
దశబలుని కౌగలించెను దండపాణి. 104

మానవ నాథ మండలి సమక్షము నందసమాన విక్రమ
జ్ఞాన మానీష సంపదలు కానుకవెట్టి నితాంత వైభవా
నూన విశిష్టరీతుల ఘనుల్ వినుతింపగ నయ్యశోధరా
మానిని కేలువట్టె ననమాన గుణాఢ్యుడు గౌతముం డటన్. 105

పూత చరిత్రు దంచిత విభూతి పరుండతి వేల సద్గుణా
స్ఫీత యశస్కుఁడల్లుడని నెమ్మది పొంగెను దండపాణి వి
ఖ్యాతిగ నాడు నాదుహృదయమ్మును దోచిన సుందరాంగునే
ధాత యొసంగె నేటికని దద్దయు పొంగె యశోధరాత్మలోన్. 106

అనుగు బిడ్డడు వైరాగ్యమును త్యజించి
భౌతికానంద చిత్తుడై వరలు చెన్ను
దని తపించెడు శాక్యరాజాధిరాజు
మోద వారాశిపై చెను మునకలెన్నొ. 107

చందురుడు వెన్నెలం బలె
క్రొందావియు పూవురీతిఁగో డలు కొడుకున్
డెందము నలరించగ నా
నందమ్మున కపిలవస్తు నగరము చేరెన్. 108

మహినేత సేయు సమారాధనములలో
కురిసె పేదల కేలగోఘృతంబు
ధరణీశుడొనరించు దాన ధర్మముల తో
వెడలె నాశ్రితకోటి పేదరికము
భూధవునిలయ వినోద గోష్ఠులయందు
ద్రవి యించిపోయిరి రసిక వరులు
రారాజుచేయు మర్యాదలన్నియు పొంది
పరవశంబును చెందె బంధువితతి

వారు వీ రను భేద భావమ్ము లేక
నేల యీనిన యట్లుగా వేల కొలది
జనులు చనుదెంచి వినుతించి తనిసి చనిరి
శాక్యసింహుని పరిణయో త్సవము నందు. 109

ఆ మహనీయ మహాత్మున
కీమహిలో సాటి మహము నెన్నడు చూడం
బోమనుచు ధరణి వరులే
ప్రాముఖ్యం బిడిరి పెండ్లి పందిరిలోనన్. 110

పాణిగ్రహణ మహోత్సవ
మైన వెనుక దండపాణి అతివినయముతో
దా ననిన అర్ధ రాజ్యము
పూనికతో శాక్యరాజ పుత్రున కొసగెను. 111

ప్రణయము

సుందర ధర్మ్య హర్మ్య పరిశుద్ధ తలమ్ముల పూవుదోటలం
దెంతరా సేవకాంగనలహీన ధృతిన్ గొలువన్ యశోధరా
సుందరితో చరించు ప్రియ సూనున కన్యజనాళి వేదనా
క్రందన చూడరాని గతి కట్టడి జేసె నరేంద్రు డెంతయున్. 112

పరిపూర్ణ భోగ వాంఛా
పరతంత్రుండై సతమ్ము ప్రాణేశ్వరి తో
తిరిగెడు సిద్ధార్థుని గని
పరమా నందమున శాక్యపతి పులకించెన్. 113

ఋతువుల పరివర్తనతో
నతులంబగు సౌఖ్యరీతు లడు గంటినచో
సుతునెడద మార గలదని
క్షితిపతి తగినట్టి మార్పు చేయ గడంగెన్. 114

లలి వేసవిలో చలువయు
చలివేళల నుష్ణ గుణము సముచిత గరిమన్.
వెలయించు మేడలెన్నో
నెలకొల్పి వసించ జేయు నిరుపమ లీలన్. 115

జన్మదాత కూర్చు సంరంభముల లోని
మర్మ మరయ లేని ధర్మరాజు
ధర్మ పథము మరచి ధర్మచారిణిపొందు
మరగి తిరుగుచున్న తరుణమందు. 116

పతియే ప్రాణము దైవము
పతియే జీవితము సకల పరమార్థంబీ
పతి పాద సేవ యేయని న
మ్రతతో మెలగును యశోధ తాసతి సతమున్. 117

క్షణకాల మైనను సైరించ నేరదు
కాంతుని యెడబాటు కలికి మిన్న
ఒక పూట పతిమోము వికసించ కున్నచో
తపియించి పోవును తలిరు బోడి

పూదోట విహరించు నాథుడు దవ్వైన
కలవరపడిపోవు జలజనయన
నిదుర బోవుచు కూడ హృదయేశు నామమే
స్మరియించుచుండును పరమ సాధ్వి
విభుని తోడిదె సర్వ జీవిత మటంచు
ధవుని సంసేవనమునకే తను వటంచు
పూవులో లీన మైయుండు తావి రీతి
పతిని యెడ బాయదా దండపాణి తనయ. 118

అరమరలు లేని ప్రణయ వల్లికలు పెరిగి
చుట్టుకొని పోయి మిక్కిలి దట్టమైన
గూడు కట్టిన వద్దాని నీడ నుండి
జగతి నరయక యున్నదా యుగళ మపుడు. 119

ఇది దివసంబిది వారము
గత నెలయిది యేడటంచు కాల నియమమే
మది నెన్నక సిద్ధార్థుడు
సుదతీ మణితోడ గడపుచుండెను దినముల్. 120

# బుద్ధపురాణము

## నిష్క్రమణ పర్వము

### పరివర్తన

పరిమళ సుమమ్ము నెంతయు న్ముడుగు నందు
ఉంచి దాచిన నది గుబాళించకున్నె?
జ్ఞాన భాస్కరు నజ్ఞాన జలద పటలి
కప్పిమ్మి నిలచునె ధర శాశ్వతమ్ము గాను. 1

విసువక ప్రేయసీ హృదయ వీధి సరాగ మరీచి మాలికా
మసృణపు కాంతిలో నిరుపమాన విలాస తరంగిణీ తటిన్
మసలెడు శాక్యసింహు కనుమాయ తెరల్ తొలగించు కాలమే
విస విస చేర వచ్చినది విశ్వజనీన పరీమళాలతోన్ 2

మోహ మరీచికా నిచయమున్ పొడిగించు ననంతకామ సం
దోహ పథంబు నందు తమితో పయనించు నృపాల సూతికే
యూహలు పుట్టెనో యెదనయోమయమైన యెడారి మార్గ సం
దేహ మనస్కుడై తిరుగు దీనుని వైఖరి కాన నయ్యెడిన్ 3

వచ్చిన సంధ్యయే తిరిగి వచ్చెనరీతి నిరంత భోగ్యమై
ముచ్చట గూర్చు పొదుములె ముందును గూడ లభించుచుండ నా
సచ్చరి తాత్ముడంతిపురి చానలతో విసుగెత్తి యన్యమౌ
పచ్చని లోకమున్ గనెడు భావ మరందము లూర నెమ్మదిన్. 4

నిరతము నృత్య గీతములనే వినిమెచ్చు రసైకజీవి నే
డరసియు మిన్నకుండును ప్రియంబగు రాత్తగ నయ్యశోధరా

సరసిజ నేత్ర పల్కెడు వచస్సులకున్ బ్రతిచెప్పు డంతగా
నిరతి శయాత్మవేవిషయ నిర్ణయమందు నిమగ్నుడౌటనో. 5

సారధి నొక్కనాడు సహజమ్ముగ జీరి పురమ్ము చూడగా
కోరిక పుట్టెనోయి మనకుంగలశ్వేత తురంగ మాలతో
తేరు నలంకరించి కొనితెమ్మని యాజ్ఞ యొసంగ వాడు బం
గారు రథంబు తోలుకొని క్రమ్మరవచ్చి నమస్కరించినన్. 6

నగర సందర్శనము

అరదము నెక్కి రాణ్ణగరి హర్మ్యములెల్ల గమించిపోయి సుం
దరమగు రాజవీధిని ముదంబున దాటి దరిద్రవాడలో
తిరిగెడు పాటిమానవుల దీనతజూచి నిజాంతరంగ మే
కరగి తపించసాగె త్రిజగన్నుత సద్గుణమూర్తి ముందుకున్. 7

దారికొకవంక దుర్గంధ పూరితంబు
నైన యొకయింటివాకిలి యరుగు వార
కూరు చుండిన పెనురోగి తీరు నరసి
తేరు నిలిపించి రాజకుమారు డనియె, 8

సారధీ చీము నెత్తురు నీరుకలసి
కాతువ్రణముల వాసన మీరుచున్న
వాత డారీతి కుమిలెడు హేతువేమి॥
అనిన రథచోదకుడు ఛన్నుడనియె నిట్లు. 9

"అతడు గతజన్మ పాపసంగతములైన
పనులు చేయుట వలన యీ భవమునందు
కుష్ఠజాడ్యా ప్రపీడ్యుడై కుములు చుండె
దాని మానుప భువి నౌషధములులేవ 10

అంటురోగము బాబెటు వంటివారు
చేరనొల్లరు వానినీ జీవితమున"
అనుచు సారధిమగుడ హయములదోల
సాగుచున్నది మెల్లగా స్యందనంబు 11

కాలుచేతులు మిగుల వంకరలు పోయి
బాధతోచను నొక పక్షవాత రోగి
కానవచ్చిన శాక్యభూ జానిసుతుడు
తల్లడిలిపోయె వాని యా తనను జూచి. 12

పండు ముదుసలి యొకడు నిల్చుండలేక
ఊతకొఱ కొక కఱ్ఱను చేతబట్టి
తలయు చేతులు వణకగా దారిప్రక్క
గాసిఁజెందుట కనుగొనె రాసుతుండు. 13

మరికొంత దూరమేగిన
మరణించిన నరుని బంధు మండలి యేడ్పుల్
పతి జనుల యూరడింపులు
ధరణీ వర సుతుని మదిని తల్లడ పరచెన్. 14

జన్మమెత్తిన పిదప యా క్షణము వఱకు
నట్టి దృశ్యంబులెన్నడు నరసియుండ
లేనివాడౌట చేతనాశ్రీఘనుండు
తిరిగి రథమాపి వారల తీరడిగిన, 15

సారథి వచించె “నోరాజ చంద్ర తనయ
ధరణియందుద్భవించిన నరులయందు
కొందఱాజన్మ వికలాంగు లుందు రందు
కొంద ఱెవ్వేళ రోగులై కుములు చుంద్రు, 16

తనువుదాల్చిన యెట్టివస్త్రాదులైన
పాలకులనైన నిరుపేదవారినైన
జర మహామారి వెన్నంటి తఱిమి పట్టి
మృత్యువునకీయ నది దిగమ్రింగుచుండు. 17

తామిపుడు గన్న యార్తనాదముల నడుమ
భువిని పడి యున్నవాని మృత్యువు గ్రసించె
వాని దేహము కొనిపోయి వల్లకాట
దహనమొనరించి వత్తురందరు క్షణాన, 18

అందరెరుగుదురండి యిట్లవనియందు
పుట్టువాడెల్ల పదపడి గిట్టుననుచు
కాని క్షణికంబులైన భోగముల నడుమ
చిక్కి భ్రమతోడ వానిని లెక్కగొనరు” 19

అని వచించి ఛన్నుఁ డరదంబు తోలుచో
మనసులో తపాను లీనమడించ
చకితుఁడై చలించు సర్వార్థ సిద్ధుని
దృష్టి కమరె వింత దృశ్యమొండు. 20

ఊరు కవ్వాల గల పెద్ద భూరుహంబు
క్రింద గూర్చుండి తపమాచరించు కొనెడు
పరమ మౌనీంద్రు జీవిత సరణి సరసి
సంభ్రమాశ్చర్య పులకిత స్వాంతుడగుచు. 21

"ఉండయిల్లులేక పండచాపయులేక
చీకు చింత విడచి చెట్టుకింద
కనులు తెరువకున్న ఘనుడీతడెవరన్న,,
ఛన్నుఁ డడుగ నతడు విన్నవించె. 22

"ఖేద మోదాత్మకమ్మైన యీ దరిద్ర
మనుజ జన్మతరించగా మది దలంచి
పాంరరహిత మౌ సంసార జలధి నుండి
గట్టుకెక్కిన సాధుపుంగవు డతండు. 23

వారు వీరను భేద భావము త్యజించి
అవని యొక్కకుటుంబమే యని తలంచి
బ్రతుకు నందలి మమకార పాశములను
చెండివైచిన విజితేంద్రియుం డతండు. 24

తిరిప మెత్తుచు యొక పూట తినును గేస్తు
లేది పెట్టి పరె యసహ్యించు కొనక
అనయ మీరీతి నగర బాహ్యమున మిగులు
సమయమున మగ్నుడగు దైవ సంస్మరణను. 25

బురదలోనుండు కుమ్మరి పురుగుమేను
పంకిలము గాని రీతిగా వసుధలోని
విషయ జంబాల పటలమెవ్వేళ నైన
వీరినంటి పీడించగా నేర దయ్యె. 26

జీవితాంతము తపమునే చేసి పిదప
ముక్తికాంతా మణీ గృహమ్మునకుపోయి
అమ్మహోత్కృష్ట మోక్ష రాజ్యమ్మునుండి
రారు భువికింక సిద్ధార్థ రాకుమార. 27

నేరుపు మీర సారథి వినిర్మల రీతి వచించు చుండగా
వారిజ మిత్రుఁడ స్తగిరిఁవ్రాల తమంబు చెలంగ జొచ్చినన్
తూరుపు కన్నెకట్టు కొను తొందర జారిన మల్లు చీర బం
గారపుటంచు కాంతి గతిగా నుదయించె సుధాంశుదీధితుల్. 28

ముందు కనఁగొన్న దృశ్యసమూహమునకు
చింతఁబొందెడు సర్వార్థ సిద్ధి మదికి
తపసి దర్శన మిడిన మోదమ్ము పగిది
చీకటులదోలు వెన్నెల ప్రాకఁజొచ్చె. 29

ఖేదమోదపరీవాహ ముం దీదులాడు
సుగతు డంతట దశదిశల్ చూచి తేరు
వెనుకకుం ద్రిప్ప నాజ్ఞ కావించి మగుడ
యిరుకుకొనిపోయె భావనా గిరుల నడుమ. 30

శర వేగముతో నరదము
పరువెత్తుచు చేర భవన భాగమున యశో
ధర వాధన కెదురై పద
సరసి జముల కెరగి హృదయ శాంతిని పొందెన్. 31

## విరక్తి

అది మొదలు శాక్య సింహుడు
సద నాంతరములను వదలి క్షణ మెచ్చటికిన్
కదలిచన కెల్ల వేళల
హృదయాంతర సీమ నూహలెన్నో చేయున్. 32

ఆత్మ విషయాను రక్తుడై యలరు విభుని
మౌన మరసి యశోధర మాన సమున
కళవళము చెంది ప్రశ్నించ వెలికి నవ్వి
కారణము లెవ్వియో చెప్పి యూరడించు. 33

జగతి యం దున్నప్రాణి సంతయు మదెల్ల
జర రుజా మృత్యు భయద సంసరణ నుండి
అవ్య యానంద వనధి యం దలర జేయు

యోచనా మార్గమున జిను దున్నయపుడు. 34

## పుత్రోదయము

శారద చంద్ర బింబ ముఖి సద్గుణ పుంజ నికుంజ సువృత్తా
చార పరాయణాత్మ బుధ సన్నుత వర్తన యౌ యశోధరా
సారస నేత్ర దౌహృదపు సంబడులంతి పురాంత రమ్ములో
మీరుచు నాడు నాటికిని మిక్కిలి సొంపు ఘటిల్ల జేసెడిన్. 35

కాంతిపొలివోవి వికసిత కమల మనగ
తావు లెగజిమ్ము మల్లెల ప్రోవనంగ
కోరిపోసిన వెన్నెల కుప్పయనగ
గర్భ వతియై యశోధరా కాంత దనరె. 36

కదలి చనుదెంచు తపనీయ కలశ మనగ
హేలగావచ్చి తనయువ లాల నమున
కాన వడియెడు గృహలక్ష్మి నరసి చేర
దీసి లాలించ దంతగా రాసుతుండు. 37

కాంతునియూహ లోకమును దాటెడు రీతి
మెలతలో కాంక్షలు మీఱదొడగె
ల్లభు నెడదలో వైరాగ్య మురలగా
తరుణి లావణ్యంబు పెరుగుచుండె
ప్రాణే శు డనయంబు భవ బంధనముతోయ
పడతి మాతృత్వ భావమున మూరియు

రమణుడాత్మను దీన రక్షకై యోచింప
సుదతి యం దొకప్రాణి కదలుచుండు
నొక్క రైహికము న కొక్క రాముష్మిక
మునకు పగటి కలలు కనుచు నుండ
కరువి చిత్రమైన కాలప్రవాహపు
సుడులు సాగు వెనక చూపులేక. 38

నిఖిల భువనైక సుందరి నిరుపమాన
సార్థకాఖ్య యశోధరా సాధ్వి తనను
తాత నావరించ గలిగెడు తరుణము నకు
వేచియుండెను ముదముతో వృద్ధరాజు. 39

ఇరువంక బంధు మిత్రులు
పరిజనములు ప్రజలెరింగి ప్రమదింప యశో
ధర సుతుని కనెను శుభ వా
సర మున శీతాంశు కిరణ సంకాశ తనున్. 40
పౌత్రోద యోత్స వములో
గాత్రము పులకించి పోవగా భూపతి స
న్మిత్రులను పండితాళిని
పాత్రోచిత రీతి బిలచి సన్మానించెన్. 41

తాత కెన యైన మనుమ డుద్దండు డనుచు
తండ్రి కెన యైన సౌజన్య ధాము డనుచు

రాహులా హ్వయు డగు యువరాజ సుతుని
శుభమ యాశ్శీస్సులిడి లోకు లభినుతింత్రు. 42

నందనోదయ నోత్సవ సందడులకు
అంతి పురమెల్ల కల కల లాడు చుండ
చిత్త సంశోధి సర్వార్థ సిద్ధి రాజు
వచ్చి పాల్గొనడా యుత్స వముల లోన. 43
ధవుని వదనార వింద సం దర్శనమున
తనివి చెందు యశోధరా తలిరుబోడి
తీరు బడి వేళ భక్తిదైవార పతిని
చేరి సేవించు తనమది సేదదేర. 44

వెన్నెల పాల బుగ్గలను వేడుకముద్దిడు కొంచు మెల్లగా
యన్నుల మిన్న బిడ్డను ప్రియంబిగు రొత్తగ నెత్తితెచ్చి మీ
నాన్నను చూడు బాబని వినమ్రతతో పతిచెంత నిల్చి యా
కొన్న కుమారుడేద్వ పయి కొంగును గప్పి యొసంగు క్షీరమున్ 45

క్రొందలి రాకనం దలరు కోమల పుష్పమునన్ యశో ధరా
సుందరి పాణి పద్మమున శోభిలు కన్నకుమారుగాంచి యా
నందమరంద వీచికలు నాట్యముసేయ గడంగ శాక్యరా
జ్ఞందను డంతరంగమున నవ్వును గాని చలించ డంతగాన్. 46

చెంత మ్రొవ్వడి నిలుచున్న కాంత మదికి
సరళ సూక్తుల నొక్కింత శాంతి గూర్చి

అంత రాంతర వైరాగ్య చింతనమున
మునిగి తేలుచు నుండును జినుడ మగుడ. 47

## మంతనము

ఆ పిదప నొక దినమ్మున
భూపతి చనుదెంచి సుతునిమ్రోలకు తనయా
నే పెద్దవాడ నౌటను
క్ష్మా పరిపాలనము చేయ జాలక యుంటిన్. 48

మన మంత్రులు సామంతులు
వినుతించగ విపుల రాజ్య పీఠము పైనన్
నిను నిలువజేసి హరిచిం
తన మున జీవితము గడుప దలచితి తనయా. 49

నాపలు కాదరించి యవినాఘన రాజ్యరమన్ గ్రహించి పృ
ధ్వీ పతులెల్ల నీచరణ పీఠమునన్ దలలుంచిమ్రొక్క సం
దీపిత సద్య శస్సులను దిక్కుల పిక్కటిలంగ జల్లుచున్
పాపల రీతిగా ప్రజల పాలనజేసి తరించు పుత్రకా. 50

మనపూర్వుల్ మను జాధి నాధులయి నిర్మాణంబు గావించి యుం
డిన రాజ్యంబిది దీని కీడయిన పోటీరాజ్య మీ ధాత్రినెం
దును కాన్పించదు దీని గెల్వదగు నాధుండెవ్వడున్ లేడు నీ
ఘన దోర్విక్రమ పాటవంబు మునుపే కాంచెన్ జగంబంతయున్ 51

ఏ నాడో యిది నీవు పుచ్చుకొనిన నా కీపాటికే నిశ్చల
జ్ఞానాన్వేషణ చేసుకోదగిన విశ్రాంతిన్ బ్రసాదించి వి
న్నాణం బొప్పగ రాజ్యమేల దగి యున్నావింక వేయేలనీ
యీనాడైన పరిగ్రహించు తనయా యీసర్వ రాజ్యేందిరన్. 52

మన కుటుంబంబులో ఖ్యాతి గనిన యట్టి
పెద్ద లీయాదుకే జ్ఞాన వృద్ధు లగుచు
కమల నాభుని మృదుపాద కమలములను
స్మరణ జేయుచు గడపిరి చరమ దశను. 53

ధర్మార్థ కామ మోక్షము
లర్మిలి సాధించు కొఱకు నహరహమును స
త్కర్మంబుల నొనరించుచు
నిర్మలముగ పాలనమ్ము నెరపుము తనయా! 54

అను చున్ వాకొను తండ్రివాక్యముల సిద్ధార్థుండు శాంతంబుగా
విని సద్భక్తి నమస్కరించి హృదయావేశంబు పొంగార స
జ్జన వంద్యంబగు స్వీయభావముల నుత్సాహాతిరేకమ్ముతో
వినయం బొప్పగ చెప్పజొచ్చె తమితో విస్ఫారు జ్ఞానమ్ముతోన్ 55

జనకా నీవని నట్టి రాజ్యరమ నిశ్చల్ ప్రాభవోత్కృష్టమై
అనవద్యంబగు భోగ భాగ్య యుతమై ఆనంద సంధాయియై
మననీదెవ్వని యేనిమేషముననో మర్త్యున్ రుజాగ్రస్త దే
హుని గావించి గ్రసించు మృత్యువున కాయుష్యాంతమే లేదిలన్ 57

కాల వాహినిలో జర కధము నుండి
పూని తనుదాను కాచుకో లేని వాడు
సర్వ సత్వం సహా రాజ్య చక్ర మేలు
ఘనుడనని పూనుటాత్మ వంచనము కాదె? 58

ఒక వంక నెందఱో వికలాంగులై పుట్టి
ఆ జన్మ నరకమం దణగియుండ
మరి కొందరొక వంక మురికి కూపాలలో
బ్రతుకగా శాసించ బడుచు నుండ
ప్రారబ్ధమని యొరుల్ పలుకగా కొందరు
మల మల పస్తులు మాడు చుండ.
తోడి వారే తమ్ము దూరగా కొందఱు
కుష్ఠు రోగాలతో కుములుచుండ
నెందరెవ్విధాన యేడ్చిన మనకేమి
భూమి ధవుల మనుచు పొగడు కొనుచు
విఱ్ఱ వీగ రాజ్య విభవము నే స్వీక
రించలేను నను క్షమించు తండ్రి. 59

రోయ న సహ్యమైన చెడు రోగములుండుట కాటపట్టులీ
కాయము లిందుకై నరులు కైదువులూని పరస్పరమ్ము గా
కోయుచు నుందురు కుత్తుకలు ఘోర రణాంతర సీమ నెంత య
న్యాయములిట్టి ఘోర పరిణామము గల్గిన రాజ్యమేటికిన్. 60

కృక వాకు డింభమును గని

కికురించుక పట్టి తినెడు గ్మంధ్యము రీతిన్
సుకమెరు గనట్టి కృషికుల
పరికటముగా దోచు రాజ్య పదవు లవేలా? 61

ప్రాణసమానలౌ భర్తల గోల్పోయి
వైధవ్యమున కుందు వనితలకును
పత్నివియోగ దుర్భర జీవితాలతో
పరితాపమున జెందు పురుషులకును
తమ తపః ఫలిత సంతానమున్ గోల్పోయి
సర్వదా కుములు సంసారులకును
కెరతోడు నీడలై క్రీడించు మిత్రులు
మరణించ కుమిలెడు మనుజులకును
నిలయమై యున్న యీ ధరావలయ మందు
శాశ్వతానంద కర మోక్ష సౌధమొందు
కట్టి భవ దానవుని తల కొట్ట జాలు
మహితు డెవ్వడో వాడె సామ్రాజ్య భర్త. 62

ఆ సాహస కార్యము స
న్యాసాశ్రమ వాసి చేయ నర్హుడు కానీ
మీసాల మీది తేనెల
యాసులతో సాధ్యపడద దుర్విని తండ్రీ. 63

నేనా ఘన కార్యమ్మును
పూనికతో పూర్తి చేసి భూ మండలిలో

ప్రాణాల నేచెదు భవమను
దానవుని వధించి గెలువ దలచితి జనకా!, 64

అని సుగతుడు తన నిర్ణయ
మును విని పించంగ వృద్ధ భూపతి డెంద
మ్మున కలగి యశ్రు కణములు
దొన దొనరాలంగ సుతుని తో నిట్లనియెన్ 65

తనయా నీవని నట్టి వాక్యములలో సాధ్యంబు లేదంచునే
తనబోన్నైన సమస్త భూవలయమం దాద్యంత రూపాలలో
జననంబుల్ మరణంబులొక్క గతినే పాగున్ కదున్ చిత్రమై
మనుజుండొక్కడు వాని నడ్డగల సామర్థ్యంబు చేపట్టునా; 66

పరమ పతివ్రత నీ సతి
నిరుపమ సుగుణాల వాల నిను దైవముగా
పరిపూర్ణ భక్తి గొలిచెడు
తరుణిని విడనాడి వెడలు తలపుడు సుమతా. 67

నిండు వేడ్క నశోక భాండోత్సవంబు న
ప్రేమతో మణిమాల వేసినావు
అఖిలలో కసౌందర్య వతినామెనే కోరి
సహజపాం డిత్యంబు చాటినావు
భువన సన్నుతశీల పొందు నాకాంక్షించి
శబ్ద భేదన విద్య చాటినావు

శాస్త్రదేవిపైదోసు క్షమకని తలపోసి
మల్లుర గోడించి మసలినావు
పండితావళి నడుమ వాగ్ఖండనమున
శాస్త్రమర్యాదలెన్నియో చాటి గెలిచి
పెండ్లి యాడిన కోమలి ప్రేమ త్రోసి
వేయు తలపేల గలిగిన దోయనీశ. 68

అన్నము పున్నెంబెరుగని
చిన్నారి కుమారుడల చింతాంబుధిలో
బన్నములు పడుట నేని
కన్నులతో చూడ లేమ గదరా తనయా! 69

సార రహితము లనుచు సంసారములను
విడచి మునివృత్తి నెందరో వివిధములను
బోయి తపమున ఫలసిద్ధిఁ బొందలేక
రెంటికిని చెడ్డ రేవని రీతి కారె? 70

రాజ్యమేల తగిన రమణీయుడవు కాని
వనములందు నిడుమ లను భవించి
ఘోరతపము చేయ నేరవి సుకుమార
జీవితల్లు నీవు చేయకన్న. 71

ప్రాజ్ఞతమగన్న సహజ సౌభాగ్యనిధివి
ఈ వయస్సున నిను వీడి యెట్లులుందు

పావ ధానము తోడయో జనము పలివి
స్వీకరించుము రాజ్యలక్ష్మిని కుమార" 72

అని కనికరమ్ము తో వగ
తనయునితో ముచ్చటించి తడికన్నులతో
చను పితృదేవుని వదనము
కనుగొని సర్వార్థసిద్ధి కలవరము పడెన్. 73

లోకజ్ఞుండౌ జనకుని
వాకులలో నున్న సారవంత వు మె అపుల్
గైకొని సుగతుడు వెండియు
చీకాకున బడక మదిని చింతన చేసెన్. 74

అతడెన్ని తెరగు లెంచిన
క్షితిపై సవ్యాస ధర్మ జీవిత మొకటే
ధృతగతిని నరుల దుఃఖో
ద్ధతి బాపగ జాలినట్టి దారిగ తోచెన్. 75

మీన మేషాల లెక్కతో మానవుండు
జాగరము సేయ సంసార జలధి నడుమ
నమ్ము గావించి శుభ జీవితమ్ము నెల్ల
మ్రింగి వేయును కామ తిమింగలమ్ము. 76

ఆ రీతి భోగ లతలను
ధారుణిలో జీవతతిని దనుపుట కొఱకై

కోరి పెకలించి వేసెడు
వారుండిరె నాడు నేడు వాసిగ మున్నుదున్. 77

## నిష్క్రమణము

ఆ రోజు రాజనగరిని
చారుతరంబైన నాట్య సభ జరుగుట చే
నారీ మణు లది కనుగొని
కూరుకులో మునిగి రెదల కోరికలూరన్. 78

తి పుర మెల్ల నిద్రా
ంతంబై యున్నత రి ని గౌతము డొకడే
ంతా జలని ధి కవ్వలి
ాంతమ్మ నెరుకగ గోరు వాడై లేచెన్. 79

పాల వెల్లి వంటి పాన్పుపై తనచిట్టి
బాబు తోడ భార్య పవ్వళించ
ప్రేమోడు వారునెడద పూయ జాలిన రీతి
ప్రణయ సౌరభములు బయలు వెడలె. 80

దుఃఖ మయమైన ప్రాణి సందోహమునకు
శాశ్వతానంద మందీయ సాగు మేటి
తరుణి యిక ముందు మోహసాగరము నడుమ
మునిగి జీవింప కల దొకో యని తపించె 81

సంసార సంతరణకై
సంసిద్ధుండైన నాడు సర్వజ్ఞుండే
సంసిక్త నయను డగుచో
సంసారపు లోతులెల్ల స్పష్టము కాదే? 82

అనుగు తనయుని యెత్తి ముద్దాడగోరి
కొడుకునెత్తిన పడతి మేల్కొను పిదప
సకల యత్నము భగ్నమై చనునటన్న
యూహ పొడమిన నాపని నుడిగి వేగ 83

తడబడు అడుగులతో న
వ్వడి గానీకుండ స్వీయ సౌధాంతరమున్
విడనాడి యశ్వ శాలకు
వడి జని యందున్న తురగపాలుని లేపెన్. 84

అశ్వపాలకు డట్లు నిశాంతరమున
కాలి నడకను గుఱ్ఱాలశాల వఱకు
వచ్చి నిలచిన యువ రాజు వదన మరసి
సంభ్రమాశ్చర్య పులకిత స్వాంతు డయ్యె. 85

"స్వామి యిది యేమి కడు నిశా సమయమందు
వచ్చి పిలిచిరి పనియేమి వచ్చె బాబు"
అనుచు ప్రశ్నించు భృత్యున కాదరమున
వినిచె యువ రాజు తన యాజ్ఞ వేగముగను. 86

నీకన్ని విషయములు నే
సాకల్యముగా వచింతు ధన్నా యిదిగో
నా కొఱకు వెల్లి గుఱ్ఱము
తోకొని యిటు తెమ్ము చాలతొందర యని నన్. 87

జీవితంబెల్ల యువరాజు క్షేమమునకు
ధార వోసిన ఛన్నుఁడా దరముతో డ
రాజు కోరిన పాల సందరపు వన్నె
తురగమును తెచ్చె నును జీనుతో నమర్చి. 88

రాజు గుఱ్ఱము నెక్కె రేరాజు తూర్పు
దిక్కు గిరి నెక్కి చూచిమోదించు చుండ
కులుకు నడినెత్తి పిల్లల ★ కోడి మిఁగుల
సోలి కలసెను వెన్నెల పాలలోన. 99

మహివి గ్రమ్మిన దుఃఖతమమ్ము తోల
తేడు వెడలఁట వెన్నెల తేడు చూచి
దారి కన నీని తిమిరము దమ్మదంచి
సాయ పడినాడు యువరాజు చంద్రిమునకు. 90

సంత తానంద మోక్ష వేశ్మమును కనగ
నరుగు చున్నాడురాజు శ్వేతాశ్వమెక్కి
సన్నుతానంత జ్యోత్స్నాప్రసాదనమున
తనుపు చున్నాడు తారకా ధవుడు నాడు. 91

---

★ పిల్లలకోడి- కృత్తికా నక్షత్రము.

రాకుమారు ని యాజ్ఞ శీర్షమున దాల్చి
అశ్వ గమ నమ్ముతో ఛన్న దరుగుదేర
స్వామిభక్తి పరాయణ త్వమునఁదనరు
వాని తిలకించి నృపప్రియే గ్రామను వడియె. 93

జవము తో నట్లు రెండు యోజనములరుగ
వాటముగ నున్న మామిడి తోట కెలన
పాము గతిసాగు ★ అనమా న దీమతల్లి
స్వాగతం బిచ్చె యువరాజ చంద్రమునకు. 94

ఆ నిగూఢ ప్రదేశమ్ము న రయగానె
శాక్యరాట్సూతి యశ్వరాజమును దిగ్గి
తిరుగులే నట్టి తన త్యాగ దీక్ష గూర్చి
స్పష్టమొనరించె నీరీతి ఛన్ననకును. 95

చిన్న ప్పటి నుండియు నీ
కన్న కుమా రకుని రీతిగా కడుప్రేమన్
నన్ను గని మురి యు చుండెదు
ఛన్నా! నీమేలు మరువ శక్యమెనాకున్. 96

కామ భోగోప లబ్ధ లోకమ్ము నడుమ
యిరుకు కొనిపోయి నన్ను నే నెరుగనట్టి

---

★ అనమానది కపిలవస్తు నకు నైరుతి దిశగా నాలుగు క్రోసుల దూరమున నున్నదట

సమయమందున వైరాగ్య సదన శోభ
చాటి చూపిన మార్గదర్శకుడ వీవు. 97

నరులు మనలక యున్నట్టి నడికిరేయి
ప్రీతి ద్వైవార వచ్చితి వింత దవ్వు
నీ ఋణమ్ము ను దీర్పగా నేర నన్న
శ్రిత గుణాకార విజ్ఞాన చిత్త హార 98

జనకు డీమధ్య నాకు రాజ్యము నొసంగ
చూచు చున్నాడు తలపోయ చోద్యమగును
నరుల దుఃఖాశ్రుధారతో మరుగుచున్న
ధరణి పాలించు నట్టి మేదకుల మీరు, 99

తమపై తమ దీవనములు
క్రమముగ పనిచేయు ననుచు కలలం గనుచున్
తమ యంత శ్శత్రువు లను
సమయించి జయమ్ము కాంచ జాలరు నేతల్, 100

కడగి ప్రాణుల జరరుజా గ్రసిత దీన
దశను తొలగించి నిత్య మోదము నొసంగ
జాలు వాడెవ్వడో వాడె జగతినేల
తగిన వాడన్యులెన్న చిత్తరువులన్న. 101

జర రుజా మృత్యు ఘోరసంగరము నడుమ
చివికి దురపిల్లు చున్నారు భువిని నరులు

కరగి తపమున లోకశోకము నడంచు
ధనము కొనివత్తు తెచ్చియిం దరకునిత్తు. 102

అని సర్వజ్ఞుడనూన విశ్చయముతో యానంద బాష్పాలతో
వినిపించన్. విలువెల్లి నీరయి మహోర్వీనాధ సూనుండు దా
నన వద్యంబగు ధర్మమార్గ గతుడై అత్యల్ప కాలమ్ములో
జనతా దుఃఖహారమ్ము చేయుననుః విశ్వాసమ్ము లో గల్గియున్. 103

బాల్య మాదిగ యీనాటి వఱకు తనను
గారవించుచు నున్న బంగారు తండ్రి
నేడు తన చేతి మీదుగా పాదవుల
పాలబడు నన్న సంతాప భరముతోడ. 104

"పతికె; ఛన్నుడు ఓ బాబు తలచి చూడ
పెంచి చిలుకను పిల్లి కర్పించినట్లు
తండ్రితనయుల ప్రేమబంధనము త్రెంచి
నేను వవి పాలుచేయు చున్నాను నిన్ను. 105

పరుల దుఃఖాలు బాపుట కెరగి యేగి
వినుత భోగాలు నగ్గిలో విడచునట్టి
త్యాగ మూర్తులు నీకెనయైనవారు
లేరు యీనాడు ముందుండ బోరు తండ్రి. 106

నీగృహత్యాగ మాలించి నిలువ గలడె
ధరణిపై ప్రాణముల తోడ తండ్రిగారు

ఈ వియోగాన్ని శిఖల దానెట్లుసైచు
పరమ సుకుమారి యగు దండపాణి తనయ. 107

తండ్రి ప్రణయాంక పాశ బంధన సుఖంబు
నోచు కొనలేని బిడ్డను చూచుకొనుచు
యెంతకాలము దరిలేని చింతతోడ
గాసి బడ వలెనా యశోధరా పవిత్రి. 108

నీవు రాజాధి రాజువై నిఖిల రాజ్య
శాసనోద్దండ పాండిత్య జలధి నడుమ
మమ్ము మూంచెత్తుదు వటన్న మమత పెంచు
కొన్న మాకింక దిక్కేమి యున్నదన్న" 109

వడకు చేతుల కన్నీరు తుడుచు కొనచు
ధన్ను డాడెడు పలుకులు విన్న జినుడు
మొదట చలియించు నెదదను కుదురు పరచి
నెమ్మి వచి యుంచె తుది నిశ్చ యమ్ముగాను. 110

"స్వామి భక్తి పరాయణా వ్యున్న నీకు
జన్మ సార్థకమైనదీ క్షణము నందు
నిన్ను గవి నేనేర్పు కొన్నదొక్క
టున్న దది యేమొ తెలిపెద నన్న వినుము. 111

నేను రాజాధి రాజునై నిక్కువముగ
తమ్ము సుఖపెట్ట గలనని నమ్ముకొనిన

ప్రజల భవరోగ దుఃఖముల్ బాపలేక
కద్దె కాసించుట ది కృతఘ్నతయె సుమ్ము. 112

జ్ఞాన నే పూని భవరోగ దానవుని వ
ధించ గల కైదువులను సాధించి తెచ్చి
యిచ్చి నరజాతి కోమల హృదయ పీఠ
మెక్కి పాలింతు జగముల నిక్కువముగ. 113

మేను వడుగాక నా కృషి మానబోను
మూరు మాటాడ కింటికి వారువమును
తీసుకొని వె ళ్ళుమని. చెప్పి తీసియొసగె
రాజలాంఛన ములనెల్ల రాసుతుండు 114

వెమలి పులిరీతి లెన్నగా నమరి బెదరి
పారుచున్నట్టి తుమ్మెద బారువంటి
నెరి కురుల బట్టి పెర కేల ఛురికతీసి
తరుగు కొనియెను తృటిలో తథాగతుండు 115

బోయ వాడొక్క డాదారి బోవుచుండ
సాదరంబుగ జీరి పీతాంబరమును
వేగమున కట్టనిచ్చి యప్పేదవాని
వలువ నర్థించి దాల్చె నవ్యాజ ముగను 116

ఛన్నుండా కృత్యముగని
కన్నుంగవ నీర మొలుకగా జనె, జిమదున్

తన్నొరు లెఱుగని గతినా
పన్నతాత్రిణార్థ మరిగె భయదాటవికిన్. 117

సరవి నిడువది తొమ్మిదేండ్ల దుగూతరిని
విశ్వమానవ దుఃఖమ్ము వెడలజేయు
పథము నరయగ రాజ్యసంపదను కూడ
విడచి వెడలెను సిద్ధార్థుడ దవులకును 118



# బుద్ధపురాణము

## అన్వేషణపర్వము

### విలాపము

పుత్రోదయో త్సవమ్ముల లోన జరిగెడు
నృత్య గీతాదుల నెమ్మి నరసి
పొద్దు పోయెడు దాక నిద్దుర రామిచే
బడలికగా నట్టె పడకమీద
మాగన్ను విడియున్న మగువ యశోధరా
సాధ్విలో సౌంద్యమ్ము సడలు రీతి
వైతాళి కావళి గీతి కాలాపన
మ్ములు కోకిలారావ ములను గెలువ
సెజ్జనుండి లేచి పజ్జ పానుపు మీద
పవ్వళించి యుండు ప్రాణవిభుని
చరణములకు మ్రొక్క నరిగి నాధుని యందు
కాన లేక తలచె కమల వదన, 1

"ఏకా రణమున నెటకో
భూకాంతుడు నేను విద్రుమనుగగ జనియెన్
నా కాపరమ్ము గాక, యి
ల్లీ కన్నుల కింత మగత యేటికి చెప్పుమా?.. 2

భారతీ యాంగనామణి ప్రతిదినంబు
పతి పదాబ్జంబులంటకే పనినిచేయ

నొల్లి నానాటి పొరపాటు వల్లి వాలి
పరితపించె యశోధరా సతి మదిని. 3

స్వీయ కార్యము నెట్టులో చేసుకొనుచు
జాము ప్రొద్దెక్కినను పతి జాడ యంత
తెలియ రామిని లోలోన కలవరించి
పరి జనుల పంపె సర్వాంతి పురిని రోయ. 4

పురము నందెందు యువరాజు వరయ లేమి
పరిజనమ్ములు సంతాప భరితులగుచు
శాక్యరాజాధినేత దర్శనము చేసి
విన్నవించిరి మధ్యాహ్న వేళయందు. 5

మే నిమేషమ్ము సంద్రైన యీ విపత్తు
తరము కాని వచ్చునని మది వెరచు చున్న
శుద్ధన ప్రభూత్తు పెదవిని విప్పలేక
గుండె స్తంభించి నట్లు కూర్చుండె. నంత. 6

తమ్ము దరు దెంచి యువరాజు సాహా సమ్మ
కన్నుగవ నీరమూరలగా విన్నవించ
కొడుకు చేసిన పనివిని పుడమిఱేడు
కడుపులో చేయి వెట్టిన కరణి గుమిలె. 7

సంతతి లేని చింత సహజమ్ముగ తీర పతీ వియోగమే
పంతమూని చేవ తదవస్థను దాట ప్రియాత్మజుండు వే

ఊంతలు వేసినంత ధరణీంద్రుని జీవన భాగ్య సీమలో
చింతలు మేడ కట్టుట విచిత్రమె కో తలపోసి చూడగన్. 8

ఆ వార్తాశర మగ్ని జిహ్వికలదై యత్యంత వేగమ్ముతో
హావం బిందెల తో వెసంగు లతికా పుంజాల మధ్యమ్మునన్
శ్రీ విప్పారిన ధర్మహర్మ్య గత యౌ సిద్ధార్థు నర్ధాంగిలో
తావులె దప్పెడు కల్పనా గృహములన్ దగ్ధమ్ము జేసెన్ త్రుటిన్. 9

ఆ మధ్యాహ్నమునకు తన
స్వామిని దర్శించ లేక సతమతమగు నా
కోమల లతాంగి వార్తా
సామజ కరమందు చిక్కి చాల తపించెన్. 10

సహజ లావణ్య సుమము దుస్సహ కరాళ
కాల మహిషము నెత్తిపై రాలినట్లు
ధవుని త్యాగము వినిన యా తలిరుబోఁడి
సోలి మూర్ఛిల్లి నేలపై కూలిపోయె. 11

ఇరు గడల నున్న దాదులు
సరగున శైత్యోపకరణ సామాగ్రుల తో
మరి మరి విధముల సేవలు
నొరపినఁ దెలివొందె నంద నిమిషమ్ములకున్. 12

క్రొన్నన బోడి పదంపడి
కన్నులలో నీర ములరగా గుములుచు న

ట్టున్న తరి పాల కొఱకై
చిన్నిసుతుం డేడ్వలేచి క్షీరము విడచున్. 13

ఏమీ సాధుడ పూర్వ త్యాగధనుడై యానిత్య సౌభాగ్యమా
సీ మన్ నన్నుత్యజించి పోయి జనతా చింతాగ్రహా ర్ద్రమ్ము ని
ష్కామప్రేమ ఫలమ్ము తెచ్చి యిడునా? సౌహార్ద చిత్తమ్ము తో
మేమో! యీ దురదృష్ట జీవిగతి యింకెట్లున్నదో దైవమా!. 14

అని చింతించుచు క్రమ్మర
వనజాయత నేత్ర ప్రాణ వల్లభు లీలల్
మననమ్ము సేయు వేళలో
నను కొన జొచ్చిన ది హృదయ మారాటపడన్. 15

లోకోత్తరంబౌ వశోక ఖాండము తోడ
మణి మాల నిడు నాటి మమత మరచి
తండ్రి చేసిన మహోద్దండ పరీక్షలో
విజయ మందిన నాటి వేడ్క మరచి
మధు రాతి మధుర మౌ మనవివాహము నాటి
సూత్రధారణలోని శోభ మరచి
వెలలేని నన వాటి తొలికూటముల నాటి
ప్రణయ సూనృతోక్తి సారమ్ము మరచి
సర్వము త్యజించి మానవ జాతి దుఃఖ
సాగరమ్ముల నింకించ జాలు యోగ

రాజ్యమును పొంద నేగిన పూజనీయ
పాదదాసిని నను వీడ భావ్యమగునె. 16

అనయమ్ము సీతపో వనములో శోధిని
చేబూని పరిశుద్ధి చేసి చేసి
మలిన మౌ నీకావి మడుగులు మడుగునం
దొప్పు మీ రెడు రీతి నుతికి యుతికి
సరి యైన వేళకు జపము చేసుకొనంగ
పరికరంబులు సిద్ధ పరచి పరచి
ఏపూట నోసుంత పాపాద వనములో
తిరిగి పండ్లాకులు తెచ్చియిచ్చి
నీ పదాంబుజ సంసేవ నెరపి ధ్యాన
ధారణా దిక మహనీయ దర్శనంబు
చేసుకొనుచుండి జీవిత శేషమెల్ల
తనిసి యుందును నను వీడ దగునె నాధ 17

భయ దాట వుల వెంట పయనించుచో సింహ
శార్దూల ముల కాలి జాడల రసి
పొదరిండ్ల మధ్యగా పోవుచుండెడు వేళ
కొండనా గములుండు గుట్టు తెలిసి
ముళ్ళ కంపలదారి వెళ్ళగా వలయుచో
పదములు మెగాల్ల యొదిగి పెట్టి
సెల యేరుల నుదాటి చేరవచ్చిన చోట
కాష్టంబుతో లోతు కాంచి చూచి

చెప్పుకొన రాని యాకటి చిచ్చువలన
పచ్చికాయలు మెసవగా వలసి నపుడు
చచ్చు పుచ్చులు కలవేమొ విచ్చి చూచి
యేగు చుండుము నా హృదయేశనీవు 18

పురుషులౌటను మది కోర్కె పొడమగానె
గేహమును వీడిపోయి నా రూహ కొలది
పడతినగు నేను మీవలె వెడలియున్న
ఆదరించునె లోక మర్యాద నన్ను. 19

మానవ లోకదుఃఖమయ మార్గమునే పరిశుద్ధి చేయగా
పూనిన త్యాగమూర్తివి ప్రభూ? భవదీయ పదాబ్జ నిర్మల
ధ్యాన సుధారసంబు నను ధన్య చరిత్రను చేయలేదె? నా
మానవ జన్మమింక పరమార్థ గతిన్ నడిపించ దా ప్రభూ? 20

జలధి వలయిత మగు ధరా చక్రమందు
పాటి జీవుల దుఃఖాల కోటలెల్ల
కులద్రోయుచు నీ వేలుకొనిననాడు
నాకు నీసీమలో పాలు లేకపోదు 21

ఎరుక పరచిన యనురాగ భరిత నగుచు
వెంట చనుదెంచి మీ తపో విఘ్నమునకు
దారి తీయుదు నను కాని నాథ కాని
సాధ్వి హృదయంబు తెలుసుకో జాలరైరి 22

ప్రాణి లోకపు సౌభాగ్య భాగ్యమునకు
స్వీయ సౌభాగ్యమును తృణ ప్రాయముగను
మీవిధంబున విడచిన భూవరులను
నాడు నేడును యిక ముందు చూడగలమె! 23

తాము విడచిన భోగ సంతతిని నేను
పులుము కొనుచుందుసని మదితలతు రేమొ
జీవితేశ్వర నీపాద చింత తక్క
నొల్ల నన్యము నా మాట పొల్లు కాదు 24

తిరిగి యే నాటికైన యీ దీనురాలి
మీద దయ పుట్టి వచ్చిన యీ దరిద్ర
జీవితమ్మును సఫలము చేసు కొందు
నత్య వచనమ్ము లివ్వి నీ చరణ మాన 25

నాకు నమ్మక మున్నదీ లోకమందు
మీ పవిత్రోక్తి భవ రోగ తాప మణచి
నిర్వికార ప్రబోధిత నిరుపమాన
శాంతి రాజ్యము నెలకొల్ప జాలువనుచు. 26

అని; యశోధర విరతమ్ము మనము నందు
వినుతి చేయుచు పతిపాద వనజములను
తత్ప్ర సాదోపలబ్ధు డౌ తనయు పోష
ణమున గడపుచు నుండెను దినములొగిని 27

ఇలువెడలి యున్న తనయుని
పలుకులు సారథి వచింప వసుధేశుడు లో
కలత పడి మెల్ల మెల్లన
తెలివొందెను రాజ్యమేలు ధీనిధి యగుటన్. 28

తనయుండే వాడైనను
జనతా భవరోగ హర ప్రశస్తౌషధమున్
గొనివచ్చి మిగుల ముందుగ
తనచే ద్రావించు ననుచు ధైర్యము పొందెన్. 29

పురజనులను కొని రీ గతి
పరమాత్ముడు గౌతముండు ప్రత్యక్షముగా
వరమోక్ష మార్గమును గని
మరలి వచ్చి చూపగలడు మన కందర కున్. 30

అన్వేషణము

కపిల వస్తు పురిని గల జను లీ రీతి
తలచు చుండ నడవి దారి బట్టి
సాగి పోవు చుండె సర్వార్థ సిద్ధుండు
ముక్తి కాంత నరయు మోహము నను 31

తత హంస తూలికా తల్పాన పవళించు
నృపసూతి నేలపై నిదుర చెంది
హొంబట్టు పుట్టంబు లొగి ధరించెడు భోగి
చిరుగు గుడ్డలు కట్టి చింత పడక

చవులూరు పంచభక్ష్యములు మెక్కెడు నేడు
ఋమతనే దుంపలో నమిలిమ్రింగి
బంగారు పాత్రలో పాలు త్రాగెడు మేటి
వాగు నీరము కేల త్రాగి తనిసి
కుడుచు చోట పండు కొనక పండినచోట
కుడువ బోక గిరుల నడవులెన్నొ
దాటిపోయె మోక్ష ధామమార్గము జూడ
వలయు నన్న దీక్ష వదల కరుగు 32

తాను మెట్టిన పల్లె పత్తనము లందు
వెలయు విజ్ఞాన తేజులఁ గలసి కొనుచు
వారు కావించు మోక్ష విచారణమున
తనివి చెందక ముందుకు తరలిపోవు 33

శాక్య - పద్మలు

జాట యందలి సెలయేటి పట్టు నందు
వెలయు మునిపల్లె యందలి వేదవిదులు
వేద శాస్త్ర పురాణ సంవాదనములు
నలుపుచో వారిలోపల కలసె తొలుత. 34

కమల నయనుడు చంద్ర సంకాశ తనుఁడు
సన్ను తాకారుడతుల ప్రసన్నవదనుఁ
డైన గౌతము దర్శనం బబ్బగానె
స్వాగతం బిత్తు రతడెందు చనిన ప్రజలు. 35

ఆముని పల్లెయందు విన యాంచిత రీతిని భక్తియుక్తలౌ
భూమిసురాంగ నామణుల పూర్వ గుణాఢ్యలు. శాక్య. పద్మ, యన్
భామిను లాదరించి బహు భంగుల గొల్చిరి గౌతముండు వి
ద్యా మహిమంబులన్ తనివి నందక సాగెను మోక్ష కామియై. 36

## రౌవతుడు

వైశాలీనగర ప్రధాన పథినా భవ్యాత్మ దేతీర త
ద్దేశీయుండగు రౌవతుండను మహా దివ్యర్షి సర్వజ్ఞు ను
ద్దేశంబుల్ విని సమ్మదాశ్రువులతో దీవించె నమ్మౌని సం
దేశంబుల్ వినుచున్ జినుండు గడపెన్ పూరార్థ మాసంబటన్. 37

రౌవతుని యాశ్రమంబున
దేవతలం దనియజేయు తెరగులవెన్నో
భావించి ముక్తి నొసగగ
లేవని నిర్ణయమొనర్చి లేచి పథికుడై. 38

## ఆరాడ కాముడు

ఆప్రాంత వాసియౌ ఆరాడ కామాఖ్యు
బరగు పండితుడు సంప్రాప్త యశుడు
యోగ శాస్త్రములో మహోద్దండు డని విని
దర్శించగా మహోత్కంఠ పొడమ
శ్రమ లెక్కగొనక దుర్గమ కాననము దాటి
కతిపయ దినముల కతుల భక్తి
దర్శించి సువ్రతోత్తములైన యాతని

## శిష్య వర్గమ్ములో చేరి దీక్ష

మీఱ షడ్దర్శనములలో ధీకులైన
సాటి ధాతువుల నెల్లర దాటిపోయి
గురువరేణ్యుని హృదయ నిగూఢ శక్తు
లన్నియు గ్రహించె గౌతము డద్భుతముగ. 39

ఇల్లు వాకిలి విడనాడి యేండ్ల కొలది
సమయమున నుండి యోగశాస్త్రము పఠింపు
వారి నెల్లర మొన మొన్న వచ్చినట్టి
గౌతముడు మీరి యుండుట కాంచి గురువు. 40

ఇత డెవరో మహనీయుడు
క్షితిపై జని యించినట్టి శ్రీహరి యేమో
గత మేల నేడె యీతని
స్థితి గతు లెఱిగెద నటంచు చింతించి మదిన్. 41

ఆదరమునఁ జీరి యారాడ కాముడు
గారవమ్ము మీఱ కౌగలించి
నీప్రభావ మెన్న నిస్తుల మైయుండె
తనయ నీచరిత్ర విన దలంతు. 42

నావుడు సర్వజ్ఞుడు తన
జీవిత చరితమ్ము తెలిపి క్షపతిలయములో
చావుం బుట్టుక లంటని
త్రోవజను రహస్య మెరుగుడురె మీరనినన్. 43

సర్వజ్ఞుని సంప్రశ్నము
నిర్విణ్ణుని చేయగురువు నిరుపమ దీక్షా
ధూర్వహ యిది నాచేయిక
నిర్వహించ బడుట కల్ల నిజమెట్లనినన్. 44

జగతిలో గల సర్వ జంతు సంచయములో
నరులుత్తముల రట్టి నరుల కన్న
పండితుల్ శ్రేష్టులు పండితావళి కన్న
యోగీశ్వరులు ఘనుల్యోగులందు
సిద్ధులున్నతులట్టి సిద్ధపురుషులకన్న
త్రిదశులు ధన్యులా త్రిదశులందు
కమల జన్ముడు మేటి కమల జన్ముని కన్న
శంకరు డత్యంత సన్నుతుండు

శంకరుని కన్న పూజ్యుడౌ జలజ నాభు
డధిపుడై యుండుగాని వీరందరికిని
జీవితముల ప్రమాణముల్ చెప్పబడియె
నన్నమము బోటివారల నెన్నదరమె 45

కావున నీవీ కార్యము
జీవితమున సాధనమ్ము చేసిన యెడలన్
నావంటి వాని మరువక
రావలయు కుమార వచ్చి రక్షింపవలెన్. 46

ఆదరమ్ముమీఱనారాడ కాముడు
మగుడ రమ్మటంచు మరల మరల
వేడి సెలవొసంగ విశ్వ మానవదుఃఖ
హారకుండు మగధ దారినరిగె. 47

రుద్రకుడు

మగధ సామ్రాజ్య లక్ష్మికి మకుట మైన
రాజ గృహ పట్టణము చేరు రాచబాట
పట్టి పోవుచు పండిత ప్రముఖుడైన
రుద్రకాహ్వయు దర్శించె భద్రమూర్తి 48

రాగ మడర నవ్విరాగి యేతెంచిన
శాక్య మునిని చాల సత్కరించి
అతని జ్ఞాన తేజ మరసి నెమ్మనమునం
దబ్బురంబు చెందుటరసి జిమడు. 49

స్వామి మీకు సమానులు
భూమి వలయంబునందు పొడచూప రటం
చే మేమొ వినుటచే మీ
సామీప్యము చేరినాడ సుగుణోపేతా ! 50

జగతి యందున్న ప్రాణి సంచయము చావు
పుట్టుకల బోనులో బడి కొట్టుకొనుట
మాను పగజాలు పరము నిర్వాణ పథము
చేరగల తీరెఱింగిన చెప్పుడయ్య ? 51

అనిన; రుద్రుఁడు స్వామి గ్రంధానుభవమె
కాని; స్వీయానుభవమింత కాన నేను
కొలను నందున్న బత్తి కొమ్మలను చూచి
బేర మాడిన యట్లు నాతీరులుండు. 52

తాము నిర్వాణ మార్గ సందర్శనమ్ము
చేయఁగలరని నామది చెప్పుచుండె
తిరిగి యెపుడైన యింటికి మరలు నపుడు
ఇటకు దయచేసి దర్శనమిందు కృపను. 53

అనుటయు గౌతముం డచ్చోట విడనాడి
మరికొన్ని దినములు తిరిగి తిరిగి
రాజ గృహ సమీప రత్న శైలము చేరి
యోగసాధన చేయు చున్నతరిని
ప్రజలీతడెవ్వరో పరను యోగీంద్రుడు
మన రత్న గిరిమీద మసలుచుండె
నరయగా నెంతయో తరుణ డీతని గన్న
తలి దండ్రు లెంతయో ధన్యతములు

సురలలో గాక యింతటి సురుచిర ప్ర
శాంత తేజస్వి యుండునే జగతి యందు
భయము చెందదు తొనకదు భయదవిపిన
భూములందుండు మృగముల పొలుపువగని. 54

ఆయా సమయమ్ముల గిరి
చాయకు వనిమీద పోవు జనముల పారా
ప్యాయతతో సుగతుని గని
కాయో పండో యొసంగ గడగిరి భక్తిన్. 55

అనాధ

పేద బాలుఁడొకడు మోదమ్ముతో నాట
లాడుకొనుచు తిరుగు తోడివారి
వెంట నేగుచున్న వేళ త్రొక్కంబడి
వ్యాళమొండు వాని కాలుకరచె. 56

క్రూర వ్యాళ భయంబున
నోరారగ యరచి నోట నురగలు వెడలం
గా రక్షకొఱకు వెజ్జును
జేరుచు జనయిత్రి యొడిని జీవము విడిచెన్. 57

అసలె దిక్కులేక నుసలుచున్న యనాధ
ప్రాణమైన సుతుడు మేను దొరగ
నేడ్చుచుండ చేరి రిరుగు పొరుగుల వారు
కారణం బెరింగి యూరడించ. 58

వారిలోన నొక్క ధీరుడు గిరికంద
రమున తప మొనర్చు రాజయోగి
దయ వహించెనేని తనయుని బ్రతికించు
వేగ వెడలి వాని వేడుమనిన. 59

కొండంత యాశ మదిలో
నిండుకొనన్ లేచి యనద నిర్జీవితుడై
యుండిన కుమారుతో మల
దండకు జని గౌతమునకు దండంబిడుచున్. 60

తన దీన చరిత మంతయు
వినిపించి కుమారు కావ వే సుహితాత్మా.
యని విలపించు ననాథను
కనుగొని గౌతముడు పరమ కరుణాన్వితుడై. 61

కాంతా నీ తనయుని బ్రతి
కింతును నాచెంత విడచి క్లేశపడక యీ
ప్రాంత నగరమున నే సీ
మంతిని నోయవలు కోరి మాకొసగవలెన్. 62

పిడికెడైనను చాలునో పడతి, కాని;
మృత్యు శోకంబెరుఁగని మెలత యింట
లభ్య పడవలె నవి యితరంబులైన
వాయువు నొసంగ గల పని చేయలేవు. 63

పల్లె యని లేమ వెడలి యిల్లిల్లు వరుస
తిరుగ జొచ్చెను యవల నర్థించు కొనుచు
కాని యొక చిక్కు వచ్చె నెక్కడకు జనిన
మరణ శోకంబు నెరుగని తరుణి లేదు! 64

ఏడాది కాలేదు తోడబుట్టువు పోయి
మా యింట నని కుందు మగువ యొకతె
చెట్టంత కొడుకును మట్టిపాల్జేసు కా
న్నామమ్మ యని యేడ్చు భామ యొకతె
ఊరంత ఋణము మాకొనగి స్వర్గము చేరె
మామామ గారను లేమ యొకతె
కడిపెడు బిడ్డల కని చంపుకొని వట్టి
మోడైతి ననియేడ్చు ముగుదయొకతె

ధవుని కోల్పోయి దురపిల్లు తరుణి యొకతె
కాగ; పురమెల్ల తిరుగ యెక్కడను కూడ
చావుగోడు నెరుంగని చానయిల్లు
కానరాదయ్యె ననదకు కలికమునకు. 65

తరుణి తన యత్నమిట్లు వ్యర్థమ్ము కాగ
విసిగి వేసారి వెండియు వెడలివచ్చి
తాను కని విని నట్టి చిత్రమ్ము నెల్ల
విన్నవించిన జినుడు ప్రసన్నుడగుచు. 66

"అమ్మా తిలకించితె? లో
కమ్మున మృత శోక నరక గతికిం గురికా
కిమ్మహి నెవ్వరు నుండరు
సుమ్మా! యిది నీవు నేడు చూచుట కొఱకై. 67

అనిచినాడ నిన్ను జననీ జగమ్ములో
మృతజనుండు మగుడ బ్రతికిలేచు
ననుట కల్ల యిది రహస్యమ్ము కాదమ్మ
స్వానుభవమె నిఖిల మానవులకు 68

జర రుజా ఘోర మృత్యు సంగరము నడుమ
చిక్కి యల్లాడి కాపాడు దిక్కులేని
జనుల దుర్గతి బాపెడు సరణిఁదెలియ
జేయు చున్నాడ తపమునే నీయెడజుమి. 69

సుగతుడాడిన పలుకుల మ్మగువ మదికి
శాంతి చేకూర్చ మృత సుతు సంస్క్రియలను
చేయ కొనిపోయె గుండెలు బాయు కాగ
ఖేదమయమైన లోక మర్యాద నెరిగి. 70

యజ్ఞము

మరికొన్ని దినము లేగిన
తరువాత జినుండు కొండదారి నరుగుచున్
గొఱియల మేకల గుంపుల
త్వరిత గతిని తోలు గొల్ల వాండ్రను గాంచెన్. 71

నెట్టుకొని కాయు యెండలో నట్టడవిని
పరుగు లెత్తింత రిపుడేమి పనియటంచు
పృచ్ఛ జేసిన సుగతుని వింతరీతి
నరసి తెలిపిరి తామేగు నట్టి పనిని. 72

మీరెరుంగరె మా బింబిసార సార్వ
భౌములోనదించు యజ్ఞ సంభారములకు
ఆజ్ఞ యొసగిరి మేకల నందజేయ
వారి యాజ్ఞను మీఱ నెవ్వారి తరము. 73

వారి మాటలు విని సీరైన డెందమం
దౌర రాజన్యులే ఘోర హింస
కొడిగట్టుచున్నచో పుడమిలో జనులెల్ల
కృపణులై పాప పంకిలములైన
పనియెట్లు మానుదు రనియెంచి మందలో
కుంటుచు నేగెడు గొఱ్ఱెపిల్ల
దురవస్థ కని మది కరుగ నాద్సతి దాని
మూపుపై నిడుకొని మోసు కొనుచు

మంద వెనువెంట నరిగెడు మహిత తేజు
నరసి పౌరులు తనవెంట నరుగు దేర
రాజ గృహ పట్టణము నందు రాజుచేయు
యజ్ఞశాలను జొచ్చె సర్వజ్ఞు డొగిని. 74

పరమేశ్వరుడో హరియో
నర రూపము దాల్చి వచ్చె నాడింతియ గా
కరయ నిటువంటి తేజము
నరులందరు దనుచు జనులు నమ్ర హృదయులై 75

---

ఈ బింబిసారుడు శిశునాగవంశజుడు. ఇతడు క్రీ. పూ. 582 మొదలు 554 వఱకు మగధ రాజ్యమేలెను.

వెరగు పడుచుండ సుగతుడు
నరగున జని యాజ్ఞికుల ప్రసంగమ్ములలో
వరలు నృపు నరసి క్రేవను
నరకంబడనున్న పశుగణము నరయగనే. 76

చక చక నడచుచు నవ్వే
దికపై కరుదెంచుచున్న తేజస్విని యా
జ్ఞికులరసి చేష్టలుడుగగ
ప్రకటముగా పలికె శాక్యపతి పుత్రుడిటుల్. 77

"ఓరాజన్య కులావతంస తగునే హోమాగ్ని గుండమ్ములో
నోరేలేని ప్రశాంత జీవితము లెన్నొగిట్టె నీపాటికీ
గోరప్రక్రియ చేత తృప్తిపడగా కుక్షింభరుల్ వేలుపుల్
గాదేనాటికి దీనజీవన శుభాకాంక్షారతిన్ బూనుమా ! 78

బాడబులార ! మీహృదయ పద్మములింత కఠోరమైనవా
వాడిక రాసి బూని తలవంచిన మేకల వేడినెత్తురుల్
తోడి మహాగ్ని గుండమున ద్రోయగ దైవము సంతసించునా?
వేడిన కోర్కెతీర్చి పృధివీ వలయమ్మున శాంతినిచ్చునా ? 79

నాయనలార ! మీయెదల నమ్మెడొకింత సమస్త సృష్టిలో
తీయని దొక్కటే కద,యదేమన ? ప్రాణము యట్టిప్రాణమున్
తీయ గడంగు వారలకు దేవతలెట్లు ప్రసన్నులౌదురో
న్యాయ విశాలదృష్టి గణనంబొనరించిన మీకు తోచదా ! 80

ధారుణి నబ్బు భోగముల తన్విని చెందక స్వర్గసీమలో
చేరి యపూర్వ సౌఖ్యములచే నలరారెడు నందనమ్ములో
గూరిమి వేల్పుటింతులను గూడి రమించెదమన్న భ్రాంతిలో
గూరుకుపోయి కుత్తుకలు కోయుటకున్ వెనుదీయరక్కటా. 81

లంచములిచ్చి దేవతల రంజిల జేయడమన్న భావమే
వంచనకాదె ? దేవతల వంటి మహాత్ములు లంచగొండులై
యెంచక పాపపుణ్యముల నేడెర తీరుపు లిత్తురేని యీ
కొంచెముపాటి ధర్మములు కూడ నశించవె ? భూతధాత్రిపై ! 82

వేలుపులేలు లోకమును వెఱ్ఱిభ్రమన్ దిగజారిపోయిరమ్మ !
పాలురె స్వీయరాజ్యముల పాపమయంబులు చేయుచుండిరా
వేలుపు సీమ కన్న పదివేల మడుంగులు సుఖశాంతితో
మేలగవచ్చు లోక మవనీంద్రుల హింసను కేలబూనినన్. 83

వెడను తెగగోసివైచిన మేక నొక్క
దానినైనను బ్రతికించలేని నాడు
కంటి కగుపించనట్టి లోకముల జేర
జాల గలిగిన మహిమలే సరణి కలుగు. 84

మూగ జీవుల జంపెడు యాగమందు
రక్తపంకిలమైన కరమ్ము నెత్తి
ముక్తికాంతామణీ మూర్ధమును స్పృశించ
సాధ్యమగు నొక్కొ తలపోయ జనులకిలను. 85

ఆతత పూర్ణచంద్ర నిభుడై వెలుగొందు ప్రశాంతమూర్తి వి
ఖ్యాత మనోహరోక్తుల కహర్పతి తేజుడు బింబిసారుడే
చేతము నందు కుందుచు సచేతనుడై తన చేష్టలెంతయో
పాతక మన్న శ్రీఘనుని పాదములంటి నమస్కరించుచున్. 86

"ఓదయ నీయమూర్తి భవదున్నత కీర్తి సుధారసమ్ము నం
దీదిన నాహృదబ్జమున నెప్పుడు త్వత్పద పూజఁజేతు మీ
కేది యభీష్టమో తెలుపు డెట్టిదియైన నొసంగి దుష్క్రియా
ఖేద బిలాంత రాళతిమికిన్ బలిగాక తరించ నెంచెదన్" 87

వాడిన మోముదమ్ముల వివర్ణములే తమ చింతదెల్పగా
బాడబు లట్టిలేచి, తమభావములెల్ల త్యజించి వైచి, మో
మోడక శాక్య సింహు పదముల్ స్పృశియించి, నమస్కరించుచున్
వేడిరి స్వీయ చిత్త పరివేదన బాపెడు త్రోవ జూపగా. 88

ఆదరణీయమైన వినయార్ద్ర వచస్సుల వారివారిని
ర్వేదన లెల్లబాపి పృధివీవరునిం గని నాయెడంద లో
లేదొక కోర్కెయైనను సరేయిటు చేయుము దీక్షనూని, నీ
వీధర యందహింసను రహిన్ వెలయించుము సంతసించెదన్. 89

భూత దయా పరతంత్రత
చే తనవులు పూతమగును క్షితినన్యములౌ
కాతర కార్యములీ నర
జాతికి శుభమీయనేర జాలవు రాజా! 90

భవ మహారోగ సంతాప భరితులైన
నరులు తరియించు మార్గము నరయుకొఱకు
తిరిగి విసిగితి నిక తపోదీక్ష బూనఁ
దలచినానని సుగతుడు తరలుచుండ. 91

కాళుల స్పృశియించుచు నర
పాలుడు "దేవా! తపస్సు ఫలియిం చగనే
మీ లలిత పావ దర్శన
లాలసతో నుందు నిటకు రావలయు జుడీ. 92

అనెడు, బింబిసారు నాదర దృష్టితో
కాంచి సుగతు డేగ నెంచుతరిని
బ్రహ్మ పథముగోరు బ్రాహ్మణు లేవురు
వేడి జినుని వెంట వెడలిరపుడు. 93

భద్రజితుండును బాష్ప దశ్వజితుండు
కౌండిన్యుడును శుభాకారుడగుచు
వెనగు మహానాము డసమాన దీక్షతో
తనవెంట నేతేర తరలి జినుడు
వరదయాశీర్ష పర్వతముపై కొన్నాళ్ళు
జపతపానుష్ఠాన సరణి తేలి
చిత్తశాంతి యొకింత చేకూర కుండిన
యడవి కొండలదారి నరిగియరిగి

భయద శార్దూలములు కంటబడిన కూడ
చలనమెరుగని తీవ్రదీక్షను వహించి
సాగిపోవుచు నొకకొండ చరియ నొరసి
పాఱునైరంజరా నదీ తీర మరసె. 94

తపస్సు

ఊరు బిల్వాఖ్య నొక పల్లెటూరు నదిని
చేరియున్నది క్రోసెడు దూరమందు
విడిసియుండెద రట నట వికజనంబు
ఆలమందలె తమకు స్థిరాస్తి కాగ 95

వనఫలమ్ముల నాదిలో దినుచు పిదప
పవన పర్ణాంబు భక్షణ వలన దనిసి
క్రమము గా గాలి నీరు మాత్రమున తనువు
నిలుచు రీతిని సుగతుండు సలిపెతము. 96

పవలు రేలను భేదమేర్పరు పరాని
తీరుగా ధ్యాన ధారణాదిక మొకింత
సడల నీయని మునిరాజ చంద్రు నరసి
వెరగు చెందుచు నుండిరా విప్రవరులు. 97
ఆ కఠోర దీక్ష యందున్న గౌత ముం
గనిన వారు పోల్చుకొనగ లేరు
సడలిపోవు చున్న జవసత్వముల నైన
సరకు సేయడయ్యె సౌమ్య మూర్తి. 9

శీతాత పముల నించుక
భీతిల్లి యెఱుంగడెట్టి వేళలయందున్
చేతమున నైన తనకీ
యాతన లేమిటికటంచు ననుకొన డెపుడున్. 99

ఘోరతరం బగు తపమీ
రున సాగించు బుద్ధదేవుడు వినెనా
నారి నరుగు వారెవరో
రవమున వీణమీటి గానము సేయన్. 100

వీణా రావములో
త మర్యాద కొంత చిత్రముగా సం
త మైదళ బంనకు
వజూపు తీరు లేవొ తోపించె మదిన్. 101

కీ తంత్రు లిరుగడ వదులు నడుమ
వుగా నుండి గానంబు వెలితినిచ్చె.
వు సడలిన వానికీ ధరణియందు
శాశయ ఫలసిద్ధి చెందనట్లు 102

ధారణ యోగసాధన ప్రధాన
న శుష్కోపవాస స ఘటన లందు
వు దొరగిన యీజీవితమ్ము నందు
నిర్వాణ పథమును కానగలమె. 103

తనువు కొన్నాళ్ళు వాయు భక్షణము వలన
నిలుపదగు వెష్టా లోనిగాలులు నశించు
పిదప దేహంబు తన పని వదలిపెట్టి
మట్టిపాలైన సాధించు నట్టిదేది ? 104

కానవచ్చుచు నుండె నాకమలముందు
వనజ మాకులు రాల్చి వెంబడి చిగుర్చు
కాని ప్రాణంబు దొరగిన మేమనందు
తిరిగి జీవమ్ము వోసిన ధీరులేరి. 105

ఆరేండ్ల ఘోర తపమున
కోరిక సఫలంబుగా మికుందుచు జినుడీ
తీరున తలపోయగ న
య్యూరు బిల్వమందు జరిగె నొకవింత యిటుల్. 106

సుజాత

గ్రామమునకు పెద్దకాపు భార్య సుజాత
దాన మానశీల జ్ఞానరాశి
పల్లెటూరి పేదవారికి తల్లిగా
రాణకెక్కినట్టి రమ్యచరిత. 107

ఆకలితో నెవ్వరైన నాపల్లెలో
వస్తున్న నోర్వని పరమసాధ్వి
యే పేదవారింటి కేనిబంధువులేగ
తనయింట తినిపించు తలిరుబోడి

పదిమంది బిడ్డల బ్రతికించు కొసలేని
వారిని పోషించు పావనాత్మ
పల్లెలో ప్రభవించు పసిపాపలకు పెక్కు
కానుక లొసగెడు క్రమభావ

ఒకరి నాదరించి యొకరిని నిరసించు
పక్షపాతబుద్ధి కుక్షియందు
చేరనీయనట్టి ధీర సుందరహాస
వదన యా సుజాత సదయ హృదయ. 108

ఆమె నిజాధినాథుడు మహా ధనవంతుల రీతి లేశమున్
సోమరిపోతు గాక పరిశుద్ధ కృషింబచరించి సర్వదా.
భూమిని దున్ని దీనజన పోషణకున్ వెనుదీయ డాత్మలో
శ్రీ మహిళా మనోహరుని చింతనచేయు నశేష భక్తితోన్. 109

వారినిలయ మతుల వైభవాగారమై
వెలసి సుతులు లేని వెలితిజూపు
తలిరుమ్రాకు లెంత విలసిల్లుచున్నను
ఫలము లేక తృప్తి పరుపనట్లు. 110

కోరిక లీరిక లెత్తగ
వారెన్నోయేండ్లు పుత్ర వాంఛారతితో
పేరెన్నిక గాంచిన బ్రం
దారక వ్రతముల నొనర్చి తనియక యుండన్. 111

క్రిందపేడు ఆలమందలవన వీధి
మేపుకొనగ జనిన గోపకాళి
మాధవుండు వచ్చి మఱ్ఱివృక్షము క్రింద
వెలయుచుండె నసెడు వింతవార్త 112

విని సుజాత యింటి పనిచేయు రాధతో
కూడి వచ్చి మ్రొక్కి వేడుకొనియె
స్వామి నాకు పుత్ర సంతతి కలిగిన
పాయసము నొసంగి ప్రస్తుతింతు, 113

అని; శుభాత్మ యెడద ననుకొనినదేకాని
బాహ్య దృష్టిలేని పరమమౌని
విని యెఱుంగడామె వింత కాంక్షితమును
కని యెఱుంగడతని గమనమైన. 114

ఆసుజాత యట్టులనిని యేడాదికే
కడుపుపండి ముద్దు కొడుకు పుట్టె
కొడుకుతోడ నెల్ల కోరిక లీడేర
పరవశంబు చెందె పడతి మిన్న. 115

తమకు పాలొసంగ దగిన నూరావుల
పాలుతీసి యొక్క పాడియావు
తక్కనున్న వాని ద్రావించ పాలనే
కమనిలిచె నొక్క కపిలగోవు. 116

కపిల గోవు కొంత కాలము పాలనే
త్రాగుచుండు కతనఁ దావులీను
పాలనొసగ వేగ పాయసమ్మును వండి
మ్రొక్కి తీర్చ వచ్చె ముద్దరాలు. 117

ఆ సుజాత పాయసాన్నము గొనివచ్చె
గౌతముండు నపుడె కనులు విచ్చె
ప్రభువు కనులు విచ్చె బ్రతుకే తరించిన
దని సుజాత మ్రొక్కి వినిచె నిట్లు. 118

"స్వామి త్వత్కృపా ప్రసాద సంలబ్ధిచే
కడుపుపండె నాకు కొడుకు కలిగె
మున్నువచ్చి నేను విన్నవించిన పాయ
సమ్ము నీని నందుకొమ్ము దేవ. 1

అని; సుజాత పాయసాన్నంబు నందీయ
గౌతముండు తృప్తిగా భుజించు
టెరిగి వేచియున్న యేవురు శిష్యులు
చీదరించుకొనిరి చిత్తములను. 120

---

సుజాత తన నూరావుల పాలు తీసి తొంబది తొమ్మిది యావుల కాపాలు పోయించును. మరునాడా తొంబది తొమ్మిది యావుల పాలుపితికి తొంబది ఎనిమిదింటికి పోయించును. అట్లు దినమున కొక్కొక్క అవు తగ్గుచుండగా కొంతకాలమునకు మిగిలిన కడపటియావు చిరకాలము పాలనే త్రావు చుండుట వలన మధురాతి మధుర మైన పాలొసగుచుండును. ఆ యావుపాలతో వండిన పాయసమును తెచ్చి బుద్ధభగవానునకు సమర్పించుకొనినది.

పల్లెటూరి శూద్రి పడతి యొసంగిన
పాయసమ్ము తినిన భ్రష్టుడితడు
ఇతని నమ్మి చెడితి మింతకాలము యిట్టి
పొట్ట కూటి వాని పొత్తదేల. 121

ఈమునినిక సేవించిన
భూమి సురత్వమ్ము తొలగిపోవును మనలో
నేమము సడలిన మౌనులు
కాముకులై చెడుట పెక్కు కథల జదువమే. 122

ఆ నిర్ణయమున శిష్యులు
కానన మార్గమున బోవ గౌతముఁ డటనే
మానసిక శాంతి సుధలో
పూనెను యోచించ మోక్షభూతిని పొందన్. 123

## గౌతముడు బుద్ధుడగుట

చిరతపో భూమియగు మఱ్ఱిచెట్టు విడచి
ఊరు బిల్వంబు దెస నదీ తీరమందు
రమ్యమగు బోధివృక్ష మూలమున జేరి
స్థిమిత పద్మాసనస్థుడై దీక్షనూనె. 124

అది సుగతుని యిరువది యె
న్మిది రోజుల నిష్ఠ హృదయ నీరేజము లో
ప్రిదిలెడు జ్ఞాన దళమ్ములు
సదమల నిర్వాణసార సౌరభ మురలెన్. 125

నిరతిశయ భవ జలధి నంతరణమునకు
సాధనము తోచినట్లుగా శాక్యమునికి
దీర్ఘతరమైన అజ్ఞాన తిమిరములను
త్రోసివేయుచు పూర్ణచంద్రుడు జనించె. 126

క్షితిని పాలించు సర్వార్థ సిద్ధిరాజు
గౌతముండయ్యె లోకశోకము హరించ
లోక శోకాంత మార్గావ లోకనమున
బుద్ధుడయ్యెను జ్ఞాన సముద్రుడయ్యె. 127

నిండు వైశాఖ పూర్ణిమా నిశిని లోక
తాప మణగించ జాలిసుధాంశుడుండ
పండువెన్నెల పుక్కిట బట్టినట్టి
దివ్య తేజమ్ముతో బుద్ధదేవు డుండె. 128

భువన శాంత్యైక విజ్ఞాన పుంజమెల్ల
ముద్దయై వచ్చి లోక సమ్మోహనముగ
స్వామి శీర్షాగ్రమందలి జడల నడుమ
చంద్ర బింబాకృతిని వింత చక్రమయ్యె. 129

తేజశ్చక్రమ్మును గని
భూజముపైగల శకుంతములు తక్షణమ
వ్యాజముగ స్వామి తలపై
పూజాతత్పరత నెగసి మోదము చాటెన్. 130

ఘోరంబగు భవసాగర
తీరంబును గనిన బుద్ధదేవుని గొలువన్
నైరంజరా స్రవంతీ
నీరంబొక గడియసేపు నిలిచి తరించెన్. 131

## మన్మథ పరాజయము

ఆమరు దినమున బుద్ధుడు
భూమీవలయమున ముక్తిబోధ నలుపగా
సామర్థ్యము వడయుట విని
కాముడు దండెత్తివచ్చె ఘనసైన్యముతో. 132

విరిసె తరులతాళి వివిధ వర్ణాలతో
కురిసె మధువు కుసుమ కోటినుండి
మొరసె గుండెలదర షట్కోకిల నగార
చేరవచ్చు మదను సేననుండి. 133

సేనలిందునందు జేరాడుచుండగా
కుసుమ శరుని ముద్దు కొమరితలగు
పూవు బోడులొడలి పొందము వెలయగా
నాట్య మాడజొచ్చి నారు చేరి. 134

ఎలనవ్వులలిచూపు ములుకులై నాటగా
అనురాగమొలికించు నతివ యొకతె
...నీయమగు కాలిగజ్జలందెలు మ్రోయ
నెమలి నాట్యముచేయు నెలత యొకతె

స్తనవల్కలము దిగ జారగా ప్రభుపాద
జల జమ్ములకు మ్రొక్క దలచునొకతె
కటి మీది వజ్రాల కమరు తావులు దప్ప
చుంబించ నుంకించు సుదతి యొకతె

పుష్పరజము చల్లి పులకించు నొక్కతె
విరులు చెండు గట్టి విసరు నొకతె
కాగ మరుని పుత్రికా గణమ్మెంతయో
మచ్చు మందు చల్లి మసలు చుండ. 135

చిందు మోము వెలికి పండు వెన్నెల కాంత
ధ్యానధారణముల పూని యున్న
లోకజిత్తు సత్వలోకాల కావల
వరలు టెరుగదయ్యె మరుని సేన. 136

వారి వెకిలి చేష్ట లారడి కలిగించ
లేనివయ్యె ప్రభువులో నొకింత
తప్త కాంచనమును దరిసిన మిడుతలు
భగ్గుమని నశించి బుగ్గి కావె. 137

యుగ యుగాల నుండి జగతీ తలమ్ముపై
సాగుచున్న మరుని సంగరమ్ము
ప్రభువు ముందు తెప్ప పాటులో పొందెను
యేటి మీద చల్లు నీటి గతిని. 138

లోక జిత్తు తమకు లొంగిపోవునటంచు
భ్రాంతి పడిన భావభవుని సేన
వీగిలోగి పూర్ణ వివశత్వమును పొంద
పుష్పబాణుఁ డలసిపోయె చాల. 139

పట్టు సడలిపోయె పరివారమే పోయె
భంగ పడిన మరుని పాటు గాంచి
మార జిత్తు రుచిర మందహాసము చేయ
నంగభవుని మాన మంతరించె. 140

వేసికంటి వాని రోషమ్ముతో మేను
నాశమగుటచే ననంగు డయ్యె
తిరిగినేడు బుద్ధ దేవుని నవ్వుతో
హృదయమే నశించ చెదరిపోయె 141

ధరణియందు నాటి వరకు నోటమి లేని
మరుని పారద్రోలి మారజిత్తు
సార్ధకాఖ్యుడయ్యె సర్వ సర్వంసహా
చక్రమేల దగిన చతురు డగుట 142

# బు ద్ధ పు రా ణ ము.

## సం చా ర ప ర్వ ము.

### ఆ నం దు ని శు శ్రూ ష.

ఇరవది యెనిమిది దినముల
వర కట్లుపవాసమున్న వాడై ధృతితో
మరు నెదిరి పార ద్రోలిన
సురు చిర తేజుండు స్రుక్కి సోలెనచటనే. 1

ఆప్రాంత సామంతుడైన రాజన్యుని
తనయుడానందు డుత్తమ గుణుండు
శైశవం బాదిగా సకల విద్యల యందు
పండితుడై ముక్తి బడయు తెరగు
తెలియ గోరుచు బుద్ధదేవు డావనములో
తపమొనరించు వృత్తాంత మెరిగి
తరలి వచ్చుచునుండ దారిలో బుద్ధుని
యేవురు సచ్ఛాత్రు లెదురుపడిన

గౌతముని కూర్చి యడుగ "దుర్నీతుడతడు
భ్రష్టుడైతినె నొక శూద్ర పడతి భిక్ష
వానిసేవించి నీవేమి బాపుకొందు"
వని వచించిన యానందు డాలకించి. 2

వీరి మాటలలో కొంత వెలితి యీర్ష్య
కాన వచ్చుచు నున్నది గౌతముందు
చిరతపః పరిపూరిత చిత్తుడగుట
జాతి వైషమ్యమును వీడె సహజముగను. 3

జన్మవలన భువిని జాతి యేర్పడలేదు
కర్మగుణ విభాగ కలనగాని
శుద్ధహృదయ యైన శూద్రాంగనామణీ
భిక్షమేలు విప్ర భిక్షకన్న. 4

అనుచు నిర్ణయించి యానందు డరుదెంచి
బుద్ధదేవు శరణు పొందినాడు
బుద్ధదేవు డతని పొలకువ నెరుగడు
తీవ్రనిష్ఠ మునిగి తేలుకతన. 5

పరులెవ రెరుంగ కుండిన
యిరువది యెనిమిది దినాల హీనా ద్భృతితో
గురుదేవు డ్రేవ నటు నిటు
తిరుగుచు కాలమ్ముగడిపె దీక్షా పరుడై 6

మదను డోడిపోయి మరలిన యానాడు
స్రుక్కియున్న గురుని శోషనరసి
వెడలి వేగ యూరు బిల్వగ్రామ మునునుండి
పాలు తెచ్చి యొసగె ప్రభువునకును. 7

ఈ జగమ్మునందు యెవ్వరెరుంగని
బుద్ధమూర్తి జ్ఞానముద్ర తొలుత
నరయ గలిగినట్టి యానందుఁడే ధన్య
జీవియయ్యె నెల్ల జీవులందు. 8

## నిర్వాణబోధ

మహనీయుడట మోక్షమంది రమ్మును చేరు
మార్గంబు నెరిగిన మాటవినిన
యూరు బిల్వనివాసు లున్నవారున్నట్టు
లాబాల వృద్ధపర్యంతముగను
సంభ్రమంబునవచ్చి స్వామి తేజము గాంచి
సాగిల బడిమ్రొక్కి శాంతి సుధను
కడుపార ద్రావునుత్కంఠతో నుండుట
గాంచి సర్వజ్ఞుడు కరుణతోడ

"పట్టు బడెను లెండు భవదుఃఖ దనుజుడు
నెట్టి వేయుడింక నిఖిల దుఃఖ
సముదయమును మోక్ష సౌధాంతమును జేరు
బాటపైన మీదు పదములుంచి. 9

జన్మ దుఃఖమయము జరయు దుఃఖమయమ్మ
రుజయు దుఃఖమయము లోకమందు
కోరినట్టి వస్తుకోటిని గోల్పోయి
దుఃఖ పడుట కాంచు డీము సతమ్ము. 10

దుఃఖతతిని పెంచ దొడగున దేతృష్ణ
తృష్ణ నణగద్రొక్కి తీరవలయు
తృష్ణ యణగెనేని దివ్యమౌ నిర్వాణ
పథము దొరుకు నెట్టి వారికైన. 11

తృష్ణాగ్నితో పోరి జిష్ణులౌటకు సత్య
శాంత్యహింసాస్త్రశస్త్రములు దాల్చి
1. పరిశుద్ధ సంకల్ప 2. పరిశుద్ధ యనుభవ
3. పరిశుద్ధ వాక్కునే పలుకవలయు
4. పరిశుద్ధ వర్తన 5. పరిశుద్ధ జీవన
6. పరి శుద్ధ కృషి నుర్వి నెరపవలయు
7. పరిశుద్ధ హృదయంబు 8. పరిశుద్ధ యోచనా
పరతతో సర్వదా బరగవలయు

అనయ మెవ్వ రిట్టి యష్టాంగ మార్గంబు
పట్ట గలరొ వారు భవ భయంబు
నెట్టి నిరుపమాన నిర్వాణ సుధగ్రోలి
వెలయగలరు జాతి భేదముడిగి. 12

దుఃఖ రాశి దాటి తోరమౌ తృష్ణాగ్ని
శిఖల దాటి నరుల శేష దీక్ష
మంచివారలగుచు మంచినే చేయుచు
భవము లేని పరమ పదము గనుడు. 13

పారమితలు లెక్క పదివాని నన్నింటి
పూర్తిచేయ నరుడు పూనవలయు
పారమితలు సహజ పరిమళావృతములై
పులకరింప జేయు భువనములను. 14

1. దానము 2. శీలము తలుప 3. నిష్కర్మ
సరవి 4. నధిష్ఠాన 5. సత్యమ్ము 6. కరుణ
7. క్షాంతి 8. యుపేక్ష 9. ప్రజ్ఞా 10. వీర్యములను
పదిపారమితలు సమ్మదచిత్తులగుచు
పూరించి నిర్వాణమును బొంద నగును. 15

పగ వలన పగ నశించదు
జగతిని తలపోయ నెల్ల సమయము లందున్
పగనణచి వేయ ప్రేమయె
సుగమంబగు మార్గమై వసుంధర వెలయున్. 16

ప్రేమాను బంధనము ని
ష్కామంబై యుండవలయు గాకుండినచో
కాముని మాయాజాలము
లో ముంచి నశించ జేయు రూఢిగ నదియే. 17

చలన మెరుగ నట్టి శాంత్య హింసాదీప్తి
ప్రేమ రాజ్యమందు వెలయు చుండు
నందు జాతిభేద మావంత కనరాదు
కలుష ముండబోదు కలికమునకు. 18

సారహీర మైన సంసార కూపమే
నిత్యమనుచు వెలికి నిగిడి రాక
మెలగుచుండు వాని మృత్యువు దిగమ్రింగు
మరల పుట్టువాడు ధరణియందు. 19

కావున మీరెల్లరు దుః
ఖావిల సంసారజలధి గడచుట కొఱకై
జీవితమీ వనమార్గము
లో వెచ్చించగ భవములోగి నశించున్. 20

యేకాకి యైన నరుడీ
లోకములో తప్పుదారిలోఁ బడుచుండున్
గాక యటులెల్లరును సం
ఘాకారమ్మును వహించి యల రార వలెన్. 21

ఇదియే దుఃఖాంత పథం
బిదియే తృష్ణాగ్ని నణచు నీ మార్గములో
పదములిడి జాతి భేదము
వదలి చనుడు మోక్షసౌధ వాసము చేయన్." 22

బుద్ధ దేవుని నవ్య బోధామృతము గ్రోలి
పులకించి రాతపో భూమియందు
చేరియుండిన నరుల్ శీఘ్రమే నవధర్మ
మార్గము జొచ్చిరి మాన్యరీతి

నైరంజరానదీ నీరమ్ములో వింత
పోడిమి పొడసూప పొంగిపోయె
సకల సరీసృప జంతు సంతానమ్ము
లన్యోన్య మచ్ఛరం బంతరించ
ధరణి యేక కుటుంబమై వరలినట్లు
స్వామి సన్నిధి వసియించ సాగినయవి
లోకమందలి చీకటుల్ రూపుమాయ
జ్ఞాన తేజంబు వెడలె నక్కాన నుండి. 23

## వారణాసీ ప్రయాణము

చిర కాలాన్వేషణలో
పరిపూర్ణుండైన బుద్ధ భగవానుడు భా
సుర ధర్మచక్ర తేజము
బరప వారణాసి పురికి పయనంబయ్యెన్. 24

ఆనందం బత్యంత స
దానందుండగుచు కొలువ ననుపమ నిర్వా
ణానంద రాజ్య రమతో
బూనెన్ నవ ధర్మమార్గమును వెలయించన్. 25

వారరుగు దారిలో గల
క్రూరమృగావళి స్వభావ గుణ గణములనే
జారవిడచి సత్వమ్మును
నేరుచు కొన దొడగె సుగతునిం గని నంతన్. 26

పులులు మేకలట్లు తొలగి స్వాగతమీయ
కరులు మోకరిల్లి గౌరవించ
సాధు క్రూర జాతి భేదమేః కన రాని
దయ్యె ప్రభువు చనిన యంతమేర. 27

సుగతు డరుగు చుండ చోద్యమ్ముగా మింట
పక్షి వితతి నీడ పట్టు కొఱకు
పక్షములను విప్పి పయనించె వెనువెంట
స్వామి మీద నున్న ప్రేమవలన. 28

పథ పరిశ్రమంబు వాయుట కందందు
స్వామి విశ్రమించు సమయమునను
భూరుహములు కదలి పుష్పాక్షతలు పోయు
తలిరు తీవలూగి తనియజేయు. 29

ప్రభువు తిమిరమందు పయనము సేయుచో
ఫణులు తమ ఫణాగ్ర మణులకాంతు
లెసగ ఫణములెత్తి యేతెంచ దొడగెను.
స్వామి మీది భక్తి చౌకళించ. 30

## మృగదావనము

వారణాసీ సమీప కాంతార భూమి
నలరు మృగదావనాఖ్య ఋష్యాశ్రమంబు
అందు వసియించియుండ్రు మహాత్ములైన
పరమ మౌనులు తమ కుటుంబముతోడ. 31

సహజ సద్భక్తి యుక్త సుజాత యిడిన
పాయసము స్వీకరించిన భ్రష్టుడనుచు
జినుని విడనాడి వచ్చిన మునులు యేవు
రందు వసియించి యుండిరి ముందువచ్చి. 32

గౌతముండు తిండి కక్కుర్తి కలవాడు
నిష్ఠ లేనివాడు నీతిహీను
డనుచు పెక్కు మాట లల్లి యవ్వని నున్న
వారు నమ్మ బలికి వారు వారు. 33

మృగదావనమ్ములో మెలగు బ్రాహ్మణు లెల్ల
గౌతముండొకవేళ కడగియిటకు
చనుదెంచినను కూడ చనువీయ రాదని
నిర్ణయం బొనరించి దుర్ణయముగ
తల పోయు చుండిరి దశబలుండొకనాడు
ఆనందునిం గూడి యరుగు దేర
తరణి పశ్చిమగిరి దాట చీకటి యందు
ముని పల్లె నడుగిడ కనిన మునులు

పల్లె కొక ప్రక్కగామన్న పర్ణశాల
చూపి యందుండు డీరేయి రేపు కలసి
మాట లాడుద మనుట యు మారజిత్తు
శిష్యునిం గూడి యందు వసించెరేయి. 34

విరివిగా నున్న మూషక వితతి నెల్ల
తృప్తిగా తిని స్వేచ్ఛగా తిరుగునొక్క
కాలసర్పము ఆపర్ణ శాల నుండు
చెరిగి మునివరు లెవ్వరా దరికి చనరు. 35

జాతి గౌరవ మెంచని పాతకుండు
భ్రష్టముని గౌతముండిటు వచ్చె నేని
యీ కుటీరమ్ములో వసియించ జేయ
వలయు, తృటిలోన మన పీడ వదలి పోవు. 36

అని; తమలో దామెంచిన
మునిగణ మారేయి గడపి మును కొను వేడ్కన్
పనివడి వేకువ జామున
చనుదెంచిరి శాక్యమౌని జాడ లెరుంగన్. 37

తప్త కాంచన సందీప్త తనుడు జినుడు
స్తిమిత పద్మాసనస్థుడై దివ్య ధర్మ
చక్ర దీధితు లలర శీర్షమ్ము నందు
ధ్యాన నిష్ఠాగరిష్ఠుడై తనటు చుండె. 38

భోగమును చుట్టుకొని పెద్ద నాగు బాము
ప్రభువు పాదాబ్జముల చెంత పవ్వళించి
చూచునేకాని యిటు నటు రాచు కొనుచు
పరువు లెత్తెడు యెలుకల పట్టి తినదు. 39

క్రూర వ్యాళము బుద్ధుని
చేరువ క్రూరత్వముడిగి చెలగుట గనియా
పాములు తమ క్రూరత్వము
పార విడిచి పడిరి జినుని పాదముల పయిన్. 40

స్వామి నిర్మల శాంత తేజము విషమును
సార సుధ జేసివేయగా జాలె నన్న
పాప భీతి దొరంగిన తాపసాళి
హృదయ ముల మార్చివేయుట కెంత పట్టు ? 41

పూర్వ శిష్యులు పాదముల వ్రాల బుద్ధుడు
సాదర దృష్టితో భేదముడిగి
లెండు నాయన లార రండు నిశ్చింతతో
భవ బంధనము లెల్ల వదలిపోవు
నవ ధర్మ పథములో రవ లేక పయనించ
నిర్వాణ కాంతమీ నికట మునకు
వచ్చి స్వాగత మిచ్చి వరియించు నిస్సంశ
యమ్ము నియ్యది మదీయాను భవము

శమ దమాది నియమ సంపదతో
దుఃఖములను కూర్చు దొడగు తృష్ణ
నంత రించ జేసి యష్ట మార్గము నూన
భువన మెల్ల స్వర్గ భూమి కాదె ? 42

లోక మావల కాదు యీలోకమందు
స్వర్గ నరకంబులుండె నిస్సంశయముగ
సత్యము నహింసతో భుజస్కంధమందు
నిలుప స్వర్గంబుగా మహీ వలయమగును. 43

అని సర్వజ్ఞుండాడిన
అనునయ సూక్తులకు కలత లణగిన వారై
ముని గణము శాక్యసింహుని
అనుయాయులరై చెలంగి రద్భుత రీతిన్. 44

అచటి నుండి సుగతుడా రాడకాముని
యునికి నడుగ వినిచె మునిగణమ్ము.
"స్వామి యతడు స్వర్గ ధామంబు చేరెను
లేదు రుద్రకుండు కూడ భువిని." 45

వారణాసి చేరుట

ప్రభువు మృగదా వనంబును వదలి మౌని
గణము సమ్రమతతో వెంట కదలి రాగ
వారణాసీ పురంబును చేరుకొనెను
ధర్మ చక్రము త్రిప్ప నుత్కంఠతోడ 46

విశ్వ వినుత వేద వేదాంగ విదులైన
పండి తాళి కాట పట్టుచుంచు
యుగ యుగాల నుండి జగతీ తలమ్ములో
పేరు వడసి నట్టి వారణాసి 47

చేరిన శాక్యసింహుని యశేష మనీష వచస్స్రవంతిలో
తీరము చేర యీదగల ధీరుడొకండును కానరాడు దు
ర్వార భవాబ్ధి దాట ననపాయతతో నవ ధర్మమార్గమే
మీరుచు వేదవాదులగ మించుచు లోగొనె వారి చిత్తముల్. 48

తరుగని దుఃఖవార్నిధిని దాటు తలంపున వారణాసి యం
దరువది మంది పండితుల హర్పతి తేజులు బుద్ధ దేవునిన్
శరణము జొచ్చినారు విలసద్యశుడైన కుమార కాశ్యపుం
డసుతర భక్తితో సుగతు నాయ్యనఁగొల్చి తరించె నెంతయున్. 49

మాననీయుడైన మౌద్గల్యు డరుదెంచి
బుద్ధదేవు శరణు బొందినాడు
నిర్వికారమైన నిర్వాణ పథములో
భవలతా శినుండి బయలు పడగ 50

## ధర్మ దీక్షా ప్రధానము

వరదుడు జాతి భేద పరివర్జితు డవ్యయ దుఃఖవార్ధి సం
తరణకు ధర్మచక్రమును దాల్చి జయించెడు లోకజిత్తు మే
దుర కరుణాంతరంగుడు బుధుల్ వినుతించెడు భవ్యమూర్తి భా
సుర నవ ధర్మచక్రమును జూపుచు దీక్షలొసంగె వారికిన్. 51

"బౌద్ధ దీక్షాపేక్ష పరులెల్ల ముందుగా
తమకున్న విభవ మంతయును దాన
మొనరించి కేశముండనము గావించుక
ధర్మ దీక్షాపాత్ర దాల్చి మదిని

దుఃఖ సందోహమ్ము తొలగి పోవగ తృష్ణ
నరి కట్టి యష్ట మార్గావలంబ
నము పూని భూశయ నమ్మొన రించుచు
రేల నిర్జన వని గ్రాలి పగలు

తిరిపె మొనరించి యొకపూట తినుచు సతము
త్యాగ నిష్ఠా గరిష్ఠులై తనరు చుండి
సాటి ప్రాణుల కాపాడు సమయ మందు
దేహ మర్పించుటకు వెను తీయరాదు. 52

తకున భిక్షవేయు తరుణి కురూపియో
రూప వతియొ యన్న చూపు మాని
యే పదార్థ మిడిన నేహ్య భావము లేక
పంచ భక్ష్యములుగ నెంచవలయు. 53

సింహమైనను యొక చలిచీమ యైన
భోగి నైనను యొక కుష్ఠురోగి యైన
శ్రేని నైనను పరమ దరిద్రు నైన
నేక భావంబుతో చూచి సాకవలయు. 54

శాంత్యహింసా ధర్మసంరక్షణంబులే
సత మాత్మ దేహ రక్షణము లనుచు
నిరుప మానంబైన నిస్వార్థ సేవయే
పృథివిలో తమ నవ నిధులటంచు

దాన దయామయ జ్ఞాన సమృద్ధియే
తమ యాత్మ బంధు సంతతియటంచు
దీన జనావన దీక్షావిధానమే
ధరణిపై విధ్యుక్త ధర్మమనుచు

నాత్మ నెంచి జీవితాంతమ్ము వరకును
స్వర్గ మవని మొలుక జాలినట్లు
సర్వ భూతవిహిత సౌజన్య సౌహార్ద్ర
ములను వృద్ధి చేసి మెలగ వలయు." 55

అను భగవానుని బోధను
మనమున వాక్కాయ ములను మహనీయముగా
కొన సాగించుచు భిక్షుక
జన మయ్యెడ పూనె దీనజన సంసేవన్. 56

బుద్ధుడే మాకు శరణంబు పుడమినింక
ధర్మమేమాకు శరణంబు ధరణినింక
సంఘమే మాకు శరణంబు జగతినింక
ననుచు స్మరియించు చుందురు రాత్మలందు, 57

వజ్ర సన్నిభ చిత్తులై వరలినట్టి
భిక్షువుల సేవురేవుర వేరుచేసి
దేశ దేశాంత రమ్ములు తిరిగి ధర్మ
చక్రమును త్రిప్పగా బంపె శాక్యమౌని. 58

వారలక్ష్యంత దీక్ష నూరూరు తిరిగి
చేయు చున్నట్టి నిస్స్వార్థ సేవగాంచి
శిలలు ద్రవియించె మోడులు చిగురుపట్టె
వెండమావులలో నీర ముండదొడగె. 59

భువన సన్నుత కాశ్మీర భూమినుండి
అజితముని వచ్చి సర్వజ్ఞు నాశ్రయించి
పెన్నిధిని గొన్నయొక నిరుపేదవోలె
ధర్మ దీక్షను గైకొని ధన్యుడయ్యె. 60

వారణాసిని యశుడను వైశ్య వరుడు
భోగ భాగ్యాలతో తుల తూగువాడు
బుద్ధదేవుని నిర్వాణ బోధ నెరిగి
ముగ్ధుడైవచ్చి ప్రభు పాదములను వ్రాలె. 61

స్వామి వణిజుని కరుణించి శాంతపరచి
ధర్మ దీక్ష నొసంగిన దవిలి వాని
బంధు మిత్రులు సమ్మోద భరితు లగుచు
వచ్చి చొచ్చిరి నిర్వాణ పథమునందు. 62

నాడు నాటికి సుగతుని నవపథమ్ము
మూడు పూలారు కాయలై మున్మరిలుచు
మీఱ జొచ్చెను భయద సంసారజలధి
దాట గోరెడు వారిని తనివి పరచి. 63

ప్రముఖ విలాసవంతులు నృపాలతనూభవు లెందరెందరో
క్రమముగ వచ్చి శాక్యముని క్షమవచో విభవాను భూతిలో
తమతమ రాజ్యభోగముల దద్దయు రోసి నవీనమోక్ష మా
ర్గమున చరించజొచ్చిరి యఖండ దయానిధి పాద సన్నిధిన్. 64

ప్రభువు పదపడి యూరు బిల్వమును చేరి
తాము ముందుగ ధర్మపథమ్ము గనిన
బోధి తరుమూలమున ప్రౌద్ధు పుచ్చుచుండి
పావనుల జేసె నాజాన పదుల మగుడ. 65

హరి జనులను గిరి జనులను
తరతమ భేదంబు లేక దయనీయముగా
దరిజేర నాదరించుచు
పరమ పథము నందుచిలిపె భగవానుడటన్. 66

బింబిసారుఁడు

అతి లోకోత్తర ధర్మము
క్షితి వలయమునందు వరల జేయుట కొఱకై
కతిపయ వాసరముల కా
దృతితో సుగతుండు మగధ దేశము చేరెన్. 67

మగధ భూమికి మకుటాయ మాన మైన
రాజగృహ పట్టణంబు చేరగను బింబి
సారు డత్యంత భక్తి ద్వైవార శాక్య
ముని కొసంగెను తన వేణు వనము నెల్ల. 68

ఆ నర నాథుడు బుద్ధుని
దీనుని గతి శరణుఁబొంది దీక్షంగొని స
న్మానించె బౌద్ధసంఘ ము
నూన గతిన్ దనియగా మహోత్సాహముతో. 69

భూనుత కీర్తి గౌతముఁ డపూర్వ విధంబున బింబిసార భూ
జానికి దీక్షనీయ నరుఁసమ్మున రాజకులైక భూషణుల్
మానవ జాతిలో త్రిదశ మాన్యత బొంపిరి వోవజేయగా
పూనిరి ధర్మచక్రమును పూని నిరంతర దీక్ష పెంపునన్. 70

వేణు వనాంతరమ్మున పవిత్ర చరిత్రుడు శాక్యమౌని ప్ర
జ్ఞానయ శీలవంతుల నఖండశుభాత్ములు నైన శిష్యులన్
దీనుల దీర్ఘరోగుల విదీర్ణ చరిత్రుల దిర్చి దిద్ది ని
ర్వాణ పథమ్మునన్ నిలిపి రాజిల జేయగ పంపునిత్యమున్. 71

అసి ధారా వ్రత నిష్ఠులు
పసజెడి దిగజారిపోని ప్రజ్ఞాన్వితులై
వసుధగల దీనకోటిని
విసువక సేవింత్రు వారవేలా ధృతితోన్. 72

భగవానుని సందేశము
మగధ దేశ మెల్లయెడల మహనీయముగా
నెగడుతరి 'సారిపుత్రుడు'
సుగతుని శరణంబు జొచ్చె సుస్థిర భక్తిన్. 73

కనుల కగుపించు దుఃఖసంఘటన మూలకు
హేతువును గాంచి దరిజేర్చు హేతువాద
మవ్యయానంద మైయుండు టరసి వచ్చి
స్వీయ శిష్య గణమ్ముతో చేరె జినుని. 74

ప్రాజ్య సామ్రాజ్యమే తృణప్రాయముగ త్య
జించి విశ్వకళ్యాణ పథము శోధించి తెచ్చి
జీవకోటికి చూపిన జినుని వలన
పూత మయ్యెను మగధుని భూమియెల్ల. 75

### అంగుళీమాలుడు

రాజ కుమారుల పండితు
రాజులనే కాక ధర్మరాజ య్యెడ స
వ్యాజప్రేమను చోరుల
నైజములను మార్చినడపె నవ మార్గమునన్. 76

ఘోర వనాంతరమ్ములను గుట్టుగ డాగుచు నూకదంపుగా
దారులు కొట్టి వర్తకుల ద్రవ్యము దోచి యెదిర్చినట్టి బల్
వీరుల హస్తముల్ దునిమి వేయుచు నుండెను చోరు డంగుళీ
మాలుడు వాని పట్టుగల మానవుడే కనరాడు ధారుణిన్. 77

శాలియా గ్రామభూములఁ గ్రాలు వాని
బీర మణచగ వెడలిన శూరులెల్ల
చేతి వ్రేళ్ళను గోల్పోయి జీవితమును
భగ్న మొనరించు కొనిన దౌర్భాగ్యులైరి. 78

వాని నరికట్ట దలచి భూజాని చాల
యత్నమొనరించి విఫలప్రయత్నుండైన
శాక్యసింహుడు పాదసంచారి యగుచు
నరిగి చేరెను వాని గృహాంగణమును 79

వచ్చి సుగతుడింటి వాకిట నిలువగా
చూచి చోరుడెదను చోద్యమంది
మదిని పొడము వెరగు విదితము కానీక
పలికె నిట్టు లశని పాతముట్లు. 80

"ఓరి యెవడ నీవు ధారుణిపై నీకు
బ్రతుకు మీది తీపి వదలెనొక్కొ ?
నాగృహంబు మెట్టి నట్టి నరుడెవండు
క్షితితలంబునందు బ్రతికిలేడు." 81

నుత మనోహర హాసరంజిత ముఖుండు
సురుచిరాదర్శ వాక్య సంశోభితుండు
బుద్ధదేవుడు వాని సంబోధనమున
కాత్మ రోయక యిట్లనె; నాదరమున. 82

"అన్న! నామేను పరుల సహాయమునకు
వేచి యుండును సర్వదా విశ్వమందు
నీవు నామేను గైకొని నీకు వలయు
తీరుగా జేసుకొనుము చింతిలను నేను. 83

పలువు రనుపట్టి పీడించు బ్రతుకుకంటె
ఒకని సుఖపెట్టుటకు ప్రాణమొడ్డుటొప్పు
కాన సందేహ పడకనా ప్రాణములను
తీసుకొని కోరినట్లుగా చేసుకొనుము." 84

బుద్ధదేవుని మధుర సంబోధనమ్ము
త్యాగ నిరతిని ధర్శించి తస్కరుండు
ఘోర దౌష్ట్యార్ణవమ్ములో బారయాత
నీదు తనచెయిద ములనెంచి ఖేదమొంది. 85

బిలబిల కన్నుల నీరము
తిరుగగ దురపిల్లి బుద్ధదేవుని చరణాం
బురహముల శరణు వేడిన
కరుణానిలయుండు వాని కౌగిట జేర్చెన్. 86

ఆ దినమ్మునుండి యంగుళీమాలుడు
బుద్ధదేవు పాద భూ రజంబు
మౌళిదాల్చి క్రూర మార్గము విడనాడి
భూతకోటి సేవ పూని చేసె. 87

కిరాతుడు

భగవాను డొంటిగా పయనించు చొకమారు
సాంద్రాటవుల మధ్య సాగు చుండ
పాపాత్ము డొక బోయ పన్నిన యుచ్చులో

చిక్కిన లేడి దుస్థితిని గాంచి
ద్రవియించి మిగుల చిత్తంబు త్తలము నంద
దాని యాపద బాప పూనివేగ
చేరి యుచ్చును బాపి జింకను రక్షించి
స్థిమిత పద్మాసన స్థితి వహించి
యుండ నా బోయవాడు మహోగ్రు డగుచు
వలను చిక్కిన జింకను వదలి పెట్టి
కొంగ జపమూను నౌర యీ దొంగ తపసి
యనుచు నొక చెట్టుపై నుండి యరచి దిగెను. 88

కరవాలము ఝుళిపించుచు
తరు మూలము నందు వెలయు తపసి శిరమ్మున్
తరిగెద నని నిందించుచు
బరతెంచె పరేతరాజ భటుడో యనగన్. 89

వాడి కత్తి నెత్తి వచ్చు కిరాతుని
జాడ యెరిగి కూడ శాక్యమౌని
మధుర మంద హాస వదనార విందుడై
వరలు టరసి బోయ కరగిపోయె. 90

పాదాబ్జంబులపై బడి
మోదుకొని శిరమ్ము నాదు మూర్ఖత్వమ్మున్
పోదోల వనికి వచ్చితి
వో దేవా కావవే మహోన్నత కరుణన్. 91

అనుచు పాద యుగళి నంటి యున్నకిరాతు
కనికరించి లేపి గౌతముండు
ధర్మ దీక్షనొసగి తనశిష్య కోటిలో
చేర్చు కొనెను సుప్ర సిద్ధముగను. 91

## భారద్వాజుఁడు

సారిపుత్రాది శిష్య సంచయము తోడ
బుద్ధదేవుడు జనపదమ్ములను తిరిగి
ధర్మ చక్రము త్రిప్పెడు తరుణ మందు
జరిగె చిత్రిమ్ముగా నొక్క సంఘటనము. 93

ఒక్క కొండచరియ మున్నట్టి పల్లెలో
కాపురంబు సేయు కర్షకుండు
ఒడలువంచి సతము పుడమిని సేవించు
సౌమ్య శీలి చాల శ్రమిక జీవి. 94

భారద్వాజుండను బడు
నా రైతు మహోను భావుడగు బుద్ధునకున్
కోరి యొక విందు చేసెను
క్షీరాన్న ఘృతాలతో నశేషోన్నతిగా. 95

విందు కుడిచి ప్రభువు విశ్రమించగ రైతు
పలికె నిట్లువినయ బంధురముగ
"స్వామి యిట్లు విపిన సంచారముల తోడ
బ్రతుకు టరయ దుస్తరమ్ముకాదె ? 96

నాకు వోలె కొంత నాణ్యమౌ మాగాణి
దున్నుకొనుచు నిచట నున్న లెస్స
బ్రతుక వచ్చు,,ననిన భగవానుడాతని
వెన్ను నిమిరి సుప్రసన్ను డగుచు. 97

"అన్న నేను చేయుచున్నది సేద్యమే"
యనిన నతడు "స్వామి యట్లు లైన
మీ పొలంబులెచట మీ యెద్దులెట్టివి
పంట యేమి పండె పాడికలదె"? 98

అకుటి లాత్మ డిట్టు లడుగ బుద్ధుడు వాని
యంత ప్రశ్నలకును సంతసించి
'వినుము ధర్మశాస్త్ర మను భూమి దున్నుదు
కర్మమే హలంబు తలుపమాకు. 99

నిరత ప్రయత్నమే నే మేపు వృషభముల్
చక్కని డెందమే ముక్కుత్రాడు
సత్యమే ములుకఱ్ఱ సత్కార్యమే వర్ష
ధారయై నాచేను తడుపుచుండు
మోహ మదాదులు మొలచిన కలుపుగా
వెనువెంటనే తీసి వేయుచుందు
పదపడి లెస్సగా యెదిగిన నాపైరు
పంటయే నిర్వాణ పథము దాని

రుచి నెరింగిన వారలీ లోకమందు
అన్య సేద్యము నాశించరని" వచించు
బుద్ధ దేవుని నిర్వాణ బోధ నెరిగి
దాసుడై మించె నా భరద్వాజుడందె. 100

## సుదాముడు

భగవానుండగు బుద్ధుం
డగణిత నిర్వాణ వేది యై వేణు వనిన్
నెగడుతరి రాజగృహమున
జగతీ స్తవనీయ మైన సంగతి జరిగెన్. 101

శ్రీ మంతుల కనువగు సుమ
దామమ్ముల కట్టియమ్మి తద్విత్తముతో
నేమమున బ్రతుకు చుండు సు
దాముం డను తోటమాలి తత్పురి నెవుడున్. 102

మార్గశిర మాస మవలే సుమాలు కఱవు
దానికిని తోడు పెద్ద తుపాను వీచి
పాప మాతని పూదోట రూప మాప
పొట్ట గడువక యల్లాడి పోయె చాల. 103

కొన్నినాళ్ళట్టు లిడుములు కుడిచి యతడు
కాన వచ్చిన వికసిత కమలమంది
వేకువను లేచి దానిని విక్రయించ
కోసి తెచ్చెను పూదోట కొలను నుండి. 104

బుద్ధదేవుని దర్శించ బోవునట్టి
పథికు లనయమ్ము చను చతుష్పథము నందు
అమ్మకమునకు తెచ్చిన తమ్మి కనిన
విత్తవంతుడు సుమ మెంత వెల యనంగ 105

మాష హేమ మనుచు తోటమాలి పలుకు
నంతలో జేరి భూనేత సంతసమున
మాసముల రెంటి నిత్తు నిమ్మనిన మొదటి
పథికు డంతకు రెట్టింపు పలుకుటయును. 106

భూ రమణుండును పథికుడు
సారస మూల్యమ్ము పెంచ క్షణకాలములో
నూరులు వేలై లక్షల
జేర సుదాముండు మదిని చింతనజేసెన్. 107

వీరు తమ్మికొఱకు వేలు లక్షలు కోట్లు
పోయు చున్నవారు పూవుకొఱకు
తలచి చూడ ధనము తెలిదమ్మి కన్నను
విలువ లేని దగుట వింతకాదె ? 108

పూవు కొఱకొసంగ బోవునింతధనమ్ము
బుద్ధదేవుడేల పుచ్చుకొనడు
పుచ్చుకొనిన వీరలిచ్చి యేయుందురు
తమ్మి కొఱకు తత్తరమ్ము నడరు. 109

ఇంత ధనముకన్న నీతమ్మిపూవీయ
బుద్ధదేవు డెంత పొంగి పోవు
కాన ప్రభువు కేనె కంజము నర్పించ
ధన్యమగును జీవితమ్మ టంచు 110

తలఁపోసి నెమ్మనమ్మున
కలితాత్ముఁడు తోటమాలి కమలము సమ్మన్
దలఁపడిగి స్వామి కీయ న
లలితముగా నిర్ణయించి రాజిత భక్తిన్. 111

బాబు దయవహించి వదలుఁడీ బేరము
అమ్మఁజాల నేను తమ్మినిప్పు
డని వచించి వేణు వనమార్గమును బట్టి
పరుఁగు తీసె మోద భరితుడగుచు. 112

వేణువనమున నశ్వత్థ వృక్షమూల
మున వినిర్లిప్త మౌనముద్రను చెలంగు
భువన శాంతైక మూర్తి నెమ్మోము వెలుఁగు
వెన్నెలలు కాంచి పులకించి విస్తుపోయె. 113

తన దరిద్రత వెడలించ దగిన యట్టి
తమ్మి పూవును హృదయ పద్మమ్ము తోడ
ప్రభువు కర్పించి ధారుణీ వలయ మంతు
తరుఁగు నెరుఁగని మోక్ష విత్తము గడించె. 114

---

మాషము (అనగా) అయిదుగురి వెందపూసలయెత్తు బంగారము.

స్వామి కారుణ్య రస సుప్రసాదమునను
ధన్యుడైన సుదాము నుదంత మెఱిగి
క్ష్మాత లేంద్రుడు మోదభాష్పములు విడిచె
బాట సారియు సమ్మోద భరితు డయ్యె. 115

ఆ రీతి నెందఱెందఱొ
భూ రమణులు పేదవారు మూర్ఖులు చోరుల్
ధీరులు బుద్ధప్రభు పద
నీరేజము లాశ్రయించి నెగడిరి జగతిన్. 116

మగధ సామ్రాజ్య జనుల నిమ్మాదిగా తనియ
జేసి నంతట పదపడి శ్రీఘనుండు
జన్మభూమిని గనుకోర్కె చౌకళింప
కపిలవస్తును జేర్చు మార్గమును బట్టె. 117



# బుద్ధపురాణము.

## సుందరీ నంద పర్వము

### జన్మభూమి సందర్శనము

వేలాది శిష్యసంఘము
వేలముగా గొలువ జినుడు విస్తృత విజయ
శ్రీలగొని ముక్తి కాంతా
లాలసుడై యున్న తండ్రి రాజ్యము చేరెన్. 1

భద్రచారిత్రుడౌ రుద్రక పండితున్
దర్శించి యుండిన తావు నందు
ధీర వందితుడైన ఆరాడ కాముని
సేవించి యుండిన క్షేత్రమందు
రౌవతు నాశ్రమారణ్య భూమిని శాక్య
పద్మలు నివసించు పల్లెయందు
అనమా నదీ తీరమున రసాల వనాన
ఛన్నుని వీడ్కొన్న స్థలము నందు

విడిచి విశ్రాంతి కొలుతు, సేవించ వచ్చు
సర్వ జనులకు నిర్వాణ సదన మార్గ
మెరుగ జెప్పుచు నిఃఖేద పరుల జేసి
కపిల వస్తు పురంబు చెంగటికి చేర. 2

తన కొడుకు ఘోర తపమున
జనతా దుఃఖమును బాప జాలిన మార్గం
బును తెలిపి యెల్ల వారిని
దని యుంచుట వినిన శాక్య ధరణీ శుడాగిన్. 3

పుర బాహ్యమ్మున స్వాగతమ్ము నిడ సమ్మోదంబుతో నెందఱో
నర నారుల్ వెనువెంట రాగ సుగతున్మర్యాద గావించి, బం
ధుర ప్రేమాతిశయమ్ముతోడ ప్రియ పుత్రుం డెల్ల మర్త్యాళి కా
దరణీయంబగు మోక్షమార్గమును నిశ్శంకన్ ప్రబోధించినన్. 4

తన కుమారుడు యింత ఘనుఁడయ్యె నా యని
మోదించె నాత్మ శుద్ధోదనుండు
తన భర్త మోక్షసంధానంబు నెరిగింప
విని యశోధర పొంగె మనము నందు
తమ సంగడీడు ఖేదమహాబ్ధి దాటించె
ననుచు మోదించినా రనుగు చెలులు
తమతేడు తెలుపు మార్గము ముక్తి నిడునని
సేవించగ దగి రాశ్రిత గణంబు

తమకు తమకున్న పూర్వ బాంధవ్య మెదల
కదలి పులకింపజేయు శ్రీఘనుని మోక్ష
సూత్రముల నెల్ల తమ శిరస్సులను దాల్చి
శరణు జొచ్చిరి సుగతుని చరణములకు. 5

తన తండ్రి భార్య బంధువు
లను మమకారంబు హృదయ మందుంచని శ్రీ
ఘను డంటరి కొకరీతిని
వినిచెను నిర్వాణ పథము విశ్రుత ఫణితిన్. 6

మా వాడని మీ వాడని
భావింపుట లెల్ల జనుల భావన గానీ
యేవిధమగు భేదమ్ము నకు
తావిచ్చి యెరుంగ డాతథాగతు డెదలోన్. 7

పురమున కొకింత దవ్వుగ
విరిసిన న్యగ్రోధ వనిని విడిసిన జిను డా
దరణీయ భవ దుఃఖార్తుల
కరుణించు చనూన మోక్ష గతి నెరిగించున్. 8

మాఘమాసంబులో మింట మాన్య లీల
బారులై పోగు తీర్థపు పక్షులట్లు
బుద్ధదేవుని నిర్వాణ బోధవినగ
చేరుచున్నారు తద్వన సీమ జనులు. 9

దశబలుండందు సుప్రభాతమ్ము మొదలు
ధ్యాన నిష్ఠా గరిష్ఠుడై తనరు చుండి
కుతప కాలాన తిరిపెము కొఱకు నగరు
చేరి భైక్షంబు కొనును విశిష్టలీల. 10

ప్రభువు చనుదెంచు వేళకు ప్రతి గృహాంగ
ణమున నాబాల వృద్ధు లనంతభక్తి
తత్పరత తోడ స్వామి సందర్శనంబు
చేసుకొన వేచి యుందుర శేష దీక్ష. 11

గేస్తు రాండ్రెల్ల బంగారు గిన్నెలందు
ఫల రసాన్నాదు లెన్నియో వదిలపరచి
ప్రభు కరాంకిత మృత్తికా పాత్రలోన
నునిచి తరియించు చుండెద రనుదినంబు. 12

స్వామి పురవీధి వల్లన సాగుచుండ
కాలు వచ్చిన చిన్నారి బాలురెల్ల
మోదమునవచ్చి పరితు పాదములకు మ్రొక్క
చుట్టు ముట్టగ సుగతుడు చోద్యముగను. 13

శీత కరు కిరణ సన్నిభ
మౌ తన కరకమల మెత్తి యాబుడుతల తో
మీ తలిదండ్రుల నెపుడీ
రీతిని పూజించచో తరింతురు జగతిన్. 14

కల్లి లాడవద్దు కలనైన నొరులను
దూర వద్దు చెడ్డత్రోవ నడుగు
పెట్టవద్దు పరుల ప్రేమించి వారల
ప్రేమ చూర గొనుడు బిడ్డలార. 15

మీకు కలిగినంత మేలెంచి యొరులకు
పెట్టి సాకటొప్పు ప్రీతితోడ
ప్రాణి హింస చేయ పాడిగా దెప్పుడు
పూని దీని మరువ బోకు డెదను. 16

చీమ నైనను త్రొక్కి హింసించ రాదు
శునక మార్జాల ములమోద జనదెపుడును
ప్రాణు లన్నియు మనకు సమానమనుచు
తలచుడని బోధసేయు తథాగతుండు. 17

బుద్ధ బోధామృతమ్ము నేప్రొద్దు గ్రోలి
బుదుత లారీతి వర్తింప బూనినారు
అనుగు బిడ్డలలో మార్పు కనిన తల్లి
దంద్రులానంద వసధిలో తనరినారు. 18

వృద్ధ భూపతి తనయుని విపుల ధర్మ
సరణి నంతయు మది పునశ్చరణ జేసి
తనయుడని యెంచు టుడిగి సత్యముగ విష్ణు
మూర్తి యవతార మనియెంచి మ్రొక్కదొడగె. 19

రాజు పరివర్తనంబుతో రాజనగరి
పరిజనం బెల్ల సందేహ పడక జినుని
పరమ పురుషుని గానెంచి భక్తితోడ
పూజ సేయగ గడంగిరే ప్రొద్దుచేరి. 20

సుతచిరాంగి యశోధరా పరమసాధ్వి
ప్రాణనాథుని విష్ణ సంభవుని గాగ
మాన నంబున నెంచి నిర్వాణ పథము
నందు పదమూని సంతతా నందమయ్యె. 21

ప్రభు పదాంకిత హృదయ సారసము నందు
ధ్యాన మకరంద మేసింది తనరుచుండ
తన నికేతనమున దీన జనవితాన
మునకు విందులు గావించు ననుదినంబు. 22

కాలువు ధరించి వైరాగ్య భావజలధి
మునిగి తేలుచు నేకైక పుత్రుడైన
రాహులుని జీరి తండ్రి వర్తనము తెలిపి
పంపె సేవించ న్యగ్రోధ వనమునకును 23

రాహులు డేగుదేర ననురాగ భరంబున లోగిపుత్రుడన్
మోహము తోడ యెత్తుకొని ముద్దిడి లాలనచేయుచున్న సం
దేహ మనస్కులౌచు గురుదేవుని సన్నిధినున్న శిష్యసం
దోహము చూచుచుండ సుగతుండ నురాగము చూపకింతయున్. 24

సారిపుత్రుని తనదరి జీరి వీని
తీసుకొనిపోయి సన్యాస దీక్ష నిమ్ము
టన్న నాతడు రాహులు నాదరమున
ముక్తి పథమున నిలిపె నాసక్తివెలయ. 25

## సుందరీనందుల ప్రణయము

శాక్యసింహుని నిర్వాణ సరణియందు
బాలు రబలలు వృద్ధులు పౌఢరాకు
మారు లాదిగ నెందఱో చేరి సకల
ప్రాణి కోటిని సేవించ బూనియుండ. 26

బుద్ధదేవుని సవతి తమ్ము డగునందు
డవిరళా నందకేళీ సుమాయుధుండు
తన మనోహారి యైన సుందరిని గూడి
భూతల స్వర్గ సుఖములు పొందుచుండె. 27

ప్రణయినీ వదన చుంబన పిపాసను సదా
పయనించు రాగ ప్రపంచమందు
సుదతి ధమ్మిల్ల సంపదను లెక్కించుచు
పూ మొగ్గలను రాసి పోయు చుండు
దేవేరి యధర సందేశము తలదాల్చి
మననంబు సేయును మనమునందు
కుసుమాంగి యనురాగ రసము దోసిళ్ళతో
క్రోలుచు నానంద సంకలితు డగుచు

తరుణి వాల్చూపు తూపుల తాకిడులకు
తట్టుకొన లేని హృదయ పద్మమ్ము నందు
దయిత కారుణ్య సూర్య సందర్శనమ్ము
పొంద యత్నించు చుండును నందు డెపుడు. 28

కుందకుట్మల రదన సంకుమద మొసర
దీర్చి దిద్దుకొనంగ నర్థించి స్వయము
నుంచుటద్దముకేల ధరించి నిలచి
పడతి సింగారమునకు తోడ్పడుధవుండు 37

వనిత చెక్కుట మకరి కా పత్రరచన
చేసుకొను చుండ మదనుని శితశరాళి
తాకిడిని సైపనేరక తలపులూర
మించు టద్దమునే విస్మరించి విడచు. 38

భామ సంపూర్ణ శృంగార భంగమునకు
క్రోధ ఘూర్ణిత నయనయై చీదరించ
తల్లడిలిపోయి దాపాను దాసు డగుచు
మించు టద్దమ్ము మగుడ ధరించి నిలచు. 39

కొమ్మ ధమ్మిల్లమును కూర్చు కొనిన పిదప
యెంచి కూర్చిన మాల నహీన మమత
తో స్వయమ్ముగ సరిదిద్ది తోయజాక్షి
కరుణ పొందుట కెంతయో కళవళించు. 40

బాహ్యలోకపు నడతనె ప్పగిది కూడ
నెరుగ కుండిన వారల చరితమెల్ల
ప్రాకె నల్లన న్యగ్రోధవని వసించు
బుద్ధ దేవుని పాదాబ్జముల వఱకును. 41

వారి విలాప వర్తన మవారిత మోహమునందు మాధురీ
ధారల దేలిపోవుట ముదంచిత రీతిని యాలకించి య
క్కారుణికాంతరంగుడు జగన్నుత మోక్షధనుండు బుద్ధుడే
చేరెను సోదరాంతిపురి చెచ్చెర భిక్షను స్వీకరించగన్ 42

నెట్టుకొనికాయు నెండలో పట్టపగలు
దేహళిని చేరి భిక్షాంపుదేహి యనుచు
నుచ్చరించిన జినుని మృదూక్తి వినెడు
వారు లేరైరి నందుని భవనమందు. 43

సుందరీనందు లానంద మందిరమున
లీల దళుకొత్త వాసంతకేళి దేలు
తరుణమున చెలులట నుపకరణములను
అందజేయుచు నుండిరి సందడిలుచు. 44

ఒకటి రెండుమారు లుచ్చైస్స్వరంబున
భిక్ష వేడి జినుడు వెడలుచుండ
నగరి నుండివచ్చు నళినాక్షి యొక్కతె
కాంచి లోనికేగి కళవళమున. 45

స్వామి వచ్చినేడు సౌధాంగణమ్ములో
పిలచి భిక్షకొఱకు పిలచి పిలచి
అనఘు పిలుపు లెవ్వరాలించ కుండిన
వెడలు చుండెననుచు విన్నవించె. 46

## పరితాపము

అసలూర కేళు వాసంత కేళిలో
బోటిమాట పిడుగుపాటు కాగ
నులుకు పడెను నందుడొయ్యాన సుందరి
తల్లడిల్లి చూచి తెల్లపోయె.

ఎంత పొరపాటు జరిగె వాసంతకేళి
మునిగి ప్రభురాక నెరుగక పోయినాము
ఇమ్మహా ఘోరతప్పిద మెవ్విధాన
సర్దుకొన గల ముదియెంత దుర్దినమ్ము.

అనుచు వాపోయి నందుడ త్యాదరమున
సం[illegible] వేగముగ జని సుగుణ రాశి
యైన అన్నను దోడ్తెచ్చి యర్ఘ్యపాద్య
విధుల పూజించి క్షమియించ వేడుకొందు.

నమ్మి నామాట యొక్కక్షణమ్ము నాకు
గడువొసంగుము సుగతు నిక్కడకు తెచ్చి
భిక్ష చేయించి వెడలిన తక్షణంబె
వచ్చి సేవించ గలనని పలుకుటయును.

తివిరి పాణిగ్రహణము నందినదిమొదలు
నాథు నెడబాసి యొక్కక్షణంబు కూడ
గడపి యెరుగని చిన్నారి కలికమదికి
ప్రియుని విన్నప మెంతయో భీతిగూర్చ.

తల్లడిలి పోయి యొక్కింత తడవు నోట
మాట లేకుండ చిత్రము మాడ్కి నిలచి
తడబడుచు పిద్దనిట్టూర్పు విడిచి ధవుని
యెదను తలజేర్చి సుందరి యిట్టులనియె. 52

"నామనోనాథ నినువిడనాడి క్షణము
సైపజాలను సుమ్ము నీ చరణమాన
నేమిచేయుదు దైవంబు స్వామికార్య
మనుచుచు విడదీయుచుండెను మనలనేడు.

నన్ను కరుణించి యొక్కక్షణమ్ములోన
స్వామి కనువగు మర్యాద నలిపిపంపి
మఱు నిమేషంబులో కంట బడక యున్న
బ్రతుకజాలను సుమ్ము నా ప్రాణనాథ 54

అనిన; సుందరి వదనాబ్జమున కొకింత
కాంతి పొడసూప చుంబించి కాంతు డనియె
పడతి పరిచుంబ నాంకము వాయకుండ
మగుడ సేవించ వత్తు నెమ్మోడ్కి నైన. 55

అనుచు నమ్మబలికి యతివను విడనాడ
లేక విడిచి బాహ్యలోకమందు
కాలుపెట్టె. మేడ గిడపదాటి కనంగ
దశబలుండు చాల దవ్వుసాగె. 56

ఎడబాటు

స్వామి సేవకొరకు పోగుచుండగ మేను
మనము సుదతిదలచి వెనుక కడుగ
పట్టె కాచబాట పారిజాత పరిమ
ళముల తోడ నందరాజు తుదకు 57

తడబడు నడుగులతో కడు
సుడివడు స్వాంతమున నందసుందరు డెంతో
తడవరిగి బుద్ధదేవుని
యడుగులు దర్శించగలిగె నాయాసముతోన్. 58

ప్రభువు వెన్నంటి చేరునప్పటికి నగరు
దాటిపోవగ నందసుందరుడు "స్వామి
వెనుకకేతెంచి భిక్ష సేవించి దయను
వెడల వేడెద నాదు తప్పిదము సైచి 59

అన్యకార్యాను రక్తులనగుట తమరు
విజయ మొనరించుటెరుగమి స్వజనమెల్ల
కుంది వందరుచున్నారు కోప పడక
వచ్చి దయతోడ దీవించ వలయు దేవ". 60

అనిన నందుని కోరిక విని సుగతుడు
మహిత హస్తాంగుళీ సంజ్ఞ మాత్రమున నె
నాటి కికభిక్ష నొల్లమి తేటపరచి
చన గడంగెను న్యగ్రోధ వనము దెసకు 61

ప్రభువుపై భక్తి ముందుకు లాగుచుండ
మగువపై ప్రేమ వెనుకకు మరలజేయ
ముందు వెనుకలు తిలకించు నందునిస్థితి
నాత్మ నూహించి శీఘ్రము డాగిపోయె. 62

హస్త సంజ్ఞను దరిజేర నాజ్ఞ చేయ
నడుగుదెంచిన నందుని కరములందు
భిక్షపుం బాత్రనిడి కనికరముతోడ
మరల సాగెను ముని యాశ్రమమ్ము చేర. 63

రత్న భూషణ కంకణ రాజితోడ
అందముల ప్రోవువలె నున్న నందరాజు
ఇష్టమున్నను లేకున్న కష్టపడుచు
పాత్ర చేబూని న్యగ్రోధ వనము చేరె. 64

ప్రభువటంగల వ్యక్తముం మనగలరు
విశ్వ కళ్యాణ నిర్వాణ వేదిమీద
నధివసించగ నందుఁ డత్యంతభక్తి
చేరి నిలిచెను పాత్రతో సిగ్గుపడుచు. 65

స్వామి నందుని హృదయ సంచలన మెరిగి
నిర్వికారముగా ముందు నిలిచియున్న
భ్రాత్రునకు చెప్పెనిట్లు వత్సా యితనిని
తీసుకొని వెళ్ళి నవధర్మ దీక్షనిమ్ము. 66

## ధర్మదీక్ష

శాక్యముని యానతిని శిరసావహించి
నంద రాజన్యు నవ్వియా నందుజేయ
తోడు కొనిపోయి శిష్యులెంతో ముదమున
దీక్షనిడు చుండ యానవ దీక్షితుండు. 67

వలదని చెప్పలేక తగు వాదనచేయగ నోరురాక ని
ర్దళిత శిరోజుఁడౌచు తనరాజు వచస్సులనే స్మరించుచున్
విలులిత నేత్రపద్మముల వెల్వడు నశ్రుకణాళి గుబ్బుఁగా
మలచు కొనంగ జొచ్చె నవ మార్గము పట్టెడు నందుఁడయ్యెడన్. 68

ఆయుత భోగవాంఛ హృదయాంతరవీధిని నాట్యమాడగా
మాయని బౌద్ధధర్మ మభిమానము నే సడలింపఁజేయఁగా
తీయని సూత్రపంక్తులు పదింబది పల్కఁగ జేయుచుండ పెన్
గోయిని బడ్డయేన్గు గతి క్రుంగెను నందుఁడు భిక్షుకాళిలోన్. 69

తాపులు చిమ్ము మేల్వలువ దాల్చిన యాసుకుమారు చేతనే
కావులు కట్టజేసి కుతుకంబున దీక్షనొసంగ భిక్షువుల్
శ్రీవిలసత్ప్రియామయ శరీరుడు గౌతముడేగుదెంచి వం
భావనజేసి దీవనలు పల్కెను సోదరు నాదరించుచున్. 70

## సుందరీ పరితాపము

నందుని స్థితి యిటులుండగ
సుందరి తన ప్రాణవిభుడు సోదర యుతుడై

మందిరమున కేతెంచు న
మంద గతినటంచు తలచె మానసవీథిన్. 71

దిటవుగానుండి కొంతసేపటికి భర్త
జాడ కనరామి నొక్కింత వంతయమ్మ
దిగులు పొడమగజేయ మందిరగవాక్ష
పక్షములు తీసి తిలకించె బాటవైపు. 72

మెలత వీక్షించి కనుచూపు మేరవఱకు
ప్రభువు జాడయు ప్రాణవల్లభుని జాడ
కానరాకున్కి సమ్మదగ్లాని యగుచు
కళవళము చెంది యనుగు చెచ్చెలిని పిలిచి. 73

స్వామి కాతిథ్య మిడగ మీ భూమిచేత
వెడలి తడవయ్యె నెటువైపు వెడలివారొ
తిరిగి రారయ్యె నామది దిగులు పొడమె
డిని సుహా య నుసుందరి కనియె చేటి. 74

మీఱు దిటవూను డమ్మ నిమేషమాత్ర
మునను నేనేగి లో దెత్తు భూమివిభుని
అని వచించుచు దాది వెయ్యంబు మీఱ
సాగిపోయెను యువరాజ చంద్రు కొఱకు. 75

అనుగు చెచ్చెలి ధవుని తోడ్కొని రయమున
వచ్చినంతనె ప్రియునితో మత్సరించి
పలుక కూడదు మిగుల చాపల్యమ్ము సేయు
కారణమ్మున నవియెంచు వారిజాక్షి.

విభుని గొనితేవ నేగిన వెలది కూడ
జాము గడువంగ వచ్చెడు జాడలేమి
ద్వారమున వేచియున్న సుందరి సుమాంగి
త్రొట్టుపాటున స్రుక్కుచు తూలిపోయె. 77

యేలికసాని దుర్దశల నేడ్తెరగాంచిన సేవకాంగనల్
జాలిని కుందియెత్తి విరజాజులు చల్లిన పూలసెజ్జపై
లీల పరుండ బెట్టి యను లేపనముల్ మెయినిండ బూయ న
వ్వేళ యొకింతసేపటికి విచ్చి కనుంగవన్ గాంచె నెల్లన్. 78

నాథుని జాడలేమి నట నాతికి మెత్తని పూలపానుపే
బాధను గూర్ప లేచి యెడబాటు సహించగ లేనిదౌట నం
బోధన చేయుచున్ వెదక బోయిన చేటియు కానరామి చే
నాథుని శాక్యమౌని కతినమ్ముగ నయ్యెడ నేమి చేసెనో. 79

కానిచో ప్రాణవిభుడొక గడియయైన
జాగు చేయునె? యనుకొను సమయమందు
నంద యువరాజు స్థితి విన్న నాతి వచ్చి
విన్నవించెను తావిన్న వింతలెల్ల. 80

ఘోర శరాళి డెందమున గుచ్చిన రీతి ప్రభూత మోహ శృం
గార నగాగ్రగామిని నగాధము లోనికి త్రోసినట్లుగా
వారి జనేత్ర సుందరి వివర్ణముఖంబున దుఃఖరాశిలో
కూరుకుపోయి బెగ్గడిలి కూలెను పాన్పున చాపచుట్టగా. 81

తెరవ కొండొక పడి మూర్ఛదేరి ప్రాణ
వల్లభుని దుస్థితి దలంచి తల్లడిల్లి
"కటకటా యెంత దురవస్థ కలిగె నాథ
కలుషమతి నైననా కర్మ వలననీకు. 82

పాలు పంచదార పోలికగా పూవు
తావి రీతి రెండుతనువు లొక్క
ప్రాణమె చెలఁగు వారల నీరీతి
వేరు చేయదగునె? కోరి మౌని. 83

కలసి యుండిన యీస్వల్ప కాలమందు
అరమరలు లేని కూరిమి నలరు నిన్ను
ప్రణయ కోపాన గికురించి బాధ పెట్టి
నట్టి నాకర్మ మీరీతి కట్టి కుడిపె. 84

స్వామి రాక నెరుగజాల కుండుట చేత
మ్రొక్కి కొలువలేక పోయి నాము
కాని; హీనభావ మేనాడు రవ్వంత
కలదె? ప్రభువుమీద తలప మనకు. 85

పరమ శాంతమూర్తి వరదయా గుణరాశి
బుద్ధదేవు డలుక బూను నొక్కొ?
పూనెనేని తగిన బుద్ధి చెప్పగవచ్చు
కాని యిట్టి తీరు కలదె భువిని" 86

అని తపియించుచు సుందరి
తన విభుని దలంచి శోకతప్తురాలై
మునుపటి వలపుల పోడుము
లను తలపగడంగె విభ్రమ లాలిత రీతిన్. 87

"ఎంత కఠినాత్మురాల నేకాంత కేళి
దేలు సమయాన నాపాద మూలమునను
మ్రొక్కగా జేసుకొన్నట్టి మూర్ఖురాల
నన్ను విడనాడ కుందువా నాథ:నీవు. 88

స్వామి కాఠిన్యమిచ్చి తక్షణము నీవు
తిరిగి వన్నెలు కొన నేగు దెంతువనుచు
నాత్మ నెంచితి నింత దుర్దాంత మైన
మార్పు వచ్చుట యెరుగ నెమ్మనమునందు. 89

పాపాత్ముల మే యగుచో
కోపించిన మౌని కొండ గుట్టల నెందో
వేపుట్టుదని శపించిన
నీపగిది వియోగమంది యెరుగము నాథా. 90

అని యా నందుని సుందరి
ఘన దుఃఖాంబుధిని మునుగగా కూర్మిచెలుల్
వినయముగ రెండు మెతుకులు
తినిపించిరి లేమ చేత ధీరోక్తులతోన్. 91

## భగవదుపదేశము.

సుందరి కథ యిటులుండగ
నందుండవ్వనము నందు నవభిక్షుఁడై
డెందమున శాంతి కానక
నందురుచు పతివియోగ వశమునచాలన్. 92

దృష్టిగోచర రమణీయ దృశ్యతతిని
సుందరీ మోహనాకార శోభతోడ
పోల్చుకొని నెమ్మనమున నాపోయిచాల
దిగులు నరుచు గడువఁజొచ్చె దినములాగిని. 93

సాటి భిక్షువులా తరు చ్ఛాయలందు
ధ్యాన నిష్ఠా గరిష్ఠులై తనరుచుండ
ప్రణయినీ మోహ పరితప్త భావములను
స్మరణ కెలయించి నందుడు మనలఁజొచ్చె. 94

అతని దయనీయ వర్తన మాలకించి
పరమ కరుణాంతరంగుడై వరలు గురుడు
చేరికకువచ్చి నిలువ నిశ్చేష్టుఁ డగుచు
తుగుర తెలివొంది లేచి నమస్కరించె. 95

బుద్ధభగవానుడాతని మూర్ధమందు
కరము గీలించి దీవించి గౌరవమున
చివికి యున్నట్టి నందుని చిత్తమందు
శాంతి నెలకొల్పందలికె నిస్స్పష్టముగను. 96

"అనుగు సోదరు డెంతో గుణాఢ్యు డనుచు
త్యాగ శీలి యటంచు నే దలచియుంటి
కాని యింతటి విజ్ఞాన హీనుడనుచు
యెరుగ నైతిని యీనాటి వఱకు కూడ. 97

కానఁదన్న భిక్షకుల కుండదయాపరులై జగమ్ములో
దీనుల దుఃఖితాత్ముల విదీర్ణచరిత్రుల దీర్ఘరోగులన్
పూని తరింపఁజేయుచు నపూర్వ విధంబున దీక్షలిచ్చుచున్
ప్రాణము మీది యాస లోకభంగిని వీడి చరించు చుండుటల్ 98

నీవారని నావారని
భావించ రాకిఁక హీనభావమ్ములకే
తావీయ రరసి వీరల
త్రోవజనుట శుభమటంచు తోచదె నీకున్. 99

ప్రాణిని సంహరించగ కృపాణము నెత్తిన వానిగన్నచో
మానస వేగమూని యనుమానము వీడి శిరంబు లొడ్డియా
ప్రాణికి ప్రాణభిక్ష నిడు భవ్యమనస్కులు బౌద్ధులిట్టి వి
జ్ఞానుల మధ్య నీగతిని జాలిని దూలెద వేల సోదరా ? 110

కాయము నిత్యమన్న గతకాలము వెన్కకురాదు సృష్టిలో
మాయని దొక్క సత్యమె కుమారక ధర్మము దాని ప్రాణమై
పూయు నహింస పిమ్మట నపూర్వ ఫలంబగు ముక్తినిచ్చు దుః
ఖాయతమై తనర్చు భవ మంతము జెందుట తథ్యమాపయిన్. 101

ఆత్మ సతిపరమౌట నూహించలమున
మూట కట్టిన యనురాగ ముత్తియంబు
జారి పోయిన దనెడు విచారపరత
దారిలోనున్న మోక్ష విత్తమ్ము కనవు. 102

నేల పాలించు వాడవై నిజప్రజాళి
భవ రుజా మృత్యువుల చేత నవయుచుండ
కాచి రక్షించదగు నీవు చూచి చూడ
నట్లు చరియించు టెంతటి న్యాయమన్న." 103

అను సుగతుని పాదములకు
వినయమ్మున మ్రొక్కి నందవిభుడున్నతమౌ
తన జీవితా శయమ్ములు
వినిపించ దొడంగె మిగులవేడుక పడుచున్. 10

"స్వామి నీవన్నమాట వాస్తవమెకాని
క్షితి తలమ్మున నాస్వల్ప జీవితమున
కను భవంబైన దొక విషయంబు కలదు
కృపవహించుము నేడు విన్నపమొనర్తు. 105

సృష్టి యందున్న కోట్లాది జీవులందు
నున్నతంబైన మానవ జన్మమెత్తి
పూర్వ పుణ్యము చేనబ్బు భోగతతిని
వీడియిడుమల బడుటెల్ల వెఱ్ఱికాదె? 106

గాసి జెందక ప్రాగ్జన్మ కలిత సుకృత
ఫలముగా లభ్యమైనట్టి వనజనేత్ర
సార్థకాహ్వయ సుందరి నమితవేడ్క
గూడి సుఖలీల నుండుట పాడుపనియె. 107

అనుపమ దివ్యభోగము లయాచితమై సమకూరు చుండఁగా
దని, సిరసించులే యొకవిధమ్మగు వెఱ్ఱి తనంబు గాదొకో
మనసము సేయ నాహ్వాదయ మందిర చంద్రిక నుజ్జగించి యు
వ్వనమున నుండుఁ బెల్లి తలవంపులుగా తలపోయుదున్ ప్రభూ 108

ఒకరిని కష్టపెట్టక పరాక్కరి విత్తముదోయ బోవకే
సకియను నేను మాప్రణయ సారసముద్రము మధ్య దీవిలో
ముకిళితమై యెఱుంగని ప్రభూత సుమోపవనాంతరమ్మ నం
దకలుష వృత్తితో మెలగుటారయ దోషమనంగ జెల్లునే. 109

నాయెద నావికొన్న దవి నాహిత సౌరభ పుష్పవల్లి నా
జాయ, తదీయవర్తన విచారణ సేయగ నిత్యసత్యమా
తోయజ నేత్ర కెంతయును ద్రోహముచేయుటకాదె నేనిటన్
పాయని దీక్ష బొందుట కృపాపరిపోషణ శాంతభూషణా. 110

అనుచు నందుడు స్వీయాశయముల నెల్ల
విన్నవించిన జినుడు ప్రసన్న దృష్టి
నాలకించుచు చిఱునవ్వు జాలువార
విదిత పరచెను సత్ప్రేమ పథమునిట్లు. 111

"సోదరా నీవు నీవచస్సుల నడుమను
కాపురము సేయు కామాంధకార్యమెల్ల
ప్రేమ యనుచును సానంద సీమయనుచు
పొగడుకొనుటెల్ల యజ్ఞాన మగును సుమ్ము. 112

పూర్వ పుణ్యోప లబ్ధమౌ భోగతతియు
కరిఁ బోవును సత్కర్మ నెరపకున్న
కుడుచుచుం గూరుచున్నచో కొండలైన
తరిగిపోవుట ధరణి నబ్బురము కాదు. 113

ప్రేమ మనోంబుజంబున పవిత్రముగా వెలుగొందు చున్నచో
కామ వికార మూలమగు కామిని కైతపియింతువేల నీ
కోమలి రూపురేఖలకు కొంచెము లోపమువచ్చు నాడు నీ
ప్రేమ పరోక్షకోమలి కుపేతమగున్ తడవింత సేయకే. 114

జరా రుజా క్లేశ భయద హస్తములు సాచి
మృత్యుదేవత వెన్నంటి మెలగుచుండ
మానవశరీర సౌందర్య మహిమ సడల
నెంత కాలము పట్టునో యెంచుమన్న. 115

నేరుపు జూపుచున్ కవులనేక విధాల మనోహరంబులౌ
పేరులు పెట్టి కోమలుల భీతమృగేక్షణలంచు జాననల్
సారస గంధగంధులని సన్నుతి జేయుటెకాని సృష్టిలో
మాతని పత్యశోభ నణుమాత్రము చూచియెఱుంగరింతయున్. 116

కొన బడుచున్న వృక్షశాఖను వసించు
కపియు గళముల యన్యోన్య కామవాంఛ
లకును మర్త్యుల భోగవర్తనములకును
భేద మావంతయునులేదు పృథివియందు. 117

ఆ కపీంద్రున కా కపి యందకత్తె
నీవు నీసుందరీమణిన్ నిరుపమాన
సుందరిగ నెంచి నిర్జరీ సుందరులను
కాంచ గలిగిన నీలేమ నెంచబోవు. 118

క్షితిని నీప్రేమ మవ్యయోన్నతమె యైన
సహజ విస్తృత ప్రకృతి వేశ్మమున వెలయు
పూర్ణ సౌందర్యమును చూడబోవకాక్క
తెరవనే యెంచి మదిని చింతించనేల. 119

కాల గతియందు నిర్జరాంగనల సొబగు
కూడ నశియించిపోవు నకుంఠితముగ
నన్నచో ధాత్రి నీప్రేమ కున్నచోటు
యెట్టిదో నెమ్మనమున నూహించుమన్న. 120

కాలగర్భమందు కష్టించు దీనుల
గతిని జూడ గుండె కరగుచుండె
నొరుల శ్రమఁగొనక పరవిత్తమేలేక
భోగ మెట్టులబ్బు భూపతులకు. 121

అతివ కామపంజరాంతర కీరము
పగిది నలరుచుండి భవనములను
లోక మందుదీన శోకంబు పెడచెవిఁ
బెట్టతగదు ధరణి విభున కెపుడు. 122

ఈ మహనీయులందరు మహీవలయమ్ముల నేలువారలే
కామనలన్ త్యజించి త్రిజగన్నుత ధర్మ పథమ్ము జొచ్చి ని
ష్కామ సుధా ప్రధారలను చల్లి శుగాబ్ధిని క్రమ్మ యీజన
స్తోమము నేలు చుండిన విశుద్ధచరిత్రులు సోదరాగ్రణీ. 123

నీవొక మంచిపుష్పమును నిర్మలబుద్ధిని కాంక్షచేతు వా
పూవొకనాడు రాలి పడిపోయిన మోడము నట్టి కాంక్షయే
జీవన దుఃఖమై యెదను చీల్చగడంగెడి నట్టియాతనన్
జీవితమందు కన్పడని శిష్టపథంబును బట్టుటొ ప్పగున్. 124

వాచవులూరు శాంతి ననివార్యముగా గలుచేయునట్టిదై
యీచతురబ్ధివేష్టిత మహీవలయంబున నిత్యసత్యమై
శోచుట చేత యిందరు బుధుల్ నవధర్మ పథమ్ముజొచ్చి వ్యా
కోచ మనఃప్రసూనముల గోరి భజింతురు మోక్షకామినిన్. 125

తన తండ్రిరాజ్యమ్ము తృణముగా భావించి
యానందుడీ దీక్ష నందెకనుమ
భువన వందితుడైన ముని చంద్రుత జితుండు
నవ ధర్మపథములో నడచె కనుమ

తన శిష్యకోటితో చనుదెంచి సేవించు
సారిపుత్రుని త్యాగ సరణికనుమ
శాశ్వతోన్నత ధర్మ చక్రమూనినయీ బు
మార కాశ్యపుని నిర్మమత గనుమ

యెందరెందరో తమప్రియ సుందరులను
వైభవములను విడనాడి వచ్చి నూత్న
ధర్మ పథమున పదమూని తనరుచున్న
తీరు పరికించ సర్వము తేట పడదె ? 126

సలిల బుద్బుదములవలె క్షణికమైన
భౌతి కానంద లోభము వదలిపెట్టి
తరుగు నెరుగని మోక్షవిత్తమ్ము కొఱకు
పాటు వడజెల్లు నన్న సీబోటివాడు. 127

ధర్మరాజ వచోమృత ధారలందు
మునిగితేలిన నందుని మనముకొంత
తల్లడము వాసిమోక్షవిత్తమ్ము దెసకు
మోజుతో మొగ్గజొచ్చె నవ్యాజముగనె 128

సు ం ద రీ వై రా గ్య ము

రమణ నెడబాసి భర్మ హర్మ్యముల నడుమ
కుములుచుండెడు సుందరి కమలవదన
నాల్గుదినము లదేరీతి నవసి నవసి
తెలివినొందెను తనభర్త తీరుతెలపి. 129

క్రమముగాలేమ శృంగార కాంక్షతోడి
లేపనమ్ములు విడనాడి పాపపుణ్య
గోష్ఠి రుచిపుట్ట వనురాగ గోష్ఠిమరచి
మమత తెగగోయ గడగెనిర్మమమత హెచ్చ. 130

ఉండ నిల్లులేక పండచాపయులేక
చెట్ల నీడలో వసించు వారి
నాదరించి యింతయన్నంబు పెట్టించి
తృప్తి పరుప దొడగె దీక్షతోడ. 131

లలిత దుకూల వస్త్రముల రమ్యవిభూషల మోజువీడి మే
ల్వలువలు భూషణంబులును వాసిగ దానముచేయుచున్ సదా
నిలయము నందనాథల కనేకవిధంబుల మేలుచేయుచున్
వెలయగడంగె సుందరి పవిత్ర చరిత్రను లోకులెంచగన్. 132

సుందరీ మోహపూరితా క్రందనమ్ము
వన్నగిలిపోయె నదివిని శాక్యమౌని
దీన జనబంధు వైనట్టి మానవతికి
ధర్మదీక్ష నొసంగగా దలచి మదిని. 133

అనుగు శిష్యు కుమారకాశ్యపుని పిలిచి
ధర్మసోదరి నందసుందరిని గాంచి
దివ్య నిర్వాణపథము బోధించు మనిన
స్వామిపనుపు నతడుశిర సావహించి. 134

లేమ గృహాంగణమ్మున చరించుతరిన్ దరిజేర భిక్షుక
స్వామిని గౌరవించి విలసన్మపదీక్ష నొసంగ వేడినన్
కోమలికిచ్చె భిక్షుకుడకుంఠిత త్యాగపరీమళాలతో
సీమలుదాటు శాక్యముని శేఖరు దివ్యపథ ప్రసాదమున్. 135

బ్రహ్మచర్యాది నియమ సంపదలతోడ
శమ దమాదుల దనుకూల కనుకూల సదనమైన
దివ్య నిర్వాణ సూత్రముల్ తెలుప సుదతి
మోద వారాశి వైచెను మునకలెన్నొ. 136

శాక్యముని పాదములు నాకు శరణమనుచు
శరణు నాకిక నవధర్మ చక్రమనుచు
సంఘమే నాకు సర్వదా శరణమనుచు
అనుదినము లేమ తలపోయు మనము నందు. 137

కలికి సుకుమార సుందరాంకములవెల్ల
దీన బాంధవ దీక్షాప్రదీప్తములుగ
మారి పోవుచు క్రమముగా మాఱిపోయె
ధర్మదేవత పాదముద్రల వహించి. 138

## సహధర్మచర్యము

సుందరీమణి యొకనాడ మందగతిని
అంతిపురి వీడి నగరి యందరుగు చుండ
బాలు డొక్కడు దరిజేరి కేలుపట్టి
క్రియేడ్చుచు రమ్మని వేడు కొనిన. 139

లేమ వానివెంట గ్రామాంతమందున్న
మాలపల్లె నొక్కమూల పూరి
గుడిసె యందు చొచ్చి కడువిస్తుపోయెను
నంద విభుని దర్శనమ్ము పొంది, 140

కోమలినిం గని నందుడు
స్వామిని తిలకించి లేమ స్వాంతమ్ములలో
స్తోమ మమకార భావము
లేమాత్రము లేక యే రహిన్ వెలుగొందెన్. 141

గుడిసెలో మూల కంకటిన్ గూలియున్న
వెలది తుదిప్రాణవాయువు విడువబోవు
తరుణమున వచ్చి నిలచెను దయదలిర్ప
బుద్ధదేవుడు నిర్వాణ భూషణుండు. 142

సుందరీ నందులా నందమంది వేగ
బుద్ధదేవుని పాదాబ్జములకు మ్రొక్కి
బౌద్ధమే మాకు శరణని పలుకుచుండ
దీనహరిజన భామిని మేనువిడచె. 143

బ్రతుకునందెన్ని యిడుమలో వడియనాథ
వనితయానాడు తనబాల బాలికలను
విశ్వ కరుణామయుని మ్రోల విడిచి పెట్టి
క్షితిని విడనాడె పూర్వ సంచితము వలన. 144

బుద్ధ దేవుడు కరుణా ప్రపూర్ణుడగుచు
హరి జనాంగన సుతుని సుందరికొసంగి
బాలికను యెత్తినందుని కేలపెట్టి
సాకనియమించె పూర్ణవాత్సల్యమునను.

ఆ యనురాగమూర్తులు దయమ్మున బాలలనెత్తి "బుద్ధదేవాయ నమోస్తటంచు" భవబంధనముల్ దిగజారిపోవ శ్రీ శాక్యముని ధర్మమార్గమున సాగుచు పూర్ణవిరాగ చిత్తులై పాయని వేడ్కఁ దీనజన బాంధవులై నుతికెక్కిఁరియ్యలన్.

# బుద్ధపురాణము

## జాతక కథా పర్వము

దాన శీలాది పారమితలను పూర్తి
జేయుటకు మున్ను ధరణిలో శ్రీఘనుండు
సకల యోనుల నుదయించి ప్రకట తీవ్ర
సాధనలు చేయు టను బోధి సత్వుడయ్యె. 1

దశ బలుడు పూర్వ జన్మగాధలు నతమ్మ
పూస గ్రుచ్చిన రీతిగా బోధసేయ
వినిన భిక్షువు లానంద మున చలించి
పోవుచుండ్రు తదీయాను భూతి తెలిగి 2

నీతి దాయక మగు కథల్ చేతములను
హత్తుకొని పోయి భవరోగహర మహౌష
ధముల దానముచేయు నుదారము గను
వాని సేవించ నొల్లని వారు కలరె. 3

## ప్రేమ మహిమ

ఒక నాడు బుద్ధదేవుడు
ముకుళిత కరకమలు లగుచు మ్రొల గల ప్రజా
నికరము తరింపఁ జెప్పెను
అకలంక ప్రేమమహిమ నవ్యయ ఫణితిన్. 4

బ్రహ్మ దత్తుడు కాశికా పట్టణమును
యేలు కాలాన నాతని మూల బలము
పొరుగు దేశాలనే తొలి ముద్ద రీతి
మ్రింగ జాలినదై యుండె నుక్కటముగ. 5

దాని పొలిమేర రాజ్యమై తనరు కోస
లాధిపుని దీఘీతిని నిస్సహాయుఁ జేసి
కాశికాధీశు డోడించగా నతండు
ప్రాణభయమున వనుల వెంబడిని పాఱె. 6

బల వంతులైన నృపతులు
బలహీనుల కొల్లగొట్టి ప్రత్యక్షముగా
తుల లేని భోగములతో
వెలయుట దుర్మార్గమైన వృత్తి సుమండీ. 7

ఆదిఘీతి నృపాలుని యనుగు బిడ్డ
డగు దిఘాయు రిపుకోటి హస్తములకు
దీనుడై చిక్కె నాదిఘీతియును శత్రు
రాజిచేపట్టు బడియె ఘోరాటవులను. 8

కోపారుణితాననుడై
పాపమనక కోసలేంద్రు ప్రాణము తీయన్
వేపనిచె వారణాసీ
భూపతి నిర్దయులు కారె భూపతులెందున్. 9

ఉరికంబంబును చేరెడు
తరుణమున దీఘితి కూర్మి తనయునిగని సా
దర దృష్టి విలోకించుచు
చరమహితవు తెలిపె హృదయ శాంతి కొఱకునై. 10

"పగ వలన పగ నశించదు
జగతీ వలయమున నెట్టి సందర్భమునన్
పగ నణచి వేయ ప్రేమ యె
సుగమ పథము దాని విడువ జూడకు తనయా. 11

తండ్రి మరణంబు గనిన పుత్రుండు చెప్ప
నలవికానట్టి దుఃఖాన కలగి భయద
విపిన భూముల కెట్టులో వెడలి కొంత
కాలమందందు తిరుగుచు గడిపె బ్రతుకు. 12

కోడె తనంబుమై నలము కొన్న కొలందిని రాచ బిడ్డలో
వాడిమి హెచ్చి తండ్రి పగవానిని దున్మి తదీయ రక్తమున్
తోడి స్వకీయ హస్తములతో పితృతర్పణ సేయఁ బొంగె తా
రాఁడట మాని యవ్వని పరాపరిగా జనె వారణాసికిన్. 13

నేర్పుతో మెల మెల్లగా నృపతి యశ్వ
శాలలో జేరి యొకనాటి సంజవేళ
వేణుగా నంబు చేయుట వినిద్రవించి
బ్రహ్మదత్తుడు రావించె ప్రమద మెసగ. 14

క్రమముగా వాని వినయ విక్రమములరసి
వారణాసీ నృపాలుఁ డవార్య కూర్మి
నంగ రక్షకునిగ జేసి యాదరించె
వేతనము పెంపుజేయుచు ప్రీతితోడ.

రాజు చూపించు ప్రేమాను రాగములకు
తనివి చెందక పగదీర్పు కొనగ తగిన
యదనునకు వేచి యుండ ధరాధిపుండు
మోదమున సాగె మృగియా వినోదమునకు.

ఖ్యాత లేందృని తేరు ది క్షితి కొడుకు
స్వాయముగా తోలు చుండిన సమయమగుట
పాటెడు మృగాళి వెన్నంటు తీరు దోప
సైనికుల నుండి తప్పించె స్యందనమ్ము.

ఘోర వనభూమి మధ్యకు తేరు చేర
భాస్కరుడు మింటి నడుచక్కి బరగు చుండె
వేట తమిదన్సి నట్టి భూవిభుడు విశ్ర
మించి నిద్రించె తృటిలోన మేను మరచి.

నృపతి తన తొడ తల నిడి నిద్ర బోవు
తరుణ మందు దీర్ఘాయువు ఛురిక తీసి
గళము తెగగోయ బోవ నాకస్మికముగ
స్మృతికి వచ్చిన దొకనీతి మెరపు వోలె.

"పగను పగచేత నిర్జించ వలను పడదు
జగతిలో ప్రేమ పగచేత సమసిపోవు"
ననుచు మరణించు వేళల జనకుడనిన
మాట స్ఫురియించగా తొట్రుపాటు కలిగె. 20

చేలు వణక మేను స్వేదాంబుసిక్తమై
జారి పడిన కత్తి సవ్వడులకు
మేలుకొనిన ధరణీపాలు డాతని స్థితి
నరసి. వెరగు చెందు నవసరమున. 21

"తా దిఘీతి నృపాలుని తనయు డగుట
క్రూర బుద్ధిని కొలువులో చేరితుదకు
చంపగ బూనుటయు పితృవచస్సు మదిని
తోచి విరమించుటయు చెప్పివైచినంత" 22

క్ష్మాతలేశ్వరు డాశ్చర్య చకితు డగుచు
తల్లడిల్లి దిఘాయు తనువు నిమిరి
కన్ను గవనుండి దుఃఖాశ్రుకణము లురల
కౌగిటను జేర్చె ననురాగ కలితుడగుచు. 23

"నాయనా! నేను చాల యన్యాయ బుద్ధి
నగుచు నీతండ్రి రాజ్యము నపహరించి
ప్రాణమును తీసి యుండిన దానవుడను
నన్ను చంపక విడనాడి నావు నీవు. 24

నీ పితృపాదుని జంపిన
పాపాత్ముడ డైన నన్ను బరిమార్పు నెడన్
నీపితృ దేవుని హితవే
కాపాడిన దోయి నన్నుకటకటా స్వామీ. 25

నీ తండ్రి రాజ్యరమతో
నా తనయను స్వీకరించి నయగుణ రాశీ
నీతండ్రి కాత్మ శాంతి మ
హీతలమున నాకుకీర్తి నెసగించగదే. 26

అనుచు బ్రహ్మదత్తు డాత్మజతో సర్వ
రాజ్య మొసగె నీ ధరాతలాన
ప్రేమకన్న దొడ్డ విత్త మేదియు లేదు
కాన ప్రేమపథము పూనికొనుడు. 27

శ్రీకరంబగు ప్రేమావలోకనంబు
చేయు కథతెల్ప బుద్ధుడు శిష్యకోటి
తనువు పులకింప ధన్యోస్మి యనివచించి
మనన జేసిరి ప్రేమజీవనము నుడిసి. 28

మరియొక దినమున సుగతుడు
పరిపూర్ణాసక్తి శిష్యవర్గము కోరన్
తన పూర్వజన్మ చరితము
కరుణామయ మగు కినార కథనెరిగించెన్. 29

## కినార జాతకము

బ్రహ్మదత్తుడు కాశికా పట్టణమును
పాలనము చేయుచుండిన కాలమందు
వారణాసీ సమీప కాంతారమందు
లేళ్ళ మందలు రెండు చరించు చుండె. 30

అందొక్క మందకధిపతి
సుందర మగు పసిడిలేడి సురచిర శోభా
నందిత నయవర్తనయై
మందను పాలించుచుండె మహనీయముగా. 31

దాని మేని సొబగు దయనీయ వర్తన
కాంచి సతము ప్రకృతికాంత మదిని
పొంగిపోవుచో కురంగాళి మోదము
వేరె చెప్పనేల విస్తరించి 32

అవని నాథుడు సతము మాంసాశనమ్ము
కోరి వేటాడ నమ్మృగకోటి ప్రాణ
భీతి చేతల్లడిలిపోయి విపినవీధి
నల్లకల్లోలమైపోయి నహరహమ్ము. 33

నేడు మనలుచున్న లేడి యామరునాడు
చూడగలుగునాస కూడలేక
పోవుచుండె నొక్క ప్రొద్దైన నిశ్చింతతో
బ్రతుకు గడువదయ్యె వనమునందు. 34

భేరీ తీవ్ర నినాదము
క్రూరాత్మకమైన వేటకుక్కలు యరపుల్
మీఱుతటి పాఱు తేళ్ళను
కారుణ్యము విడచి చంపగడగిరి మృగముల్. 35

ప్రతిదినంబట్టి దురవస్థ పాలబడుచు
కడు విచారించి మదిని బంగారు లేడి
సాటి మందను పాలించు మేటియైన
వలవ కొమ్మల లేడిని కలసి పలికె. 36

మిత్రమా రాజు దయవీడి శత్రురూప
మున కురంగాళిని వధింప బూని నాడు
బలియుడైనట్టి వీనితో పంతమూని
నిలువజాలము మనమిలాతలము నందు. 37

మనము మనలోని వైషమ్యమును త్యజించి
ధారుణీ పతితోడ మంతనము సలిపి
రాజు నొప్పింనికున్న కురంగజాతి
నాశమైపోవు మరికొన్ని నాళ్ళలోన. 38

దినమునకు నొక్కలేడి వంతునను మనము
అధిపుని గృహాంగణమ్మున కరుగుచున్న
తక్క మృగములు మృతభీతి తక్కకొంత
కాలమైనను జీవించగలవు భువిని. 39

పసిడిలేడి హితవు పైమంద నేతకు
నచ్చినంత ననుదినంబు నొక్క
మృగము పంపబడిన జగతీతలేశుడు
వేట మానివేసె నాటినుండి. 40

కాలము దొర్లుచుండిన దొకానొక నాడొక లేడినిండు చూ
లాలికి వంతువచ్చుటయు నయ్యది నేతను జేరి మ్రొక్కి కొ
న్నాళల కే ప్రసూతనయి నంతనె రాజుకు బోనమౌదు నీ
వేళకు బంపుమన్యనవి వేడెను గద్గద ఖిన్నకంఠియై. 41

నిండు చూలాలు కన్నీరు నింపికొంత
గడుపు కోరిన సుంతయు కరుణ లేక
పలవ కొమ్మలలేడి కోపమున కనులు
జేవురించగ పలికె కచ్చితము గాను. 42

నీ వంతున కిపుడెవ్వరు
పోవరు చూలాలివైన పోవలసినదే
నీవినయ విధేయతలకు
తావియ్యడలేదు వేగతరలు మనంగా. 43

చూలులేడి కడుపు చుమ్మలు పోనేడ్చి
జాలిలేని ప్రభువు సమ్ముఖమున
నిలువహాని యనుచు తలపోసి బంగారు
జింకతో నవస్థ చెప్పుకొనెను. 44

దాని దుర్దశకెంతయు మానసమ్ము
కరగి పోవగ లేచి బంగారు లేడి
పూని తా దానివంతు సంపూర్తిచేయ
బయలు దేరెను నిస్వార్థ భరితయగుచు. 45

నగరికింబోయి దేహార్పణము నొనర్చ
యేలిక నికాయమున వంటశాల కెలన
వధ్య శిలమీద తనతల వంచి నిలువ
కటిక తిలకించి విభ్రమ కలితుడయ్యె. 46

రాజు శాసించి యుండె కురంగ రాజు
లను వధించిన దండింతు ననుచు, కాన
పరుగు నను పోయి వాడు క్ష్మాభర్తతోడ
విన్నవించెను, మృగరాజు వింతనడత. 74

రాజు చనుదెంచి హేమ కురంగరాజు
వర్తనము గాంచి నివ్వెర పడుచు నడుగ
గా, పసిడిలేడి యమ్మృగి కరుణ గాధ
విన్నవించిన నృపతి ప్రసన్ను డగుచు. 48

సాటి జింకప్రాణ సంరక్షణార్థమై
మొనసి దేహమొసగ బోవు విన్ను
దయను విడచి నాము తరలుమీ వనికన
వరకు రంగరాజు కరుణపొడమ. 49

పలికె; నృపతితోడ వసుధేశ నాప్రాణ
మొకటి యితర ప్రాణ మొకటియగునె
యెన్ని మృగము లిందు యీల్గెనో తమకునై
మున్ను యింక చావనున్న వెన్ని. 50

తాము దయవహించి తక్కిన జింకల
విడుతురేని నన్ను విడువుడిపుడు
లేకయున్న వేగమే కత్తి వ్రేటుతో
యిపుడె సమసిపోవ నిందునన్ను. 51

పరుల కష్టపెట్టి బ్రతుకు చుండుట కన్న
నొరులకొఱకు మేను దొరగు టొప్పు
గాన నాశిరంబు ఖండించి పలలంబు
మెక్కదగును తాము మక్కువగను. 52

లేడి పలుకులకు, చలించి మహీనేత
మాంస భక్షణంబు మాని, నాడె
జగతిచాట బనిచె, మృగయా వినోదంబు
కూడదనుచు, హింసవీడు డనుచు. 53

రాజ చంద్రుని సదయాను రాగమునకు
భాజనంబై తనర్చిన పసిడిలేడి
వందనముచేసి నృపతికి ముందకేగి
మేలు కొనుచుండె సమ్మోదకేళి దేలి. 54

గర్భిణీ హరిణము కొంత కాలమునకు
కాంచి యందాల కూనను పెంచుచుండ
పరుగునేర్చిన హరిణ డింభకము పెద్ద
మందతో నాటలాడుచు మసలుచుండ. 55

తల్లి తిలకించి బిడ్డను దరికి జీరి
పలవ కొమ్మల లేడితో చెలిమికన్న
పసిడి జింకతోడి మృతియెసం పర్కారంబు
కాన, యీ జింక సేవకు పూనుమన్న. 56

తల్లి హితవులోని తాత్పర్యము గ్రహించి
పసిడి లేడికొలువు పట్టె కూన
పసిడి లేడినేను పైమందనేత యే
దేవదత్త నామ భూవరుండు. 57

అని, పలికిన, సుగతుని పద
వనజములకు మ్రొక్కి, భక్తి ప్రస్తుతిగావిం
చెను, భిక్షుక సంఘంబా
వనమునగల తరులు విరుల వానను కురిసెన్. 58

ఒక పూర్ణిమాదినంబున
ముకుళిత కరకమలు లగుచు మ్రోలనలరు భి
క్షుకుల గని శాక్యసింహుడు
ప్రకట ముగాస్వీయపూర్వ భవకథ తెలిపెన్. 59

## బోధిసత్వజాతకము

ధనమూల మీ జగమ్మని
జనులందురు కాని; ప్రాణ సంకటమగుచున్
మనసీక చిత్త శాంతిని
గనసీయక బాధపెట్ట గలదా ధనమే. 60

బోధిసత్వుడ నగుచు నేపూర్వమొక్క
పల్లెలోబుట్టి తలిదండ్రు లుల్లసిల్ల
మెలగ సేవించు చుండగా మృత్యుకోప
మునకు గురియయ్యె జనకుడు జననితోడ. 61

ఆపదలందు కుందు నసహాయుల పాలిటి కల్పకమ్ములై
ప్రాపు వొసంగు చుండెడు కృపాళులు నాతలిదండ్రులిద్దరున్
పాపపు మిత్తిపాల్పడ నభాగ్యుడనౌచు మృతిన్ జయించగా
తాపసవృత్తి నొక్కజడదారిని కొల్వ గడంగితిన్ వసిన్. 62

ఆ ముని రాజచంద్రుడు మహామహిమాన్విత తత్వసిద్ధుడై
కామములన్ జయించి త్రిజగమ్మున కీర్తికెక్కుచుండు చున్
భూమిని సంచరించువెడ పూర్ణవిరాగ సుబోధ బుద్ధినై.
స్వామిని వెంబడించితిని సర్వవిధంబుల తోడునీడగా. 63

మేమొకానొక కానన భూమి పథము
పట్టి చనుచుండ నడిరేయి భయములేక
స్వాతి నక్షత్రయుక్తుడై చంద్రముండు
తులుకు చుండెను వెన్నెల కుప్పవోసి. 64

స్వామి వారట్టిలగ్న మాసన్నమైన
కనకవర్షంబు కురిపించ గలరు తృటిని
కాని; నేనట్టి పనులిల హానికరము
లనుచు నుడువుచు నుండెద నహరహమ్ము. 65

అది; నిదాఘనిశీథము ముదురువెన్నె
లలను పదయాత్రయెంతయో రహిఁగూర్చ
త్వరిత గతినేగు నమ్మెక్కచరియ యందు
తస్కరులు చుట్టుముట్టిరి దయ దొరంగి. 66

బడుగువారము మరియు తాపసుల మనుచు
విశద పరచిన మూర్ఖులై వినకనుంత
కనికరము లేక తెక్కలు కట్టి నెట్టి
బాధపెట్టుచు చోరులి ప్పగిది ననిరి. 67

"మీపాండిత్యముతో నిట
నేపనియును జరుగనేర దేదైర మీరల్
మావన్ను రెండు వరహా
లేపగిదిని నైనమిచ్చి యేతీరవలెన్. 68

వనములో రేల మాకంట బడినవాడు
వాల్గుపూకలు చెల్లించి నడువవలయు
లేక పోయినచో యమ లోకమునకు
పంపివైచెద మెట్టి నిర్భాగ్యునైన." 69

తస్కరుల పన్నకై గురూత్తముడు వసిని
కనక వర్షంబు గురియించగా దలంచు
టరసి నర్మోక్తి తద్యత్న మాపుజేసి
చోర నేతకు తెలిపితి గౌరవమున. 70

గురువరేణ్యుని మీకడ కుదువబెట్టి
విత్తమును తెచ్చి మీకిచ్చి విడుచుకొందు
ననుచు నొడబడజేసి రయమునవ్వఁ
పల్లెకేగితి విత్తము పడయుకొఱకు. 71

వెడలునపుడు మగుడ వేడితి నేవచ్చు
వఱకు కనకవృష్టి కొఱకు మంత్ర
పఠనచేయ కడగ వద్దని కాని య
ద్గురువు నావచస్సు సరకుగొనక. 72

ధీరుడై మంత్రము పఠించి దినము నుండి
కురియజేసిన బంగారు గుట్టలెల్ల
యెత్తుకొని చోరమండలి యేగుచుండ
వారి నొకతస్కరులగుంపు చేరి నిలిపి. 73

దోచుకొన నెంచుయత్నము చూచిజడిసి
మమ్ముపీడించనేల నిమ్మౌనివరుని
వట్టి కురిపించుకొనుడయ్య పైడివాన
లనుచు తొలిదొంగలు యథేచ్ఛ నరుగుటయును. 74

రెంతప గుంపా ప్రయోగిని
దండించి ధనంబుగోర తల్లడపడి మూ
ర్ఖుండగు ముని చాత్రుడు రా
కుండుటగని కనులనీరు గురియుచు పలికెన్. 75

నాయనలార యేటికొకనాడటువంటి పవిత్రకార్యమున్
చేయగవచ్చు గాకిపుడు చేయుట నాకుతతంబు గాదనన్
మాయురె ముందుగాజనిన మందకు బంగరు రూకలిచ్చి య
న్యాయము మాకుజేసెదవహా!యని త్రుంచిరి యోగిశీర్షమున్. 76

మునిని తెగటార్చి ముందుగాజనిన చోర
మండలిని చేరి యెదిరించి ఖండనమున
నొండొరుల జీల్చుకొని చచ్చిరొక్కడైన
ప్రాణముల తోడ పుడమిపై బ్రతుకకుండ, 77

పల్లియందెట్లొ విత్తము వడసి తిరిగి
వచ్చుచుం దారిలోకొండ ప్రక్కరుదిర
ధాత లెదురైన దొంగలు తలలుద్రెళ్ళ
కూల గంటిని నాలేత గుండెలదుర. 78

పీన్గు గుట్టల మధ్యగా విడువబడిన
పసిడి మూటల వలన విస్పష్టమయ్యె
గురువ రేణ్యుడు నామాట సరకుగొనక
పనినొనర్చిన బంగారు వానగాథ. 79

ప్రవిమలానంద భావనాంబర తలాన
పరువు లెత్తుచు వెలుగొందు మెఱపురీతి
మునిని విడిపించ వచ్చు నామోదమెల్ల
మారిపోయెను కన్నీటి ధారగాను. 80

కీకారణ్యమ్మున బడి
కేకలిడుచు తిరిగితిరిగి ఖిన్నతతో నెం
తో కష్టముపై నొకవ
ల్మీకము కడ గంటి గురుకళేబరము తుదన్ 81

ధన దాసులైన క్రూరులు
కొను నట్లు సువర్ణసృష్టి గురిపించిన య
మ్మునివరుని శిరఃఖండము
గని దురపిల్లితిని ఘోరకాననభూమిన్. 82

పరమ నిర్వాణమునుగోరు వరమునీంద్రు
లష్టసిద్ధులకాశించి నిష్ఠసడలి
ఇహపరమ్ముల వ్యర్థులై యేగుతెరగు
లవగతములయ్యె నాకు మహాద్భుతముగ. 83

ఎంతయేడ్చిన ఫలితమావంతలేమి
పదివసంతాలు మన్మనః పద్మమందు
నిలిపి కొలిచిన దేశికాంఘ్రులకు మ్రొక్కి
జరిపి వైచితి నగ్నిసంస్కార విధులు. 84

మూమకాదర్శమును వన భూమిదాటి
సాగిపోవుచు మండవృక్షములు లతలు
స్పందనము వీడి విభ్రాంత జలధి మునిగి
తేల నిలచెను విజ్ఞాన తీరమందు. 85

బుద్ధదేవుని పూర్వాను భూతివినిన
జన వితానము బుద్ధుడే శరణమనుచు
మ్రొక్కి తమలోని ధనదాహములు నశించ
భవ్యమతులైరి నిర్వాణపథము నందు. 86

## శశజాతకము

దాన ధర్మాది పారమితల మహత్వ
మెరుగగోరిన సజ్జన ప్రవరులొక్క
నాడుదర్శించి బుద్ధునివేడు కొనిన
శాక్యముని తెల్పెనిట్టులలౌక్య ఫణితి. 87

ఒక్కకాననమున చక్కని కుందేలు
కలదు చాలపూర్వ కాలమందు
సాటి జంతువులకు స్ఖ్యత సమకూర్చి
జ్ఞాన బోధసేయ గడగునెపుడు. 88

మనము సహజ వైర మార్గంబు విడనాడి
స్నేహ బంధనమున చెలగుచుండి
సౌమ్యవృత్తి బూని సాటిజీవుల కష్ట
ములను బాపవలయు కలతవీడి. 89

ఘోరపాటుచేత నైనను
పరులను హింసించరాదు ప్రత్యక్షముగా
పరికించి జ్ఞానవృద్ధుల
కరమను రక్తిని భజించగాదగు నెపుడున్. 90

మనము మనమన పూర్వజన్మముల యందు
చేసికొనియున్న సుకృతవిశేషమగుచు
లభ్యమగుదాని పరుల నలక్ష్యదృష్టి
చూడకాదరమున పెట్టి వాడవలయు. 91

పూర్ణిమాపర్వదినమంద పూర్వభక్తి
నొరులకాతిథ్యమునొసంగి యుపవసించి
అంచితధ్యాన నిష్ఠలో మించి బ్రతుకు
ధన్యమొనరించుకొనవలె మాన్యలీల.

ఆరీతి నెల్ల జీవుల
కారుణ్యము తోడ బ్రోవగా జేయుచు సం
సారాంబోధిని దాటుగ
ఘోరాటవిలో శశమ్ము గ్రుమ్మరుచుండన్. 93

ఒక్కపూర్ణిమ దినమున నుపవసించి
వనినిగల మిత్రులనుజేరి తనకు గల్గు
కాయలాకుల నర్పించి గౌరవమున
దైవ చింతనలో నున్నతరుణమందు.

దేవతల రాజు కుందేలు జీవితమున
వెలయు దానపర్వతిము తెలియగోరి
పథికుడై వచ్చి యాకటి బాధకోర్వ
జాల ననిచెప్పి విలపించె శశముముందు. 95

చెవులపోతు చాల చింతించి యాతని
కడుపు చిచ్చుబాపగా రవంత
ఫలము లేమిపలికె స్వామి యీరాకచిన్న
పనియొనర్చెదయ్య బాధయనక. 96

చిన్ని కట్టెలిన్ని చేర్చియగ్గి రగుల్ప
బోన మబ్బువేగ పూను మనిన
పాంథుడట్లొనర్చి ప్రమదంబుతో చూచు
చుండె నేమి జరుగునో యటంచు. 97

ఎండుపుల్లలట్టె మండి నాలుకలుచాపు
టరసి శశముదుమికె నగ్గియందు
పక్వమైన తననుపాంథుడు భక్షించి
కుక్షిబాధ బాపుకొను నటంచు. 98

దాని దానగుణము మానవాతీతమై
వరలుటరసి దేవభర్త మెచ్చె
వహ్ని చల్లబడెను జాహ్నవీ జలమట్లు
చెవులపిల్లి తనువు నవయకుండ. 99

ఆకుందేలును నేనే
లోకములో దానగుణము రూపొందించ
న్గా కొనల బోధపుతిని య
శీకముగాదిది మున్నుజరిగినది ధరణిన్. 100

## సింహ జాతకము

భార్యతోర్వని వింధ్యపర్వత గుహాల
యమున నివసించు చుండుహర్యక్షమొండు
తన పరాక్రమమున ప్రాణితతిని యొడిసి
పట్టి భక్షింపఁజొచ్చె నిర్భయముగాను. 101

అమ్మృగేంద్రుని కుక్షియం దహరహమ్ము
బోలెడు మృగాలు జీర్ణపోవు చుండ
ప్రాణులన్నియు తమప్రాణ రక్షకొఱకు
తరలిపోయిన వాపర్వతమును విడచి. 102

ఎంతవెదికిన నొకచిన్న జంతువైన
కంటబడమిని యాకటి మంటతోడ
బాధపడుచున్న సింహమే పగిది కడుపు
చిచ్చుచల్లారు ననుచు యోజించుచుండె. 103

లలిత రమణీయ శాద్వలాంకురము కొఱకు
ప్రాకులాడెడి హరిణ డింభక మొకండు
కంటబడినంత దాని వెన్నంటి తరిమి
పట్టలంఘించె కేసరి నట్టడవిని. 104

హరిణశాబకంబు మరణభయంబుచే
పారిపోవ జంతుపతి రయాన
తరిమితరిమి పెద్దబురదలో దిగబడి
పోయి రక్షకొఱకు కూయదొడగె. 105

దారి నిటునటు పోయెడు వారిపిలచి
తన్ను వెండలించు డనుచు ప్రార్థనము సేయ
దాని పూర్వప్రవర్తన దలచి దరికి
చేరరై రెవ్వరే వేడి యాచించుచున్న. 106

అపలెతిండిలేక మసలెడు సింగ మ
ట్లొక్కదినము బురదచిక్కి క్రుక్కి
కొనకు దారినరుగు గోమాయువును జీరి
వెలికితీయు మనుచు వేడుకొనిన. 107

జంబుకంబట్టె నిలచి నిశ్శంకతోడ
"నిన్ను కాపాడి నంతనే నన్ను చంపి
తినెద" ననుటయు సింగము దీనవదన
యగుచు నారీతిగాచేయ నన్న నిన్ను. 108

ఎన్నెన్నో జంతువులను
తిన్నానది నిజమె యింక తిననారీతిన్
పున్నెంబుండును నాయీ
బన్నంబును బాపి వేగబ్రతికించిపవోన్. 109

క్షణికమైన బ్రతుకు శాశ్వతమని యెంచి
సాటి జంతువులను చంపినాను
నేడు మొదలహింస వీడనని మృగేంద్రు
డాదరమున పలికె ఖేదపడుచు. 110

నక్కదానిమాట నమ్మరాదను పాతి
నోటి కొక్కకట్టు పాటవమున
నందజేసిలాగ హర్యక్షమాత్మలో
సన్నుతించె చాల జంబుకమును. 111

అదిమొదలా మృగరాజము
సదమలవిక్రమము సాటిజంతువుల పట్టున్
వెదచల్లి దలంచక న
భ్యుదయకరంబగు నహింస నూని చరించెన్. 112

ఎలుకలు పిల్లులు సింహం
బులు లేళ్ళును పాముకప్ప పులిగోతతియున్
కలహింప కమ్మృగేంద్రుని
కొలువున విహరింపదొడగె కోమలవృత్తిన్. 113

ధరణి నారీతి వీర్య సంతరణమహిమ
స్పష్టపరచితి మృగరాజ జన్మమెత్తి
అని వచించిన జినుని పాదాబ్జములకు
మ్రొక్కి వినుతించి రదివిన్న పుణ్యులెల్ల. 114

## మహాపద్మ జాతకము

వారణాసినేలు బ్రహ్మదత్త నృపాలు
నకుజనించి పిన్ననాడె తల్లి
లేనివాడనైతి మానవజగతిలో
తల్లిలేనిలోటు తరమెతీర్చ. 115

పితృదేవుడు తదుపర యొక
క్షితిపతి తనయను వరించి చిత్రముగా నా
సతిచేతి బొమ్మ యితడను
గతిగా విహరించె ప్రేమ కానన భూమిన్. 116

యువరాజ పదవి యందే
తవనెఱుగక మెలగుచో హతాత్మగ సీమన్
తవులుకొనె విప్లవాగ్నులు
అవినీతికి హేతుభూత మగుచాక వంకన్. 117

రాజధాని నగరి రక్షకు నన్నుంచి
జనకుడేగె సైన్య సంయుతముగ
సింహవిక్రమమున చెండాడి పోరులో
తిరుగుబాటు దార్ల తీట యణచె. 118

తుంటరులను లోక కంటకుల నడంచి
ప్రజకుశాంతి గూర్చి విజయ గరిమ
తరలివచ్చు చున్న తండ్రిగారికి రాజ
ధానియందు స్వాగతము నొసంగ. 119

సన్నాహము లొనరించుచు
క్రన్నన నెదురేగు చుండగా నంతిపురిన్
పిన్నమ్మ పిలిచి నారని
విన్నప మొనరించె నొక్కవెలది తయమునన్. 120

బాల్యమాది యీనాటి వఱకునొక్క
మారుకూడను నాతోడ మాటలాడి
యెఱుగ కున్నట్టి సవతితల్లేల నన్ను
పిలువ నంపినదని మది వెరగు పడుచు. 121

చని పినతల్లి దర్శనము కాగా శిర
మ్మును వంచిపాదాబ్జములకు మొక్కి
నిలచి యానతివేడ నెలతమాటాడక
కామాంధయై నన్ను కౌగలించు
కొనబోవ నేతప్పుకొని సవిత్రీ నాకు
పూజ్యురాలవు పాపపుణ్యములకు
వెఱువవద్దా యని వెడతి వచ్చుచునుండ
క్రోధ ఘూర్ణిత నేత్రగోళ యగుచు

నిన్ను నరికింతు చంపింతు నేడెయనుచు
శాపములు పెట్టి భయపెట్ట సరకుగొనక
మాతృ భావముతో డనే మరలివచ్చి
తవిలి యుంటిని విధ్యుక్త ధర్మమందు. 122

పరులెవ్వరి కీవిషయము
నెరిగించక యుంటి నామె యెట్లోనేనే
ధరణీ వరుతో ముందుగ
నెరిగించె దననితలంచె నెంతయుభీతిన్. 123

పతిరాకకు పూర్వమె తు
దుగ్మతతో విలపించుచున్న మాడ్కినిమూల్గన్
క్షితిపతి తనపుత్రుయిని దు
స్థితి వినికననేగ కనులుచెమ్మగిలంగన్. 124

"తమరు పురినిలేని తరుణంబునన్ మహా
పద్మ్మడిటకువచ్చి బలిమినన్ను
చెఱుపబూనె నేమిచెప్పుదు మీముద్దు
కొడుకు నడత చెప్ప కొనినసిగ్గు. 125

తల్లిలేని వాని నల్లరి పెట్టిన
దనుచు నమ్మనమ్మ రాత్మలోన
కొమరు డనినయంత మమకారమేయున్న
నన్ను చంపివేసి ననుసుఖింతు" 127

వయసు మీరియున్నవాడౌట వాతండ్రి
పడుచురాణి వగపుఁబలుకు లెల్ల
నమ్మి క్రోధరక్తనయనుడై నను౦ఖంప
కత్తి దూయకడగె కరుణలేక. 127

ఏపాప మెఱుగ నేనని
వాపోయెడి నావచస్సు పాటింపకయే
భూపతి న్యాయాన్యాయము
తో పనిలేకుండచాల దూఱుచునున్నన్. 128

భయ దపర్వతాగ్ర భాగాన నిలబెట్టి
త్రోసి చంపుడనుచు రోసమడర
తండ్రి యానతిచ్చె దాక్షిణ్యమును వీడి
కంచెచేమమేయ కలదె దిక్కు. 129

ఘోరాతి ఘోరహంతకు
లేరీతి వధించబడు దురిల నారితిన్
క్రూరాకారులు కింకరు
లారూఢుని జేసిరాకన గాగ్రమ్ముపయిన్. 130

లోయలోపల సేద్యము చేయుచున్న
నాగకులనేత యొకడను రాగమడర
పర్వతాగ్రము పైత్రోయ బడిననన్ను
పట్టి రక్షించె నారింజ పండువోలె. 131

బండబాళ్ళమీద పడిముక్కలై చావ
నున్న నేను నాడు పొన్నపూల
పాన్పుమీద బడిన భాగ్యవంతుడనైతిఁ
కాని మదిని భోగకాంక్ష ఉడిగె. 132

నాగజాతి రాజు నాచరిత్రము విని
కనులు చెమ్మగిల్లగా తపించి
బుద్ధిచెప్పి పితకు గద్దెనెక్కించెద
లెమ్మనంగ నేను సమ్మతిలక 133

దురితాత్ముడైన మానవు
డొరులను హింసించుచుండు నోపికయున్నన్
తిరిగి తనకర్మ తానే
కర మనుభవమై తపించ గలడనియంటిన్. 134

పిదప నొక వత్సరంబా
సదయుల నడుమనువసించి శాంతధనుడనై
మది తపము సేయుకోరిక
లుదయించగ చేరి హిమనగోప వనమునన్. 135

మునివృత్తి దపమొనర్చుచు
వనభూమి చరించునన్ను పరికించిన కా
ననపాలు డేగితెలిపెను
జనకుని యాస్థానమందు సవినయ ఫణితిన్. 136

నిలుకడపై నిజమెరిగి నేమరణించితినంచు నాత్మలో
కలగి తపించి మత్పిత వికారవిమోహము వీడి కానన
స్థితి కరుదెంచి జాలిపడి చయ్యననన్ను కవుంగలించి భూ
వలయము నేల రమ్మనుచు ప్రాకృతునింబలె వేడియుల్లనున్. 137

వగలాడి మాటలను విని
పగగొని హింసించినట్టి పాపాత్ముడనా
తగవరితనమ్ము కూలగ
మగటిమితో రాజ్యమేలుమా నాతనయా ! 138

కుటిలాలక తోపాట
క్కూటి కముడిగి నాకుశిక్షగావించుము దు
ర్ఘటనాత్మక మగు నాకథ
కటకట సరిదిద్ద లెమ్ము కన్నకుమారా ! 139

రాజెంతగ బ్రతిమాలిన
రాజీపడ బోవకేసు రానంటిని లో
తాజిల్లు శాంతసంపద
నీజగతీ రాజ్యలక్ష్మ లీయంగలవే ? 140

శాశ్వతానంత కాల దేశమ్మునందు
నిరుపమానంద ధనముతో వెగడుమునులు
క్షణికమైనట్టి రాజ్యభోగములమీద
మోజుపడరని తెలిపితి వ్యాజముడిగి. 141

ఎంతవేడిన నేనింటి కేగకునికి
స్వాంతమున చాలదుఃఖించి జనకుడేగి
భార్య కల్పించిచేసిన క్రౌర్యమునకు
శిక్ష విధియించె పూర్వదాక్షిణ్య ముడిగి. 142

నాకువోలె భయట నగశిఖరము నుండి
పడెదు నాతినొరులు పట్టికావ
కునిక చచ్చిపోయె పెనులోయలో పడి
గడువ దరమె క్రూర కర్మమిలను. 143

ఇది మహాపద్మజాతక కధయటంచు
జినుడు వచియించ బౌద్ధులు వినితరించి
తిరిగి యొకవాడు ప్రార్ధించ తెలియజేసె
శాక్యసింహుడు చాంపేయ జాతకమును. 144

చాంపేయ జాతకము

పూర్వజన్మను సహానాముభూతి భువన
మునకు చాటగ చాంపేయుడను పృదాకు
రాకు మారుడైన నాగలోకమందు
గడన కెక్కెతి సుందరాకారమందు. 145

నా సౌందర్యము గూర్చిచెప్పుకొనుచున్ నన్నే మదిన్గోరి పే
రాసన్ నాగ కులాంగనామణులు నిత్యాపారులై సర్వదా
యీ సౌజన్యుని పొందలేని తనువుల్ హీనంబు లేయంచొగిన్
గాసిం జెందుచు చుట్టుమూగెదరు కింకర్తవ్య మూఢాత్ములై. 146

పాము పడతుల మకుటాగ్రభాగ మణుల
కాంతుల నివాళులిచ్చుచు గారవించ
భోగ భాగ్యాల తోతులదూగుచొక్క
సుందరిని పెండ్లియాడితి డెందమలర. 149

భౌతికానంద భోగ సంపదల మీద
మోజు చూపెడు నా ప్రియ రాజవదన
"సుమన" మానస మానంద సుధలదేల
నా మనోవీధిని విరక్తి నాట్యమాడె. 148

కవులు మా ప్రేమ కావ్యముల్ గా రచింప
గాయకులు వాని కీర్తింపఁగడగి వారు
నాడు నాటికి మా ప్రేమ వాడవాడ
లకును ప్రాకుమ నెంతయో రాణఁగాంచె. 149

గేహినీమణి నృత్య సంగీతములకు
చెవిని తెగగోసుకొను నేను శ్రీహరిపద
చింతనను మున్గి మోహరాశి నిగమించి
బైటపడగోర జొచ్చితి భావమందు. 150

నిండు పున్నమ నుపవాస నియతిమునిగి
మర్త్యలోకము దర్శింప మనసుపుట్టి
వెలికి చనుదెంచి పాతాళ బిలము నుండి
చేరి విడిచితి నొక పల్లెటూరు దరిని. 151

పల్లె పడతులు ననుగాంచి భక్తితోడ
వందనముచేసి యానంద భరితలగుచు
గోఘృత క్షీరములు పోసి కొలుచుచుండ
శాంతముగ స్వీకరించి నిశ్చింతనుంటి. 152

ఆడంబర సూన్యుండై
చూడగ నమితప్రశాంత శోభిత మగుటన్
వీడ మనసొప్ప కయ్యెడ
మూడేడులు దైవచింత మునిగి గడపితెన్. 153

క్రమముగా పల్లె చుట్టుప్రక్కల గలట్టి
జనులు చనుదెంచి దివ్యదర్శనము చేసి
యరుగుచుండఁగ నదితైర్థికాళి తోడ
రాణకెక్క దొడంగె నిలాతలాన. 154

స్వాంత వీధిని దైవికచింత నమును
చేసుకొనుచున్ననన్ను వీక్షించిచాల
గేలిచేయుచు నిటునటు రాలు రువ్వి
బాధపెట్టిరి తుంటరి బాలురెల్లి. 155

శక్తి వంతుడు విషయాను రక్తుడగుచు
యెదిరి నిలచిన తొలగెదరెల్ల వారు
ఆతడే యాత్మచింతన నలరుచున్న
లక్ష్యపెట్టరు ధూర్తుల లక్ష్యమతులు. 156

ఎవ్వరేమన్న నేచలియింపకుండ
శిరము నరవంచి ధార్యనించు తరుణమందు
పాములను పట్టి యాడించి బ్రతుకునట్టి
బాడబుడు పట్టి బుట్టలో వైచుకొనియె. 157

నాగరాజు ఆట నాగస్వరపు పాట
మేళవించి జనుల మెప్పు పొంది
పొట్ట పోసు కొనెడు పుడమివేలుపు దేశ
పర్యటనముచేయ బయలుదేరె. 158

ధరణి పూర్వమట్టి వరసర్పరాజును
చూడ నట్టిజనులు చోద్యపడుచు
నాగ నృత్యమరసి నాణ్యముల్ వర్షించ
ధరణి సురుడు మోద భరితుడగుచు. 1

వారణాసీధరా వరునికొల్వున కేగి
తన నేర్పుచూడ భూధవుని కోరి
నాగస్వరముపట్ట నాట్యమాడెడు సర్ప
రాజును వీక్షించి రాజుమెచ్చ
కొన బోవునంత "సుమన" వచ్చి ధరణీశు
మ్రోల నిలువగాంచి వ్యాళరాజు
దీనాతి దీనుడై దిక్కులు చూచుచు
పుటికలో ముడుచుక పోవుచుండ

సుమన తనభర్త దురవస్థ చూచి కనుల
నీరు నింపుచు కరుణదైవార పలికె
"రాజ యీతడు పాతాళరాజవరుడు
నా మనోనేత చాంపేయ నామకుండు" 1

దైవ చింతను వైరాగ్య తత్పరతను
మర్త్యజగతికి చను దెంచి మసలుచుండ
నేర్పుమై పట్టి తవపొట్ట నింపుకొనగ
బాధపెట్టుచునుండె నివ్వగిదినితడు. 161

పతి వియోగాగ్నిలో బడి పరితపించి
నేటి వరదాక నాహార నిద్రలనక
లోకముల నెల్ల గాలించి మీకాలువున
పతిని దర్శించ గంటి భూపాలచంద్ర. 162

నాధవునిన్ విడిపించుము
భూధవయని సుమనవేద భూపతి కరుణా
మేదుర హృదయుండై మరి
యాదగ నిప్పించెసుమన కామేశ్వతునిన్. 163

పాలుని గాంచి యిట్లనె, కృపామయ బుద్ధిని వీడి యక్కటా
వారని దైవభక్తి దయివారగనిమ్మెయి సంచరించు న
క్రూరచరిత్రు నాగపిభు కోరలుపీకి వ్యకీయ హీన సం
సారము చక్కబెట్టుట'తి జాల్మిక వృత్తిగ నీకుతోచదా 164

ఇతడు సామాన్య నాగరాజే యనంగ
రాదు వేఁబోధిసత్వుఁడో ఖేదమయ జ
గత్తులో శాంతి సహవాది వి త్తనములు
చల్లి మొలిపించగా నుద్భవిల్లి యుండు. 165

సార్థకంబయ్యె మామక జన్మమిట్టి
సౌమ్యశీలుని దర్శించ జాలుకతన
అను నరేంద్రుని నూక్తులు వినినరికులు
వినుతి జేసిరి ధన్యోస్మి యనుచుచాల. 166

బ్రాహ్మణుడు పశ్చాత్తాపభరితు డగుచు
కామలోభా దులైన మనోమలముల
తడగి పరిశుద్ధుడై మరుక్షణమునందు
ప్రణుతి గావించెనా నాగపతికి మ్రొక్కి. 167

తన ప్రవర్తనచే ధరాస్థలిని నరుల
హృదయములు మార్చివేసిన సదయమూర్తి
శాక్య సింహుండు చాంపేయ జాతకమును
వినిచె జనలోకమానంద వనధిఁదేల. 168

ఛదంత జాతకము

ఒకపూర్ణిమా దినంబున
ముకుళిత కరకమలులగుచు మ్రొక్కెడునా భి
క్షుకులకు బుద్ధుడు తెలిపెను
సకలోత్తమమౌ ఛదంతజాతక గాథన్. 169

హిమగిరి కాననమున నొక
కమనీయ సరోవరమ్ము కలదందలి తో
యము సకలప్రాణి కోటికి
శ్రమ వారకమనుచు సుప్రశస్తిని పొందెన్. 170

వర సరోవరమున కిరుగడలను పుష్ప
వనములేడు వానివెనుక నేడు
పర్వతములు పెద్దప్రహరీలవలె నుండి
రక్షణంబు సేయు నక్షయముగ. 171

గిరుల నడుమ స్వర్ణ గిరియొండు భాసిల్లు
నందు గలమహా గుహాలయాన
కాపురమ్ము సేయు గజయూథ మెనిమిది
వేల సంఖ్యమీరి విశ్రుతముగ. 172

వారణ సంఘమెల్లపుడ వారిత భక్తి భజించుచుండ వి
స్తార యశస్సు గాంచిన ఛదంత శుభాహ్వయ సామజేంద్రు దు
ర్వార కఠోరదంతముల వాడిమి గాంచిన జంతులోక సం
హారక యాత్రజేసెడు మృగాధిపుడే వెరగందు పాఱుబో. 173

దశబలుని పూర్వ దివ్యావతారుడైన
సామజేంద్రుడు శరదిందు సదృశతనుడు
నడువనేర్చిన రజితాద్రి నానెనంగు
శాంతగుణనిధి నిస్తుల సౌమ్యమూర్తి. 174

సుందరమూర్తి యగ్గిరుల శూలసుభద్ర మహా సుభద్రయన్
మంద మదేభ సుందరుల మక్కువతో వరియించి సంతతా
నంద గుహాంతరాళమున నవ్యవనమ్ముల మూడు మేనులున్
డెందములొక్కటే యనెడు ఠేవ జరించుచు నుందురున్నతిన్. 175

ఏయే కాలమ్ముల తమ
కేయే ఫల భక్షణమ్ము లింపయ్యెడినో
ఆయా కాలమ్ముల దమి
నాయా ఫలములను మెసవి యలరుదుడుగుహన్. 176

కలత నెరుగని ప్రణయ సాగరము నడుమ
తావు లీనెడు వలపుల దీవియందు
తేలి యూరెఁడు మమకార మానసముల
ద్రిమ్మరుచు నుండె వారణ త్రితయ మనని. 177

వేయేండ్ల కాలము ట్లిన
పాయత దాంపత్య సుఖము బహుమోదకరం
బై యలర నొక దినమ్మున
తీయని లేమావి చిగురు తినెడు కరిణులన్. 178

కని;ఛందతుడు తొండమున కొమ్మనాడించ
శూల సుభద్రపై రాలెదుమ్ము
ఆవంకనున్న మహాశుభద్ర శిరాగ్ర
మునచాల పూలు పుప్పొడులు పడుట
తిలకించి డెందాన కలగి శూలశుభద్ర
తనభర్త పక్షపాతముగ నెంచి
వేయేండ్ల ప్రణయంబు విరిగి వ్యర్థంబైన
రీతిగా తలపోసి ప్రీతి దొరగి

యాత్మ పతి వరాభవాసణమున చాల
మఱుగ బ్రతియొనర్చు వెరవుకాన
రాణి పెద్దహ్రదము లోమున్గి ప్రాణము
తీసుకొనిన దొక్క వాసరమున. 179

మఱుజన్మ మగధ భూమీ
వరునకు తనయగ జనించి భావంబున నా
కరిరాజు మీది పగయే
కరణిని నెరవేరు ననుచు కలలంగాంచున్. 180

పూర్వ భవ వైరమును పొల్లుపోవ
నీయకుండిన దగుటచే తోయజాక్షి
తగిన సమయమ్ముకొఱకు చిత్తమున వేచి
కాల మొకరీతి పుట్టింట గడపుచుండ. 181

పెండ్లియీడుకు వచ్చిన పిదప తండ్రి
వారణాసీ ధరాధిప వరున కొసగి
పరిణయ మొనర్చ నధికార బలముతోడ
కడగెను చదంతుపై ప్రతీకారమునకు. 182

మంచు కొండ నడుమ మసలు ఛదంతుని
కోరలారు పెఱుకుకొని యొసంగ
జాలు వాని కుచిత సన్మాన మొనరించి
కోటి టూకలేను కొలిచియిత్తు. 183

అనుచువెల్లడిం చినట్టిరాణి వచస్సు
ప్రాకిపోయె సర్వలోక మందు
దేహబలము నమ్మి తిరిగెడి యోధులు
ధనము మీదియాస తగులువడరె. 184

రాణి ప్రకటన సోనుత్తరాభిదుండు
వినిసవాల్ జేసె నేతెచ్చెదను భదంతు
దంతముల నెల్లరంపాన తరిగి పిదప
కోటి రూకలు గైకొందు పాటవమున. 185

పాప పుణ్య భీతితోపని లేనట్టి
ద్రవ్య దాసులధిక దర్పమతుల
మాట చెల్లినట్లు మహిలో దరిద్రుడౌ
జ్ఞాని మాట నెగ్గజాల దెపుడు. 186

వివిధ నిశితాయుధములతో వేయిమంది
పోటరులు వెంటరా నిరాఘాట జవము
తోడ యాత్రను సాగించె తుహినశైల
సానువుల నున్న షడ్దంతు జాడలరయ. 187

కలనైన పరుల కెగ్గులు
తలపెట్టని నాగవిభుని దంతమ్ములకై
చలపట్టి వచ్చువారల
వలచ బరిచె హిమనగాధి పతి క్రోధనుడై. 188

# బు ద్ధ పు రా ణ ము

ఏడు వత్సరంబు లేదు మాసంబుల
యేడు దినములట్టు లేగియేగి
చూడగలిగె తుదకు సోనుత్తరుండు కా
సార నీరమాను సామజమును.

కాళ్ళు మొలచినట్టి కైలాసగిరి బోలు
శ్వేత గజమునరసి భీతిపొడమ
వేటగాడు సాల వృక్షాగ్రమున నక్కి
గడపె తద్దినంబు కష్టపడుచు.

చరమ సంధ్యవఱకు సామజ యూధము
నీరమాడియింటి దారి బట్టి
వెడలి నంత గుండె దడకొంత చల్లార
మల్లుదేగి మార్గ మధ్యమందు.

పెద్ద గోయి తీసి నిద్దుర విడనాడి
యెండుపుల్ల లన్ని పండుటాకు
లేరి పైని గప్పి దారియెప్పటి యట్ల
చేసి యెక్కినక్కె చెట్టుమీద.

మరుదినంబు నందు కరిరాజు యెప్పటి
యట్ల జలకమాడ నరుగుదెంచి
క్రూర కర్ముడెదుట గోయిని త్రవ్వట
మెరుగ కందుకాలి వెఱగుచెందె.

అన్నెము పున్నెంబెఱుగని
వెన్న యెడదతోడ భయద విపినాంతరమం
దున్న గజరాజు కింతటి
బన్నంబులు గూర్చె రాజ్యబలమట్టిదిపో.

ధన పిపాసతోడ ధరణీ తలమ్ముపై
నీతి విడచి పాపభీతి విడచి
ప్రాకులాడువారి పోకడ తెలియగా
జాలదే ! షడంతు చరమగాధ.

ప్రభువు గోతియందు పడిఘీంకృతులు సేయ
వెనుకవచ్చు నాగవితతి యెల్ల
పారిపోయె ప్రాణభయముతో నెంతయున్
కనులు చెమ్మగిల్లె గహనరమకు.

ఎరిగి జీవితమున పరులకే తొగ్గను
కోరి చేయనట్టి కుంజరమ్ము
ఘోర విపినవీథి గోతిలో పడిపోయి
సొక్కిపోయె వెడలు చోటులేక.

గాయముల నుండినెత్తురు కారుచుండ
చేష్టలుడిగిన షడ్దంతు స్థితినివేట
గాడు తిలకించి సునిశిత క్రకచమూని
చేరె దంతాలు తెగగోయ బీరమడర.

తన ధన దాహము తీరగ
వనమున సితనాగనిభుని వజ్రనిభములౌ
ఘన దంతమ్ములు కోసెడు
చెనటిని గని ప్రకృతిమాత చింతించెకదున్. 199

క్రూరాత్ముడు అంపముతో
కోరలు తెగగోయ లేక క్రుంగుచు నెంతో
బీరమ్ము సడలగా కం
గారు పడెడు తరిని గాంచి గజమిట్లనియెన్. 200

మర్త్యులెరుగని యీమంచు మల నడుమను
జీవకోటుల కేయెగ్గు చేయకుండ
కాయలాకులు తినిపొట్ట గడుపుకొనెడు
నన్ను చంపిన నీకెంత పున్నెముండు. 201

నినుగాని నీ సహోదరు
లను గాని త్వదీయ ప్రణయ లక్ష్మినిగానీ
కని నింద చేసినానా
యన విని మృగయుండు విస్మయమ్మున పలికెన్. 202

"వారణా సివిభుని కూరిమిదేవేరి
కోరెనన్ను నీదు కోరలారు
కోసితెమ్మటంచు కోసితెచ్చిన కోటి
రూకలిత్తు ననుచు ప్రాకటముగ. 203

వేయిమంది తోడ వెడలి వచ్చుచునుండ
మంచు కొండ మిత్ర మండలమును
పొట్ట బెట్టుకొనిన దెట్టకేలకు నేను
నిన్ను చూడగంటి నిన్న పగలు. 204

ఏడేండ్లు విపిన పథముల
కూడు గుడ్డలనక తిరిగి కొనకిచ్చో నీ
జాడ గని వృక్షశాఖల
నీడలలో గడపినాను నిన్నటి దినమున్. 205

కోటి రూకలందు కొనుజాపతో పెద్ద
గోయితీసి యుందు కూల్చి యుంటి
నంతెకాని నాకు నంతయు శత్రుత్వ
భావమేమిలేదు జీవితమున. 206

వేటగాని పలుకు విని సామజేంద్రుడు
వారణాసి రాజు వనితగాథ
దివ్య దృష్టి వలన తెలిసి స్పష్టంబుగా
పరితపించె సుదతి పగదలంచి. 207

ఎంత యేడ్చిన ఫలిత మింకేమియనుచు
ధైర్యము వహించి తనపూర్వ తరుణి చరిత
మెఱగజేసెడు మృగయుని కరమునుండి
క్రకచమును గొని యుట్లనె కరుణపోదము. 208

ప్రాణమొసగియైన వారణాసీ పతి
భార్య పగనుశాంతి పరుప నెంతు
కాకయున్న నెంతకాల మీప్రారబ్ధ
కర్మ కట్టి కుడుప గలదొనన్న. 209

వజ్ర సన్నిభముగ వసుధాతలమ్ముపై
పేరువడసినట్టి కోరలారు
కోయ దరమె మర్త్యకోటి బాహుబలంబు
వీనిముందు వ్యర్థమౌనుసుమ్ము. 210

మీరాణి చిత్త శాంతికి
కోరలు తెగ కోసియిత్తు కొనుమని కరి గం
భీరమగు స్వీయ కరమున
కోరలు తెగ గోసి యొసగె క్రూరాత్మునకున్. 211

గజరాజు త్యాగబుద్ధి ని
నిజముగ గవిమించు కొండ నీరై పోయెన్
వృజిన భయంబున మృగయుడు
గజబిజ పడుపెల్ల ప్రకృతికామిని చూచెన్. 212

మరికొన్ని దినము లేనుగు
నరకబాధ తోడ కాళ్ళు నడుము సడలగా
మరణించె గోటి యందే
తరుగిరి నిచయంబు దుఃఖధారలు విడువన్. 213

దంతావళ సాహస మా
సాంతముగని వేటగాడు ప్రాంతమ్మున దు
ర్ధాంతమగు పాపభీతిని
చింతిలి దంతములతోడ చేరెపురమ్మున్. 214

అంతఃపుర మందలి భూ
కాంతుని సతి నరసి మ్రొక్కి కన్నీరముతో
దంతము లొసంగి యాష
ద్దంతుని కథతెలిపె లేమ తల్లడిలంగన్. 215

పూర్వ విభుని దంతములు గాంచి తద్ధృద
యాంతరము నెరింగి చింతతోడ
కుముల జొచ్చెనెరిగి కుంభీనసము నోటఁ
బడిన భేకి మరణ బాధవోలె. 216

రాజ్యపదవి లోని రాక్షసత్వమ్ముతో
పరమ శాంత నిధుల పట్టిచంపి
కూర్చు కొనిన దొంతి కొలపూర్తి యౌటచే
రాణి విడచిపెట్టె ప్రాణములను. 21

అని; ఛదంతుచరిత మును బుద్ధుడెరిగించ
వినన శిష్యకోటి కనులుచెమ్మ
గిల్ల మాటలేక ఖిన్నులై మ్రొక్కిరి
ప్రభు మనోజ్ఞపాద పద్మములకు. 218

పారమితల నట్లు పూరితి గావించ
స్వామి భువి ననేక జన్మలెత్తి
నట్లు తెలియ జేసె నాలించువారల
జన్మ బంధనముల సడలిపోవ. 219

---

# బుద్ధపురాణము

## నిర్వాణ పర్వము

ప్రభువు న్యగ్రోధ వనమున బహుదినములు
గడపి తనజన్మ భూమిలో గలనము స
మానవాళిని నవధర్మ మార్గమందు
గ్రాలజేసెను నిర్వాణ కౌశలమున. 1

మలయజంబున కరుగడ గలుగుచెట్లు
మలయజ గుణంబు గైకొని వెలయుచుండ
నాళి కేరము కలియుగా జాలనట్లు
దేవ దత్తుడు సుగతుని తెరగుకనడు. 2

బండజాళ్ళ వెన్నపగిదిని కరగించ
జాలినట్టి జినుని సరళ సూక్తి
దేవదత్తు కఠిన జీవిత లక్ష్యము
త్రిప్ప లేనిదయ్యె నెప్పటికిని. 3

స్వామి బోధలు శ్రోత్రాల ప్రసాదమట్లు
ప్రాకు చుండుట గని యోర్వ లేకమదిని
చంప దలచిన యాతని జతనమెల్ల
ద్యుమణిపై చల్లు నీటిబిందువులెయయ్యె. 4

## అనాథపిండదుడు

శ్రావస్తి నగరంబున
శ్రీవిలసితుడైన వణిజ శేఖరుడు దయా
జీవి "సుదత్తుండా" జిన
దేవుని దర్శించ నేగు దెంచెనుభక్తిన్. 5

భారతమందు శాక్యకుల భానుని జ్ఞానమరీచి వీచికల్
మీరుచు నాడు నాటికి గమించుట గన్న వణిగ్వరుండు తా
జేరి స్వయంబుగా జినుని శ్రీచరణమ్ముల నాశ్రయించి దీ
క్షా రతుడయ్యె తన్మతము సర్వదిగంతములందు చాటగన్. 6

బుద్ధదేవుని పురమ్మునకు తోడ్కొనిపోయి
తనయింట నాతిథ్యమును నొసంగి
శ్రీఘను డవ్వీటి చెంగటగల జేత
వనమున నివసించ మనసుపొడమ
దానికై బంగారు నాణెముల్ పరచి య
నాథ పిండుడు కొనినమ్రుడగుచు
ప్రభువు కర్పణజేయ భద్రాత్ముడందు స
శిష్య సంయుతుడై వసించి ముక్తి

మార్గ మెరిగించుచుండ కోమటి యశేష
భోగములవీడి నవధర్మ బోధ కొఱకు
జీవితమ్మును ధనము వెచ్చించి దీన
సేవకొముగ్గి సార్థక జీవియయ్యె. 7

ప్రసన్నధీ

కోసల నాకాలమ్మున
ధీ నము పేతుడు ప్రసన్నధీ భూపతి యు
ద్భాసిత యశస్వి యేలెను
భాసురముగ విబుధజనుల ప్రణుతులొనర్పన్. ౮

తక్షశిలయందు విపుల విద్యాప్రవీణు
డైన నరపతి సర్వధర్మాను రక్తు
డగుట శ్రావస్తికిం బుద్ధు డరుగుదేర
దర్శనము చేసె భక్తితాత్పర్య గరిమ. ౯

అవని నాధుడు శాస్త్రమర్యాద లెల్ల
నరసి యుండిన పండితాధ్యక్షుడగుట
ప్రభువు వివరించు హేతువ ద్వాదమువిని
చెంగలించెడు మోదాంత రంగుడయ్యె. 10

బుద్ధదేవుని నవధర్మమును గ్రహించి
ధర్మ దీక్షనుగొనిన భూధవుని తండ్రి
చెల్లెలగు * కోసలాదేవి శిష్టచరిత
యొదల ధరించె బుద్ధ సన్యాసదీక్ష. 11

---

* ఈమె పూర్తి పేరు మహాకోసలాదేవి.

రాజాశ్రితులగు శాస్త్ర
త్రజ్ఞులు పండితులు సమరధీరులు మిత్రుల్
మోజుపడి బుద్ధదేవుని
పూజించి నవీన ధర్మమునుగొనిరెలమిన్. 12

ఆశా పరిమిత కోసల
దేశంబెల్లెడ ప్రసన్నధీ బుద్ధుని యా
దేశమ్మున ధార్మికసం
దేశము వెలయించి మించె దివిజులు మెచ్చన్. 13

క్షేమ

స్వామి శ్రావస్తి నుండి రాజగృహపురము
చేరి వేణువనాన వసించి వర్ష
కాల మావనపాళిని గడుపుచుండ
భూమిపాలుని యర్ధాంగి క్షేమవచ్చి 14
ధర్మ దీక్షనొసగ దళబలు ప్రార్థింప
బింబిసారు సతికి విశ్రుతముగ
ధర్మ దీక్షనొసగె నిర్మమత్వమ్ముతో
ముక్తి కాంత గేహమును కనంగ.

వేశ్య

బుద్ధు డటనుండి వైశాలిపురిని చేరి
చూత వనమున నివసించి చేతమురల
ధర్మబోధనొసర్చెడు తరుణమందు
జరిగె నొకవింత సజ్జన స్తవముగాను. 16

కమలాలయ యను గణికా
రమణీమణి యొకతె రూపలక్షణ ఖనియై
క్రమమొప్ప కొన్ని కోట్ల ధ
నము నార్జించిన దపూర్వ నాట్యముచేతన్. 17

దాని సోయగంబు మాన వాతీతమై
తనరు కతన కామ దాసులెల్ల
వనిత మెప్పుగోరి శునకము లట్లుగా
తిరుగు చుందు రెపుడు తరుణిచుట్టు. 18

కులవృత్తి సేవగించెడు
లలనామణి సతము మదిని లక్ష్మీపతినే
తలపోయుచు గానకళా
కలలన్ జెలువారుచుండు కడుచిత్రముగా. 19

సుగతు డరుగుదెంచి నగరబాహ్యవనాన
విడిసి యుండుటెరిగి విద్యుమోష్టి
స్వామిపాద పద్మ సందర్శనము చేసి
ధర్మ దీక్షకొనగ దలచి మదిని. 20

మొక్కవోని శీలమున సుందరీమణి
కూర్చుకొనిన నూరుకోట్లు ధనము
పంచిపెట్ట పేదవారికి నెలనాళ్ళు
కట్టుబట్టమిగిలె తుట్ట తుదకు. 21

సిరులెల్ల దానమిచ్చిన
సరసిజ దళనయన సుప్రశాంత హృదయుడై
కరుణామయుడగు బుద్ధుని
దరిశించ రసాలవనిని దరిసెడువేళన్. 22

అందాల రాశియగు నా
సుందరికై పరితపించు కుంతలు ఖలులై
ముందుగజని కోమలిపై
నిందిత కథలల్లి చెప్ప నేర్చిన వారై. 23

దశబలునకు మ్రొక్కి తలకొక మాటగా
వచ్చుచున్న వారవనిత చాల
చెడిప మిగుల దుష్టచిత్త యంచేమేమొ
నుడివినారు సిగ్గు విడిచిపెట్టి. 24

జారులనిన వెల్లి షడభిజ్ఞ డాలించి
పలికె నగ్గిపడిన పసిడి రీతి
ధర్మ పథము నందు తరుణిమనోమల
మంతరింప నిర్మలాత్మ కాదె? 25

మీమీ హృదయంబులలో
కామ వికారంబొకింత కలుగక యున్నన్
కోమలి చరిత్రమంత యు
కామరహిత మగుచు మీకు కన నయ్యెడుబో. 26

ఏభావము కలవారల
కాభావముతోడ నన్యులగుపింతురుపో
మీభావంబులు సరియగు
చో, భామిని గూర్చియింత సొదమీకేలా. 27

అనుచు మందలించు అద్వయవాదికి
మ్రొక్కుచున్న కుజన ముల సమక్ష
మున నెధర్మ దీక్ష గొనెను వారాంగన
బుద్ధదేవు దయను పొందగలిగి. 28

ఇనుము పరసవేది నణుమాత్ర మంటిన
పసిడియై చెలంగు భాతి నాతి
ధర్మ దీక్షపొంది నిర్మమత్వమ్ముతో
తనువు గడపె భూత ధాత్రియందు. 29

పిత్రాస్తమయము

శాక్య సింహుండు వైశాలియందుండగా
శుద్ధోదనుడు శతవృద్ధ డగుచు
కనుచూపులేని రోగగ్రస్తుడై తనూ
జునివేగ రప్పించుడన నమాత్య
వరు డొకండరుదెంచి ధరణీశుస్థితితెల్పి
సర్వ సంగత్యాగి శాక్యమౌని

కపిలవస్తు నకేగి కన్నతండ్రిని భక్తి
పూజించి నిర్వాణ భూతిగురియ
జేయుచుండిన సుగతని చేతులందు
తనువు విడచిన శాక్య భూధవుని సుకృత
మభినుతించిరి భిక్షువు లాత్మయందు
పరిజనంబులు దుఃఖ సంభరితులైరి. 30

ధరణీశుని కోల్పోయిన
పరిజనముల నూరడించి భగవానుడు క్రి
మ్మర కోసల మీదుగ జనె
కురురాజ్య నరేంద్రు వేడికోల్మన్నించన్. 3

* రాష్ట్రపాలు డింద్రప్రస్థ రాజధాని
యందు సుగతుని పూజించి డెందమలర
ధర్మ దీక్షనుగైకొని తనప్రజలకు
ముక్తి మార్గము బోధించ మ్రొక్కివేడ 32
జినుడందు ప్రజకు తృష్ణా
వినివారణ పథముతెలుప వేలాదిజనుల్
చనుదెంచి ధర్మదీక్షను
గొన దొడగిరి శాక్యమునిని కొనియాడి కడున్. 33

వేద వాదులైన భూదేవు లెందఱో
బౌద్ధమతము మూఢ మతమటంచు
చాట వారిమాట లేటిపై జల్లిన
నీటి గతిని పొందె నిస్తులముగ. 3

## అజాతశత్రువు

బుద్ధదేవుడు కురు రాజ్యమున చరించు *
కాలమందున మగధ భూపాలుడైన
బింబిసార మహారాజు పెద్ద కొడుకు
చండవిక్రము డజాత శత్రురాజు. 35

బుద్ధదేవుని పినతండ్రి పుత్రుడైన
దేవదత్తుని దుర్బోధచే వివేక
హీనుడై తండ్రిని వధించి యెక్కెసింహ
పీఠ మావంతయును పాప భీతిలేక. 36

తల్లి తండ్రి నన్న దమ్ముల వధియించి
నేలనేలు నృపతి పాలనమున
జనుల కెట్టి సౌఖ్య సంపద కలుగునో
కాలమెరుగు ధరణి గర్భమెరుగు. 37

పదవీ వ్యామోహముచే
విదితగు విధి తగనిదనుచు నెరుగని వాడై
సదయాత్ముడైన తండ్రిని
తుదముట్టించిన ఘనుండు దౌర్గత్వమునన్. 38

---

* ఈ రాష్ట్రపాలుడు ఇంద్రప్రస్థము రాజధానిగా కురురాజ్యమును పాలించెను. యీతడు బుద్ధభగవానుని సమకాలికుడు.

పదిదినాలు రాజ్య పాలన జేసిన
పిదప మొదలుపెట్టె హృదయమందు
చెప్ప నలవిగాని చింత, రాజ్యేందిర
తీర్పలేని దగుచు తెల్లబోవ. 39

జన్మదాతను చంపి యజాతశత్రు
రాజు హృదయాంతరమ్మున రగులు కొనెడు
దుర్భర విషాదవేదన తొలగిపోవు
వెరవుకానక తపియించు వేళయందు. 40

కారణ జన్మమెత్తి త్రిజగన్నుతి గాంచిన బుద్ధదేవుడీ
దారుణ వార్త దావినిన తక్షణమే చనుదెంచి యంబితో
దారుడు బింబిసారుడు ముదంబున దాన మొసంగియున్న య
ఘ్వాభరి వనాన శిష్యపరి పూజితుడై వసియించు చుండగన్. 41

జగతిలోన వైద్య శాస్త్రమందెంత యో
సిద్ధ హస్తుడైన జీవకుండు
బింబిసారు సుతుని వ్యధ మనోవేదన
బాపలేకమ్యాను పడివచించె. 42

"రాజ నీమనోవీధిలో రాజుకొనెడు
వేదనాగ్నిని చల్లార్ప విశ్వమందు
అన్య మేమియు కొఱగావు మాన్యుడైన
దశబలుని దివ్య బోధామృతమ్ము తక్క. 43

వెన్నెలలకన్న చల్లని వెలుగు కలిగి
శశ్వదానంద మకరంద సారమగుచు
తనరుచుండిన సుగతుని ధర్మమెరిగి
తనివి చెందని ప్రాణియు ధరణిలేదు. 44

వేయిమాటలేల విశ్వ విశ్వంభరా
వలయమున నహింస వెలయు జేయు
జినుని నిత్యసత్య సిద్ధాంతమే చిత్త
శాంతి దాంతి నొసగ జాలు నధిప. 45

జీవకుని హితోక్తి శిరమున ధరియించి
సరగజని యజాత శత్రురాజు
వేణువనమునందు విశ్రాంతి గొను
తథాగతుని దివ్యపాద కమలములకు. 46

మ్రొక్కి తానుదుష్టబుద్ధుల చెలిమిచే
చేసి యున్నపాప చేష్టితమును
విన్నవించి శరణువేడిన సుగతుడు
కనికరించి యతని తనువునిమిరి. 47

"పలికె! నోరాజ నీమనోనిలయమందు
గల మహాక్రౌర్య తమమును తెలుసు కొనిన
వాడ వగుచు పశ్చాత్తాప భరితహృదయ
మున తపించుటచే దోషములు నశించు. 48

మానవుడెవండు స్వీయ దుర్మార్గములను
తెలుసుకొని చాలదుఃఖించి తిరిగియట్టి
పనులు చేయడో వాడు భావలయమందు
పూర్ణ నిర్వాణ పథమును పొందగలడు. 49

కాన నీవింక నీమనః కల్మషమును
క్షాళనము చేసి సతమహింసా వ్రతమ్ము
మనన జేయుచు రాజ్యపాలన మొనర్చు
మరిగి గతపాప కార్యసంసరణవిడిచి. 50

అనిన శాక్యసింహు నతులిత భక్తితో
సన్నుతించి చిత్తశాంతి తోడ
పాలనమ్ము జేసె ప్రజలెల్ల ప్రస్తుతి
సలుపునట్లు జాతశత్రురాజు. 51

బుద్ధత్వమ్మును పొందిన
సిద్ధార్థుండట్లు రాజశేఖరుల సదా
దిద్దుచు సమస్త జీవో
ద్బుద్ధజ్ఞానాధ్వమును ప్రబోధించె తగన్. 52

## చుందుని ఆతిథ్యము

నలుబదై దేడులీయిలా తలము నందు
ప్రాణికోటిని నిర్వాణ పథమునందు
నడపిన జినుడు "పాలోయ" నానెసంగు
గ్రామమును జేరె శిష్యసంకలితుడగుచు. 53

పల్లెకొకవంక కన్నుల పండువగుచు
వెలయు మామిడితోటలో విశ్రమించి
దివ్య నిర్వాణ పథము బోధించు చుండ
చుందుడనబడు కమ్మరి డెందమలర. 54

స్వామి నర్పించి ధర్మ దీక్షను గ్రహించి
తన రసాల వనమ్మును దానమిచ్చి
తత్పదాంకిత హృదయ పద్మమ్మునందు
చెంగలించెను మోద తరంగుడయ్యె. 55

ప్రభువు నొకపరి భక్తి తాత్పర్య గరిమ
విందు కాపించి పిలిచిన చుందు నింట
శిష్య సంయుతు డగుచు విచ్చేసి ప్రీతి
భోజనము చేసె సుగతు డవ్యాజముగను. 56

అడవి పంది మాంస మానాటి విందులో
వండిపెట్టబడిన బౌద్ధులెల్ల
బాధపడుచు నది నిషేధించ, సుగతుడు
మందు డరసిమదిని కుందుననుచు. 57

జాలిచెంది ముట్ట జాలని పలలమే
మెక్కివైచె పైకి మక్కువగను
అదియె ప్రభువు మేన నతిసార రోగమై
కరము బాధపెట్టె మరుదినమున. 58

ఆరోగముతో బుద్ధుడు
చేరెను కుశినగర మఖిల శిష్యయుతుండై
వారము లరిగిన కొలఁదిని
మీఱెడు తద్వ్యాధిబాధ మిక్కుటమయ్యెఁ. 59

## మహాపరినిర్వాణము

సాగరుని జేరు జాహ్నవీ జలము రీతి
నలుబదై దేండ్లు శాంతిఁ బోధింపఁ జగాన
పాఱజేసిన యద్వయవాది పరము
పదము జేరెడు తమజనము పతి నెరింగి. 60

అనుగు శిష్యుడైన యానందు నొకనాడు
చేరఁబిలిచి ప్రీతి చెంగలించ
తనయ నాకు నేఁటి కెనుబది యేడులు
నిండె జన్మ ఫలము పండిపోయె. 61

నేడొ రేపొ పండు కాడ పట్టును వీడి
రాలిపోవు మేనిగాలు లణగు
తనువు దొరగినేను చనిన మీరెల్లర
ధైర్య పడకయే యథావిధముగ. 62

ధర్మ పథము నందె నిర్మమత్వమ్ముతో
బ్రతుకు గడపి సకల ప్రాణికోటి
శాంతి సుధను గ్రోలి జగతీ తలమ్ములో
వెలయు నట్లు చూడవలయు నెపుడు. 63

నను గూర్చి పరిత పించగ
జన దన్నా జగతి నల్పజంతువు నైనన్
నను వోలె యాదరించిన
అనుమానము లేక నేను హాయనందింతున్. 64

అంతియ కాక యొండొరు లహంకృతులై మదమత్సరాలతో
పంతములూని జీవుల విపద్దశలో బడ ద్రోతురేవి కా
పంతయు సంతసిల్లునది శాక్యమునీంద్రుడు నిర్వచించు చో
వింతగ మ్రోగె దుందుభు లవేలముగా వినువీధి నెల్లెడన్. 65

ఆనందుడు ప్రభుపాదము
లానందము తోస్పృశించి "అవిరళ ధర్మ
గ్లాని కెపరాదు ప్రభు నా
మేనన్ ప్రాణంబులుండ మేదిని" ననియెన్. 66

ప్రాణికోటికి నిర్వాణ పథము తెలుప
జీవితమ్మును వెచ్చించి శ్రీఘనుండు
కుశినగరమున నిర్వాణ దశవహించు
వార్త వ్యాపించె వెన్నెల వాకపగిది. 67

స్వామి పాదాబ్జ చరమ దర్శనము పొంద
నేల యీనిన యట్లుగా వేల కొలది
జనులు చనుదెంచి ధన్యోస్మి యనినుతించి
చనదొడంగిరి భక్త్యాతి శయము తోడ. 68

నరవి నాలోన * నీశాన శకము నూట
నలుబదెనిమిది యేడుల నడుచు చుండ
నిండు వైశాఖ పూర్ణిమానిశిని శీత
కరుడు సంపూర్ణ కిరణుడై మెరయు తరిని. 69

ముదుర వెన్నెల పాలలో మునిగితేలు
తరుల తాదుల కుసుమమం జరులు కురియ
దేవతలు మింట దుందుభుల్ మ్రోవజేయ
ప్రభువు చేరెను పరమ నిర్వాణ పథము. 7

పాంచ భౌతిక దేహంబు వదలి పరమ
పదము చేరిన సుగతుని మదితలంచి
కుందు భిక్షుక కోటి నానందు డరసి
దిగులు బాపెను కర్తవ్య దీక్ష నుడివి. 7

అభినవ బుద్ధుడౌ యానందు ననుమతి
గురు కళేబరము నందరును కలసి
పూజించి యెనలేని పుష్పహారాల తోడ
బంగారు పల్లకీ పైనమర్చి
రమణీయమైన హిరణ్యవతీ నది
కావలీ తీరమం దలరు చైత్య

* ఈశాన శకము 148వ సంవత్సరమున వైశాఖపూర్ణిమా మంగళ వారము నాడు బుద్ధభగవానుడు నిర్వాణము పొందెను. దీనిని చారిత్రక పరిశీలురు క్రీ. పూ. 543వ సంవత్సరమనినారు.

మున చందనపు కాష్టమున నుంచి యగ్ని సం
స్కారము గావించి సమ్మానతముగ

దగ్ధశేషిత శల్యముల్ ధరణినెల్ల
దిక్కులకు బంపి వానిపై దివ్య శిల్ప
కళలు వెదచల్లు స్తూపమున్ మొలువజేసి
పూజ చేయగడంగి రపూర్వముగను. 72

దశబలుని పవిత్ర దంత మొక్కటి నౌక
పై సింహళమునకు పంపబడెడు
సందర్భమందు కృష్ణానదీ సాగర
సంగమ మందు వజ్రాల దీవి
కడనొడ్డు చేర నక్కాలమ్మునం దాంధ్ర
దేశమేలెడు రాజు ధృతిని దాని
పూజించి సకలాంధ్ర భూమివాదంతము
నూరూరు త్రిప్పి మహోత్సవములు

జరిపి పంపించె నందురీ జగతియందు
శాక్యసింహుని మహిమాతి శయము నెరిగి
చెప్ప కొలవదు వాసుకి శేషులకును
తలుప వేనెంత నాకవిత్వంబదెంత. 73

ఆంధ్రదేశమందు అమరావతీ భట్టి
ప్రోలులందు ఘంటసాలయందు
కాన వచ్చు స్తూప ఖండము లానాటి
శిల్ప కళను నొక్కి చెప్పలేవె ? 74

# బుద్ధపురాణము

## విశ్వవ్యాప్తిపర్వము

### ఆనందుడు

అద్వయవాది మహాపరి నిర్వాణ
ముసుఁబొంది నంతనే పుడమియందు
శ్రీఘను నకు ప్రియ శిష్యుడై మించిన
ఆనందు డవిరళ జ్ఞాన పటిమ
సద్దేవు దివ్యబోధామృతంబును నాల్గు
దిక్కుల వెదజల్లు దీక్షతోడ
భిక్షుక వరులకు శిక్ష నొసంగుచు
దేశ దేశమ్ములు తిరిగి ధర్మ

బోధచేయుచు నవతారమూర్తి బుద్ధ
దేవు డెరిగించిపోయిన తెరవు నందు
శాంతి వెలయించి భువన ప్రశాంతి కొఱకు
తనువు వెచ్చించె సముచితోత్సాహమునను. 1

భూత దయార్ద్రబుద్ధి పరభూతసుఖంబులకై తపించి వి
ఖ్యాతిగ నెందెనెందఱో మహాత్ముల కవ్వియ ధర్మదీక్ష సం
ప్రీతి నొసంగు ధర్మపరి వృద్ధిని గూర్చిన త్యాగశీలి వి
స్ఫీతయశస్వి యయ్యె పృథివిస్థలి నారవి తారకంబుగన్. 2

ఆనందుని బుద్ధిదయా
మానసిక బలంబు నిరుపమానము లనుచున్
వేనోళుల నుడివెను హిమ
భాను నిభుండైన బుద్ధ భగవానుండే! 3

దేవదత్తుని హితవు పొందిన యజాత
శత్రు వొకపరి భక్తితో శాక్యమునిని
శిష్య పరివృతముగను దా జేయుచున్న
విందు గైకొన వలెనని వేడుకొనిన. 4

మానవాధినేత మాటను మన్నించి
శాక్యమౌని శిష్య సంయుతముగ
కదలివచ్చి కుతపకాలాన నడివీధి
నేగుచుండగని సహించ లేక. 5

దేవదత్తుడు బుద్ధదేవుని శిష్య సం
యుతముగా చంపించ యొదిగివేచి
ఆకస్మికమ్ముగా నైదువందలమదే
భముల తోలించెను ప్రభువుపైకి
ఘీంకరించుచు తమ్ము గీటడంచగవచ్చు
శుండాలముల రాక చూచి శిష్య

లెక్కడి వారక్కడే పిక్కబలము ను
చూపించ తనువుపై తీపిచేత

శ్రీఘనుండంత తనకుడి చేయినెత్తి
నిలువబడ గజయూథము కలగితిరిగి
పారిపోయెను సింహాలపగిది జనుని
చేతి వ్రేళ్లైదు కననౌట భీతిచెంది. 6

కరిగణంబు వచ్చుటగని యానందుడు
మరల భయముచెంది పదువులెత్త
బోవ కందె బుద్ధదేవుని రక్షించ
వేచియుండె భక్తి వివశుడగుచు.

జరిగిన దుష్కార్యము విని
సతగుణ యేతెంచి మగధసామ్రాట్టు దయా
పరతంత్రుడైన బుద్ధుని
పరివరి క్షమియించ తనను ప్రార్థించి యనెన్. 8

"స్వామీ యేమరిపాటున
మేముండగ దేవదత్త మిత్రుడు ఖలుడై
యీవాడ్కి నొనర్చెను తమ
సామర్థ్యంబెరిగె నేడు జగమెల్ల ప్రభూ. 9

దేవ నేటినుండి దేవదత్తుని చెడ్డ
చెలిమి విడచుచుంటి చిత్తగించి

మరలి పురికివచ్చి మామకాతిథ్యమ్మ
స్వీకరించుమా సశిష్యకముగ. 10

శాక్యసింహు డయ్యె జాత శత్రునృపాలు
వినతి నాదరించి వెడలి విందు
కుడిచి విశ్రమించ కూర్చుండగా నొక్క
వింత కథను తెలిపె నంతసమున. 11

"పూర్వకాలమునందు భూమీవరుండొక్క-
డడవిపక్షులమాంస మనినమిగుల
ప్రీతితో తినుచొక్క వేటగానిని వాని
పట్టితే నెప్పుడు పంపుచుండు
ఒకనాడు బోయవాడొగ్గిన వలలోని
మచ్చును గని తిన వచ్చుననెడు
భ్రాంతిచే నొకపెద్ద పక్షులగుంపందు
వ్రాలెను ముందున్న పక్షిరాజు

వచ్చిమేత కొఱకు వలలోతగుల్కొన
ప్రక్కపక్షులెల్ల పాఱిపోవ
నొక్క ఖగము భీతి దక్కివేవేగమే
వలను కొరికివేయ దలచి కూసె. 12

వేటగాడు తూపు వింటను సంధించి
కూయు పిట్టనెట్టె కూల్చె గాయ
పరుపనద్ది రాజుపక్షిని విడనాడి
పోవదయ్యె దిగులు పొందదయ్యె. 13

ప్రభువు కొఱకు మృత్యు భయమును విడనాడి
వేచియున్నదాని చూచి వేట
గాని గుండెకరగి కన్నీటితో రాజు
పక్షినురి సడల్చి వదలివేసె. 14

పక్షినేను గాయపడిన యానందుడు
తలపబోయ దేవదత్తుడగును
క్షాత్రవరుండజాత శత్రువే యని మతి
నమ్మవచ్చు నెల్లి దుష్మతికను. 15

బుద్ధదేవుని కథవిని బుద్ధివచ్చె
మగధసమ్రాట్టు నెమ్మది వగపుజెందె
ప్రాణభయమున కర్తవ్యపథము విడచి
చనిన శ్రమణులు కుందిరి మనమునందు. 16

అట్టిశిష్ట భక్తుడైన యానందుడు
భగవదాజ్ఞ మౌళిపై ధరించి
ధర్మబోధ కొఱకు తనజీవితంబెల్ల
ధారవోసె నిర్వికారుడగుచు. 17

## అశోకుడు

ధీరమతుండు మౌర్య జలధిం బ్రభవించిన పూర్ణచంద్రు డా
దారుడు విశ్వకంటక విదారుడు మేరుగభీర ధైర్యవి
స్ఫారు డశోకు డాతని విశాలమహాశ్మల చెక్కబడ్డదై
చేరెను బౌద్ధధర్మము విశిష్టతతోడ దిగంత వీధులన్. 18

చంద్రగుప్తుని మనుమడు పేంద్ర విభుడు
బిందుసార మహారాజ నందనుండు
రమ్య చరితుడ శోకవర్ధనుడు మగధ
సార్వభౌములలో సుప్రశస్తిగాంచె. 19

గత శతాబ్దాల చరిత నుత్క్రాంత నరయ
ప్రాచ్య పాశ్చాత్య సామ్రాజ్య భర్తలందు
సుప్రసిద్ధిని గనిన యశోకనృపతి
సాటి యా రాజు కనరాడు నేటి వఱకు. 20

తండ్రిపాలనమున తక్షశిలారాజ
ధానినేలె జనవితాన మెన్న
నాగి వనంతరమున నుజ్జయినీ రాష్ట్ర
పాలనంబు చేసె పాటవమున. 21

తండ్రి మరణాంతమునను * సోదరు నెదిర్చి
పాటలీపుత్రమున సింహపీఠమెక్కి
నేల వాల్గు చెరంగులు యేలె దీన
జనవితానము సానంద వనధి తేల 22

---

* అశోకునితో పోరిన సోదరుడు సుసీముడనబడువాడు.

తాత తండ్రులు సమరవిద్యాప్రవీణు
లై గడించిన విపులరాజ్యమ్ము చేత
చిక్కినను కూడ సంతృప్తి చెందబోక
పంతమును పూనె దక్షిణాపథము గెలువ. 23

బాడబుండు తృప్తిపడినచో చెడిపోవు
క్షత్రియుండు తృప్తిపడి నశించు
ననెడు సౌఖ్యమెఱిగి నట్టియశోకుడు
తరలివచ్చె నాంధ్రధరణి గెలువ. 2

చతురంగ బలయుతుండై
ధృతి నేతేరగ కళింగదేశాధీశుం
డతి సాహసియై పోరెను
ధృతకార్ముకుడై మహానదీ తీరమునన్. 25

రెండు కొండలెదిరి దండిగా డీకొను
చుండినట్లు పోరు చుండెనుభయ
సైన్యములు జయంబు సమకూరు నెవరికో
యెఱుగరాని యట్లు హీనముగను. 26

సంగరరంగమందసమ సాహసమున్ వెదచల్లు వైరిమా
తంగ వినాశకేసరులు దారదరిత్రులు నైనమాగధుల్
లొంగక పోరు శాత్రవుల రూపడగించుచు రెండు వత్సరా
లంగ బలంబు చూపి విజయంబును పొందిరి కీర్తికాములై. 27

ఆ రణరంగమందు విజయంబునుపొంది యశోకుడెల్లెడన్
పారెడు రక్తవాహినల పౌరజనావళి మృత్యుశోకముల్
మీఱు దరిద్రఘోష పరమేదినినెల్లెడ తాండవించ న
క్కారుణికాంత రంగుడు వికాసవిహీనహృదంబు జాతుడై. 28

రాజ్య తృష్ణఘోర రణ రక్త వాహిని
చేతగాని తృప్తి చెందదనుచు
నాకళించుకొనిన శ్రీకరుడ శోకుడు
ప్రతిన బూనె కత్తి పట్టననుచు. 29

నాటికే కళింగనాట వ్యాపించిన
బౌద్ధమతము నృపతి భావములకు
దోహదమ్ము జేసె దుర్వారవిక్రమా
టోపమెల్ల నడచి డుల్లిపోవ 30

విశ్వమందు ప్రేమ విత్తమ్ముతో సరి
తూగు కలిమిలేదు తొడరియట్టి
ప్రేమధనము విశ్వవీధుల వెదజల్లి
ప్రతిన బూనెమదిని పార్థివుండు. 31

భూతదయ మానవప్రేమ చేత నిఖిల
ప్రాణికోటికి సౌఖ్యసంపదఘటిల్లి
చేయ జాలిన ధర్మమీక్షితితలాన
బౌద్ధ మనియెంచె మగధభూ పాలవరుడు. 32

మధురానగర వాసి మహనీయుఁడు పగుప్త
డరుదెంచి మగధరాజ్యాధి నేత
సందేహములు తీర్చి వంద నీయంబైన
ధర్మదీక్ష యొసంగె దయదలిర్చ
నష్టాంగ మార్గము నాసక్తి తోకొని
ప్రియదర్శి నామంబు పెట్టుకొనిన
బిందుసారనరేంద్రు నందను డత్యంత
దీక్షతో బుద్ధ సందేశములను

పొరుగు దేశాలలో చాటబూని ధర్మ
నిష్ట నిష్ణాతులగు వారినేపుచేవ
లేక సంఘమ్ముగా జేసి హేతువాద
రీతి బోధించగా బంపె క్ష్మాతలమున. 33

ప్రాణికోటి భంగపాటును తిలకించి
విహ్వలించు బౌద్ధ భిక్షుకులను
కాంచి చేరిమ్రొక్కి గౌరవించని జీవి
కానరాదు నాటి కాలమందు. 34

శరధులను దాటి భిక్షుక
వరు లైరోపా జపాను వరకీమతమున్
తిరిగి ప్రబోధించిరి త
ద్ధరణింగల వరులు మోక్షధామము చేరన్. 35

ఖండ ఖండాంతరాల లోగల సమస్త
జనవితానము అష్టాంగసరణి యందు
నిలచి బౌద్ధమతంబు నౌదల వహించి
గణుతికెక్కెరి నాగరకతను పొంది 36

భూతదయా పరతంత్రత
చేత ఱాళ్ళనైన కరుగచేసెడు మతమా
రీతి నశోక నృపాలుని
చేతనను వ్యాప్తిగాంచె క్షితినెల్లెడలన్. 37

జగతి నేలుతాను మృగయావినోదము
మాని దేశమందు మాంస భక్ష
ణంబు తగనిదనుచు నఖిలజీవుల సమ
దృష్టిచూడుడనుచు తెలియజేసె. 38

జంతు బలులుచేయు జాతరల్ సంఘోత్స
వములు నరులనీతి పథమునుండి
నెట్టివేయుకాన నట్టి కార్యమ్ములు
సమసిపోవజేసె శాసనములు. 39

అడవి పక్షిగముల కాహారములు పెట్టి
పశుల కొఱకు వైద్య వసతి గూర్చి
నేలనేలు పుడమిపాలురం దాతదే
మొట్ట మొదటి వాడు పుడమిలోన. 40

పట్టుబట్టి కత్తి ముట్టక వైరుల
తేరిపార జూడ నేరనట్లు
రాజ్యమేలి నట్టి రాజులందాతడే
ముందువాడు రావియందు కూడ. 41

పరవినేటికెన్న సిరువదిపైమూడు
వందలేండ్లవెనుకబడి యశోక
చక్రమఖిల భరత జాతికి చిహ్నమై
వెగడు టమ్మనీషి నేర్పుతెలుపు. 42

భూమినేత సుతుడు క్షేమంకరుడు రాజ్య
ముజ్జగించి సంద్రమును గమించి
లంకకేగి నిష్కళంకాత్ముడై ధర్మ
బోధ కొఱకు తనువు పుచ్చెనచట. 43

అన్న వెంటయరిగి అత్యంత సుగుణాల
వాల సంఘమిత్ర కాలమెల్ల
జినుని ధర్మబోధ చేయుచువెచ్చించి
ధన్యయయ్యె లోకమాన్య యయ్యె. 44

సింహళాధినేత శ్రీయుతుండగు టిస్స
రాజు బౌద్ధమందు మోజు చూపి
కామ రహితుడైన క్షేమంకరునితోడ
చెలిమి నెరపి ధన్య జీవియయ్యె. 45

ఇతడు లంకనబుబదేడులు పాలించి
బౌద్ధమతము నందపార భక్తి
చాటి సుప్రసిద్ధ చైత్యముల్ కట్టించి
దానపతియటంచు దనరెభువిని. 46

జగతియందు శిల్పసౌందర్యముల నీను
కట్టడములకాట పట్టునాగ
పేరు గనిన అయ్యనూరాధపురిదాన
పతి యశస్సు తెలుపు నతులముగను. 47

లోక మాన్యుడగు నశోకభూపాలుండు
బౌద్ధ మతము పెంపు వడయుకొఱకు
పండితాళిబిలచి పరిషత్తుగావించి
తవియ జేసెరాజ ధానియందు. 48

ప్రియదర్శి నరపాలుని
నయజీవన సరణివాటి నతనాధులనే
దయనీయ ధర్మపధమున
రయమున వర్తింపజేసె రమణీయముగా. 4

తనసమస్తము బౌద్ధధర్మనువ్యాప్తికై
ధారవోయుచునుండి ధరణినేత
బుద్ధదేవుని జన్మభూమియు సుగతుడు
బోధించి మించిన భూములెల్ల

దర్శించి యెనలేని దానంబు లొసరించి
శాశ్వతోన్నత శిలాస్తంభములను
నెలకొల్పి వానిపై నిరుపమ ధర్మ సూ
త్రములను వ్రాయించి ధరణినరులు
నిత్య ధర్మరతులు సత్యహింసా ప్రియు
లగుచు వరలుకొఱకు విహారహర్మ్య
పాటు పడిన మేటి పాటలీపుత్రాధి
నేత దీక్ష నెన్న నెవరితరము. 50

జనకునితో యాత్ర సలుపగా యేగిన
చారుమతీదేవి సౌమ్యశీల
నేపాల భూమిలో నిలచి యింటికి రాక
కట్టించెనట దేవ పట్టణంబు
పశుపతీ నాథాఖ్య వెసగు గ్రామంబున
సన్యాసినీ జనాశ్రయము నొకటి
నెలకొల్పి వేలాది లలనల కత్యంత
ధర్మ దీక్ష లొసంగి తాను జీవి
తాంత మందె యుండి యనఘ సత్యాహింస
మార్గమందు జనుల మనలజేయు
చఖిల వనితలకును నాదర్శ నీయమౌ
సరణి బ్రతికి చేరె పరమ పదము 51

---

* అశోకుని సమకాలికుడగు టిస్సరాజు బౌద్ధమును స్వీకరించి వలుబదేడులు సింహళమునేలి దానపతియని పేరువడసెను.

తన కుటుంబమట్టు లెనలేని వైరాగ్య
మున చరించి త్యాగమూర్తులగుచు
మసలు కొన సతమ్ము మానవాధీశుని
స్వాంతసీమ సుప్రశాంతి బొందు. 52

జనపదంబులందు శాసన స్తంభముల్
నిలిపి మలచె పెక్కు నీతులందు
ప్రతిపదంబు జ్ఞాన భాండారమైయుండి
నాఁడు నేఁడు ముందు కూడ తనర. 53

తీర్థయాత్రలందు తిరుగుచు శ్రావస్తి
కరిగినపుడు భక్తి భరితహృదయు
డగుచు పూజచేసె నానందస్తూపమున్
జ్ఞానులకు సువర్ణ దాన మొసగి. 54

నిద్రయందు లేచి నిలుచుండునప్పుడు
కుడుచునపుడు బాట నడుచు నపుడు
ప్రజల సుఖము కొఱకు పరితపించిన ప్రియ
దర్శి నాటి ప్రజలు ధన్యతములు. 55

విశ్వ చరితమందు వేగుచుక్కను బోలి
కానగు న ఈ ఘన చరిత్ర
సాంతమెన్న నేనశక్తుఁడ ననిచెప్పి
ముందు కదుగువాడ మోద మడర. 56

---

అశోకుని తనయ చారుమతీదేవి భర్తయగు దేవభూపతి పేర నిర్మించినదే దేవపట్టణము.

## కనిష్కుడు

తిండి కోసము భారత దేశమునకు
వచ్చి నెలకొన్న యూచీల వరుసలోన
శౌర్యనిధులై తనర్చు కుషానులందు
నెగడె భరతోర్విరాజై కనిష్కుడొకడు. 57

అన్యదేశీయుడయ్యు బౌద్ధాభిమాన
మున చరించుచు విఖ్యాత పురుషపురము
రాజధానిగ సువిశాల రాజ్యమేలె
తన యశశ్చంద్రికలు దిగంతముల వెలయ. 58

గ్రీకుని శిల్పముంచి నిర్మింపజేసె
పురుష పురమున దారు గోపురమితండు
నాల్గువందల యడుగులున్నతిని చిత్ర
శిల్ప సంశోభితంబౌను చెన్నుమీఱ. 59

మానవీయ బౌద్ధ మతము మంగోలియా
వాసులకును అందజేసినట్టి
శుభచరిత్రు డితని నభినవాశోకుని
గా నుతించుచుండె గతచరిత్ర 60

ఇతని కాలముననె హీనయానము మహా
యానమగుచు విగ్రహాలపూజ
శాక్యమౌని నామ సంస్మరణమ్ముతో
సంఘ బుద్ధ ధర్మ సరణిపొందె. 61

బుద్ధమూర్తి దివ్యపూజార్థమై పెక్కు
దేవళములు వెలసె దేశమందు
హీన యానమందు లేనట్టి వైదిక
భక్తిమార్గమిందు ప్రబలదొడగె. 62

వాగ్విశేషవిదుదు నాగార్జునాచార్యు
డలరె తొలుత యితని కొలువునందు
అశ్వఘోషుడితని యాస్థానమున నుండి
బుద్ధ చరిత వ్రాసె మొట్ట మొదట. 63

ప్రఖ్యాతికెక్కినట్టి వసుమిత్రుడితని యా
స్థాన మందె ప్రబలె శాశ్వతముగ
చరకుడిందె వైద్యశాస్త్రము రచియించె
నని కనిష్క చరితమందు కలదు. 64

పూని కనిష్కుడు శ్రీవసంతకములో
కుండలి వనమందఖండ పండి
తాళిని రప్పించి స్తవనీయముగ బౌద్ధ
పరిషత్తు గావించి ప్రముఖుడైన
వసుమిత్రు దధ్యక్ష పదవిని వెలుగొంద
బౌద్ధసూత్రముల కప్పటికి తగిన
వైభాషి కమ్మను వ్రాయించె నది నేడు
చైనీయ భాషలో కాననగును

జినుని దంతమ్ములను కొన్ని సేకరించి
వజ్ర పేటికలందుంచి వైభవముగ
స్థాపిత మొనర్చి రమణీయ చైత్యముల వి
నిర్మిత మొనర్చిరీయాంధ్ర నేతలపుడు. 64

అంతియే గాక స్వీయ రాష్ట్రాంతరమున
శ్రీఘనుని శల్య ఖండముల్ సేకరించి
స్థూప మొక్కటి నిర్మించి భూపతులకు
మార్గ దర్శకుడయ్యె క్ష్మా మండలమున. 65

శాతవాహనులు

మూడు నాల్గువంద లేడుల పాటుగా
ధాన్య కటక రాజధాని నుండి
దక్షిణాంధ్ర భార తావని నేలిన
శాతవాహనులు ప్రశస్తి గనిరి. 6

క్రమముగావీరు దిగ్విజయము లొనర్చి
పశ్చిమోత్తర భారతోర్వరను గెలిచి
బౌద్ధ ధర్మాభిమానులై పరమతాల
వారి నాదరమున సాకిమీరినారు. 67

శాత వాహనాంధ్ర జగతీ తలేశుల
యందు శ్రీముఖుండనల్ప శౌర్యు
డై జయించె మగధ నలరు సుశర్మ కా
ణ్వాయన ద్విజులను హతమొనర్చి. 68

2. హాలుడు తదీయ వంశో
ద్వేల యశశ్చంద్రికలను దిగ్వీథులలో
గ్రాల శకపురుషుడై బహు
కాలం బాంధ్రోర్వి నేలె కవిపోషకుడై. 69

ఆ కాలంబున జగతిని
ప్రాకృత పైశాచికాది భాషల ఘనుడై
లోకఖ్యాతి గడించిన
శ్రీకరుడు గుణాఢ్యుడితని చే నుతుడయ్యెన్. 70

వర గుణాఢ్యసూరి విరచితమగు బృహ
త్కథను హాలనేత గౌరవించి
ప్రాకృతమున వ్రాసె ప్రాచీన నాగరి
త నెరింగి బుధులు నతులొనర్ప 71

ల నృపతి పిదప నలరె గౌతమిపుత్ర
తకర్ణి విపుల శౌర్యధనుడు
వన పహ్లావులను తవలేక యోడించె
విస్తృతాంధ్రలక్ష్మి విస్తరిల్ల. 72

సిక కార్లీ గుహాలం
పచరిత్రుని జయమ్ము లెంతెంతటివో
న ముఖమున వెల్లడి
మై సకలోర్వి జనాళి యఖిలనుతులందెన్. 73

వాని శైథిల్యములు వేడు కానసగుచు
నాటి శిల్పుల తులలేని పాటవమ్ము
బుద్ధదేవుని మహిమాను భూతిపొంది
చాటుచున్నవి జగతినీ నాటివఱకు. 75

అమరావతి యందొప్పెడు
కమనీయ స్తూపశిల్ప ఖండములు గనన్
భ్రమపుట్టి తెల్లదొరలవి
తమ దేశము నందుమాప తరలించిరొగిన్. 76

2. యజ్ఞశ్రీ బౌద్ధంబును
విజ్ఞులు మజ్జారెయనగ వెలయించుచు స
ర్వజ్ఞుని శుభ సందేశము
ప్రాజ్ఞులచే చాటజేసె పలుతెరగులుగా. 77

ఆర్య నాగార్జునాచార్యు నాదరించి
శ్రీగిరీంద్రముపై నివసింప జేసె
నీ నరేంద్రుడు పోషింప వేనవేలు
బౌద్ధ భిక్షులు వరలిరి భారతమున. 78

---

* 1. గౌతమీపుత్ర శాతకర్ణి క్రీ. శ. 133 మొదలు 154 వఱకు పాలించెను.

* 2. యజ్ఞశ్రీ క్రీ. శ. 172 మొదలు 205 వఱకు పాలించెను. ఈతడే శ్రీపర్వతమున నాగార్జునాచార్యునకొక సంఘారామమును నిర్మించి దానమొసంగెను.

ఆపగిది నెందఱెందరొ
భూపతులు తదీయవంశభూషణులు సువి
ద్యాపరులై బౌద్ధమత
వ్యాపనకై పాటుపడిరి వసుధాస్థలిపై. 79

ఫాహియాను

* ఫాహియానను చైనీయ పండితుండు
బుద్ధదేవుని యవతార భూమియైన
భారతావని దర్శింప ఘోరవిపిన
పథ పరిశ్రమలను సైచి వచ్చెనెల్లొ. 80

పెను తుపానులందు తనవజ్ర సంకల్ప
మును చలించనీక జినునిజన్మ
భూమి కనిన యోగిపుంగవు డెంతటి
ధన్యతముఁడొ జ్ఞాన తత్పరుండొ. 81

శాక్యసింహుని సందేశసారమైన
పిటకాత్రయ గ్రంథ సంపుటలు కొన్ని
మాతృ భాషలో విరచించ మనసుపుట్టి
అభ్యసించెను గీర్వాణ మతులనిష్ఠ. 82

కపిల వస్తువు మొదలుగా గలసమస్త
క్షేత్ర రాజిని దర్శించి శ్రీఘనుని వి
శిష్ట సూత్ర పిటకలను సేకరించి
ప్రస్తుతించెను భరత సౌభాగ్యమెల్ల. 83

ఆరేండ్లితఁడు భారత
ధారుణిలో సంచరించి స్వవసియింపై
మీరెడు సాంఘిక జీవన
మారసి కడువెరగు జెందియభివర్ణించెన్. 84

అనఘుడిట గాంచినట్టి వృత్తాంతములను
పూస గ్రుచ్చిన రీతిగా పొందు పరచి
పట్టు వలువలపై వ్రాసి తుట్టతుదకు
తొమ్మలిప్తను కలమెక్కె త్యాగజీవి. 85

ఇతని రచన భారతేతిహాసమ్మున
కమిత లాభకారి యగుచు నేడు
విశ్వ చరితమందు శాశ్వత స్థానంబు
భారతీయులకును కోరి ఇచ్చె. 86

స్మరణీయుండగు నీయతి
చరితంబా శాక్యమౌని చరణాంకితమై
తరణి హిమ ధాము లుండెడు
వరకట్టే నిలచియుండు వసుధాస్థలిపై.

హర్షుడు

అది చరిత్రను స్వర్ణమయంబొనర్చి
నట్టికాలము స్థానేశ్వరాధి పతుల

---

* పాహియాను క్రీ. శ. 413 ప్రాంతమున భారతదేశము సందర్శించవచ్చెను.

ధర్మపాలన దిగ్దిగంతముల నలమి
తీర్చిదిద్దెను భారత దేశమును. 88

గుప్త సామ్రాజ్య భానుడు గ్రుంకియున్న
అదనుగని భారతీయసంపదను దోచు
కొను విదేశీయుల నెదిర్చి మనుపజాలు
వీర కేసరి కనరాని కారణమున. 89

అహరహమ్ము హూణులరుదెంచి భారత
ప్రజను కొల్లగొట్టి పాడిపంట
లకు ప్రసిద్ధమైన రమ్యభూ భాగము
లాక్రమింప జొచ్చి రద్భుతముగ. 90

నాడు స్థానేశ్వరము నేలు నరవరుండు
ప్రథిత యశుడు ప్రభాకర వర్ధనుండు
సైన్యమును గూర్చి మాతృ దేశమును గావ
పార ద్రోలెను హూణభూపాల వరుల. 91

శ్రీకరుండైన ప్రభాకర వర్ధను
డస్తమించగనె జ్యేష్ఠాత్మజుండు
రాజ్యవర్ధనుడు ధరాతల మేలెడు
భారంబుగైకొన పగవహించి
హూణ శిలాదిత్యులూహించి యాతని
బావకన్యాకుబ్జ పాలకుండు

స్తవనీయ చరిత రాజ్యశ్రీ మనోనేత
యగు గృహవర్మ నన్యాయముగను
దునిమి రాజ్యమెల్ల దోచి రాజ్యశ్రీని
చెఱ గొనంగ క్రోధచిత్తు డగుచు
రాజ్యవర్ధనుండు రణమును ప్రకటించి
శత్రువులను దునిమి జయముగాంచె. 92

అన్న విజయమెరుగ నట్టి రాజ్యశ్రీ స్వ
యముగ శత్రువంజ రమున నుండి
పారిపోయి వింధ్య పర్వత ప్రాంతాట
వీ పథమ్ము పట్టె వెతల బడుచు. 93

అనిమొన పగతుర దునిమి సహోదరి
నన్వేషణము సేయుచరుగు చున్న
రాజ్యవర్ధనుని దురంబున నోడించ
తరముగాదని మది దలచినట్టి
కర్ణ సువర్ణ భూకాంతుడైన శశాంకు
డాతిథ్యమొసగి నెయ్యమున రాజ్య
వర్ధను బిలచి దుర్వ్యాపార చిత్తుడై
విషభోజనంబును పెట్టి చంపె

నది యెఱింగినట్టి పదిపదాలేదుల
ఖాలుడైన హర్షవర్ధనుండు

కత్తిదూసి ఘోర కదనంబులో శశాం
కుని వధించె శత్రుకోటి బెగడ. 94

ఏ తిక్కుతెన్ను కానక
సోదరి భయదాటవులను సుడిముడి పడుచో
భాధపడగు హర్షుడు సం
వేదనతో వెదుకనేగె విపినపథములన్. 95

వెదకివెదకి చాలవేసారి హర్షుడు
వింధ్య పర్వతాటవిని చరించు
నెలత జాడ నెరిగె "నిర్ఘటు"డను కోయ
దొర సహాయ పడగ తుట్టతుదకు. 96

హర్షుడేగువేళ కజ్జాయ తేక్షణ
బ్రతుకుపై నసహ్యపడి స్వయముగ
చితినిరగులజేసి శీఘ్రముగా జొచ్చి
తనువు దొరగు యత్నముననెయుండె. 97

అనల శిఖల జొచ్చునట్టి సహోదరి
నరసి కాచినట్టి అన్నగారి
సమ్మతమున బౌద్ధ సన్యాసినీ దీక్ష
గొనె విరక్త చిత్తమున కృశాంగి. 98

పదతినాటికెన్న పదియు నైదేడుల
బాలయయ్యు జ్ఞాన పటిమ వలన
తాను పొందియున్న దయనీయ జీవన
సరణిచే వివేక జలధియయ్యె. 99

కొదుగులేని భోగతతి కాలవాలమై
వెలయు నింట నెట్టితలపు లేక
బుద్ధదేవు పాదపూజతో తనశేష
జీవితమును గడపె పావనాత్మ. 100

అపైని హార్షభూపతి
దీపిత శౌర్యాగ్నితప్త తేజుండై పృ
థ్వీపతుల నెదిర్చెను యా
శాపరిమిత మైన సైన్య సంయుతు డగుచున్. 101

ఆ రేండ్లుత్తర భారత
ధాఱుణిపై గల విదేశ ధరణీపతులన్
టీకము సడల్చితోలుచు
భారత మాతకు స్వతంత్ర భాగ్యము గూర్చెన్. 102

అంతటితో తృప్తినందక హర్షుడు
దక్షిణాపధమెల్ల తనవశమ్ము
చేసు కొనదలంచి సేనాసమేతుడై
దాటబోవగ నర్మదాతటమున
హర్షుని సంగ్రామ యాత్రి నాలించిన
పులకేశి యంతకుమున్నె విపుల
సైన్యముతో నదీ సైకత స్థలియందు
విడిసి వైరులు చేరు వేళకపుడె

సమర సన్నద్ధుడై యుండి క్రమము దప్పి
వచ్చు రిపుకోటి నెదిరించి మచ్చరమున
పోరి విజయమ్ము గొన హర్షభూవరుండు
మరలి పోయెను వచ్చిన మార్గమునవె. 103

అదిమొదలు జీవితాంతము
కదనము తలపెట్టబోక కరుణాన్వితుడై
హృదయమ్మున సుగతుని మృదు
పదములనిడి యేలె ధర్మ పద్ధతివెలయన్. 104

కన్యాకుబ్జంబున క
న్యాన్యుడు తనరాజధాని మార్పించెను సౌ
జన్యతతో దీనులకే
యన్యాయము జరుగనీయ కరయుట కొఱకై. 105

ధరణివరుడు బౌద్ధ ధర్మాభిమానియై
పరమతాదరణ మరువ కనయ
యాదరించి మించె వైదికబ్రాహ్మణ
పండితులను కూడ భాసురముగ. 106

భర్తృహరి మయూర బాణ కవీంద్రులు
హర్షనృపతి కొలువునందు సతము
దివిజ వినుత మైన కవితామృతమ్మును
గురియజేసి కొనిరి చిరయశస్సు 107

అవనినేత సహజ కవితాప్రవీణుఁడై
కడుమనోజ్ఞ నాటక త్రయమును
వ్రాసి నాడు నేడు వసుధాతలమ్ముపై
గడనకెక్కె సుకవి గణములోన. 108

సమ్ముఖమున నల్పజంతు వొక్కించుక
కష్టపడుట గనిన కరగిపోవు
ప్రభువు సతముదీన పరిపోషణార్థమై
పరితపించు చుండు భావమందు. 109

ప్రాణిహింస మాంస భక్షణ తగదని
శాసనమ్ముచేసి సార్వభౌము
డాచరింపకుండు నట్టి నీచాత్ముల
దండితులను జేసెదయ దొరంగి. 110

అవనీశ్వరుండు కన్యాకుబ్జపురమున
నూరు చైత్యములు యినస్నారు దేవ
శములు వినిర్మించి క్రమము తప్పక నిత్య
పూజలు జరిపించు భూవరునకు
ఆదర్శసోదరి యైన రాజ్యశ్రీ వ
దాదరమ్మున నలహాల నొాపగ
పాలించుహర్ష భూపతి బౌద్ధ ధర్మనూ
త్రములు సంశోధింప దలచి మదిని

ధరణినెల్లి కడల వరలెడు భిక్షుక
తతిని పిలచి రాజధాని యందు
పూర్వ మెవ్వ రెరుగ బోనట్టి బ్రహ్మాండ
మైన సభను జరిపె మహితలీల. 111

హూవిత్స్యాంగన నొప్పెడు
చైనా భిక్షువును రాజచంద్రుండట స
న్మానించి సభాధ్యక్ష
స్థానంబున నిలిపెసూరి జన వినుతముగన్. 112

అతడు బౌద్ధధర్మ మందు నిష్ణాతుడై
స్వీయలక్ష్యములు వచించ హీన
యాన పండితాళి మౌనంబుగా వాని
జయము నొప్పుకొనిరి నయమెరింగి. 113

వేలకొలది బౌద్ధ భిక్షుకులకు స్వర్ణ
దానమొసగి భూమిధవుడపార
తత్త్వవేత్తలైన ధరణీసురుల గూడ
తనియజేసె సర్వ జననుతముగ. 114

హర్షభూమి వేత కాత్మీయమిత్రుడు
ధీర వంది తుడు కుమార రాజు
నృపతి వెంట తోడునీడయై తత్సభా
స్థలి నలంకరించె తగినరీతి. 115

అష్టాదశ సంఖ్యాయుత
శిష్టులు సామంతనృపులు సేవించగ నీ
సృష్టినిగల దీనుల సం
తుష్టుల గావించెరేడు తోషితరీతిన్. 116

హూనిత్యాఁగున కాభూ
జాని యనంతముగ రత్నసంపద లొసగెన్
గాని యతండందాక తృణ
మైనను గైకొనక విడిచె నాక్షణముననే. 117

పదునెనిమిది దినములకా
సదయుఁడు ఘన సభముగించి శాశ్వత కీర్త్య
భ్యుదయంబై వరియించగ
విదితమ్ముగ నర్థిజనుల వినతులు పొందెన్. 118

బుద్ధదేవుపాద పూజలో సర్వదా
మేను మరచిపోవు మానవాధి
నేత ధర్మనిష్ట చేత భూమిని స్వర్గ
ముగ నొనర్చి యేలె నగణితముగ. 119

ప్రతియైదు వత్సరములకు
క్షితిపతి ధనకోశమందు చేరిన సిరి నా
దృతితో సత్యోత్సవమున
క్షితి గల దీనులకొసంగు స్మితవదనుండై. 120

బౌద్ధ పరిషత్తు జరిపిన వత్సరమున
తనధనాగారమందున్న ధనము బుద్ధ
దేవుని పదాంకితము చేసి భూవరుండు
చేర్చెనది యెల్లను ప్రయాగ క్షేత్రమునకు. 121

అందు నెలదినమ్ము లాపైడి రాసులు
పంచిపెట్ట బౌద్ధ పండితులకు
ములకును వేద శాస్త్రార్థ విదులైన
హ్మణులకు దీన పరిజనులకు. 122

నొక నెల రోజులు
పతి నిరతాన్న దానములు జరిపించదన్
పంచలేక నిలిచెను
పరు లా త్యాగధనుని చూచి నుతింపన్. 123

ట్లు తనసమస్త మర్థులకిడి మహీ
వరుడు మగుడ బుద్ధ భక్తుడగుచు
మేనికావి కొంగుచించి యొసంగె
రాజసోదరియును. 124

వ్యంగపుడు మహీ
కతిథియై పవిత్ర సత్యోత్సవమున్
వేనోళుల వర్ణించుచు
మానవ లోకమున చాలె మహనీయముగా. 125

హర్షనృపతి జీవితాంతము వరకట్టి
దాని ధర్మ చింత దగిలియుండి
శాక్యమౌని నామ సంస్మరణమ్ము నే
మరక యేలె ధరణిమండలమును. 126

సమకాలీన కవీంద్రుడు
సుమహిత విఖ్యాతబాణ సుకవీంద్రుండే
క్రమమొప్పగ శ్రీహర్షుని
కమనీయ చరిత్ర వ్రాసె గద్యాకృతితో. 127

లోకమాన్యులౌ నశోక హర్షుల త్యాగ
శీలమెన్న కృషిక జీవినైన
నాతరంబె వారినామము లాచంద్ర
తారకమ్ము వెలయు ధరణియందు. 128

హూనిత్యాంగు

హూనిత్యాంగు కులీనుం
డైన గృహస్థునకు తనయుడై బాల్యమునన్
చైనా దేశమున మహా
యాన బౌద్ధమందు మేటి యని నెగడబడెన్. 129

అతడు శాక్యసింహు డవతరించిన యట్టి
భరత ఖండమందు ప్రముఖమైన
క్షేత్ర రాజినెల్ల సేవించి యోగ శా
స్త్రము పఠించ దలచె స్వాంతమందు. 130

చైనాప్రభువరు నాసతి
లేనిదె యానాడు యతులెవనిని వెలికే
రానీయని శాసన మీ
జ్ఞానిని భయపెట్టి నిలువ జాలనిదయ్యెన్. 131

శాంతధనులు సర్వసంగ పరిత్యాగు
లైన తత్వవేత్తలను నృపాల
శాసనములు నిశిత శస్త్రాస్త్ర బలములు
నిలుపగలవె? ధరణీ వలయమందు. 132

ఘనుడు తుట్టతుదకు భట్మాండ్సమర్ఖండు
అనుగమించి యిడుమ లనుభవించి
కడకు చేరుకొనెను గాంధార కాశ్మీర
ములను కాంచితనువు పులకరించ. 133

ఇరువది తొమ్మిది యేడుల
తరుణ భిక్షుకుండు సహజధైర్యము తోడై
పరిరక్షించగ భారత
ధరణికి చనుదెంచె నాతథాగతుని కృపన్. 134

క్రమముగా భారతావని గలసమస్త
బౌద్ధ క్షేత్రములందు ప్రసిద్ధులైన
పండితులగాంచి నిశిత వాగ్భండ నమున
విజయుడై పొందె నెనలేని విశ్రుతకీర్తి 135

ధారుణి నా నాడెంతో
పేరెన్నిక గనిన విశ్వ విద్యాలయమై
మారు నలందా కాశుభ
చారిత్రుడు చేరె ధీర సన్నుతుడగుచున్. 136

దానికధ్యక్షుడఖిల శాస్త్రములమేటి
శీల భద్రుడు విశ్వ విద్యాలయమున
రాజలాంఛన మైనమర్యాద నెరపి
గౌరవించెను కడలేని గౌరవమున. 137

ఆతడు యోగశాస్త్ర మెనిమిదేండ్లియ్యెడ
నభ్యసించు తరిని హర్షనృపతి
కోరివచ్చి పిలుచుకొని పోయె తన సభా
గారమందు నిలుపగా దలంచి. 138

హర్ష భూమినేత కతిథియై కొన్నాళ్ళు
ఉండి మగుడభరత ఖండమెల్ల
తిరిగి నాటదేశ చరితముకనులకు
కట్టి నట్లు వ్రాసె కౌతుకమున. 139

రాజ్య పాలనమ్ము ప్రజలయాచార సౌ
భాగ్య శీలములును యోగ్యులైన
పండితాళి శాస్త్ర పరిశీలనాసక్తి
వ్రాసి వినుతిజేసె భాసురముగ. 140

ఇకడు జన్మస్థలి కేగుచాడు కుమార
హర్షులు భక్తిప్రేమాతి శయత
విడువనేరక చాలవివశులై పదియోజ
నముల దవ్వేగి నినమ్ములగుచు
కౌగిట జేర్చి లోకమ్ముల నీరూర
వీడ్కోలొసంగిన వెడలి మాతృ
భాషలో భరతభూ భాగాన తాగన్న
వింతలనెల్ల సవిస్తరముగ

కావ్యమల్లి మూట కట్టుకపోయిన
గ్రంథములను నూరిగణము మెచ్చ
ననువదించె జీవితాంతము వఱకచం
చలిత మైన దీక్ష చొకళించ. 141

కైమోడ్పు

ఈవిధముగ నింకెందఱొ
దీ విభవులు తొల్లి బుద్ధదేవుని పదరా
జీవమ్ముల నర్చించుచు
పావనులై వారు మోక్ష పథ యాత్రికులై. 142
ఇరువదైదు వందలేండ్ల నుండియు మహీ
వలయమందు ధర్మపథము నిరుప
మాన మోక్షధనము మానవ జాతికి
పంచి యిచ్చుచుండె నంచితముగ. 143

కొపపుడమి జనులలోన మూడవవంతు
మానవాళి బౌద్ధ మతమునందె
జీవితములు గడపి శ్రీఘనుని మహస్సు
వినుతి సేయుచుండు ననుదినంబు. 144

జగతిలో నితాంత శాంత్యహింసా ధర్మ
వేదియైన హేతువాద సరణి
మౌళి దాల్చినట్టి మహనీయ భారత
ప్రాభవమ్ము భువిని ప్రబలుగాత. 145

# శ్రీ బుద్ధగీత

## యమక వర్గము

### శ్రావస్తి - మట్టుకుండలితో

త్రివిధ కర్మలందు తవిలియుండు మనస్సు
బండిలాగు యెద్దు పాదములను
చక్ర మనుకరించు చందాన వెన్నంటి
పాప మతిని దు:ఖపరచు చుండు. 1

మలిన రహిత చిత్తకవితుండు యెవ్వడో
వాడు కర్మరతిని వీడకున్న
నరునివెంట నంటి నడచు నీడను బోలి
సుఖము వెంబడించు చుండు భువిని. 2

శ్రావస్తి - ధుల్లితియను వృద్ధ భిక్షువుతో

నన్నుకొట్టెతిట్టె నని యెవ్వడెంచునో
వాని వైర మెప్పుడు మానబోదు
నన్ను కొట్టెతిట్టె నని యెవ్వడెంచడో
వానివైర ముడుగు వరలుశాంతి. 3

శ్రావస్తి - కాలీ యనువానితో

ఈజగమ్ము నందు యేకాలముననైన
వైర ముడుగ బోదు వైరమునను
వైర మణగ ప్రేమ వలయు సనాతన
ధర్మ మిద్ది భూత ధాత్రియందు. 4

కోసంబిక - భిక్షువుతో

ఏక్షణమున నైన సీమేను జగతిని
వదలి పోవవలసి వచ్చుబెదమ
యెరుగకజ్ఞుడుండు నెరిగిన ప్రాజ్ఞుల
లో. మనోమలంబు లోగి పోవు. 5

శ్రావస్తి - మహాకాలునితో

దృశ్యవిషయలోలు తిండిపోతు ప్రయత్న
హీను శక్తిలేని వాని జేసి
చేవలేని చెట్టు చేజిక్క పెనుగాలి
చదిపినట్లు చేయు మదనుసేన. 6

శ్రావస్తి జేతనము - దేవదత్తునితో

దృశ్య విషయ వాంఛ తెగిచిన శమనేంద్రి
యుండు కార్యతత్పరుండగుటను
గట్టులేని గాలి కదలింపలేనట్లు
మారుడేమి చేయ నేరడిలను. 7

రాగమాది చిత్తరోగముల్ వీడక
కావికట్టువాడు ఘనుడు కాడు
అంతరంగ మలిన మడుగంట జేసిన
యతడు కావి తాల్ప సర్హుడగును. 8

శ్రావస్తి - నందభిక్షువుతో

వేడ్పుమెరయ కప్పునేయని యింటిలో
వాన కురియునట్లు వాంఛలుడుగ
చేయలేని వాని చిత్తంబులో విష
యేచ్ఛలుదయ మంది యెదుగుచుండు. 9

శ్రావస్తిజేతవనము - ఇరువురుమిత్రులతో

చాలగ్రంథములను చదివి ధర్మము నాచ
రించ కుండు వాడు యెంచిదూర
పరుల గోగణమును పరికించు గొల్లని
గతిని సాధుజనుల నుతికి తగడు. 10

కొలది చదువు చదువు కొన్నను ధర్మాభి
రతిని ముక్తచిత్తుడితరులకు స
దా సహాయ పడుచు దానిచే నిరతిశ
యాంతరంగ శాంతి నంది వెలయు. 11

లోకవర్గము

జేతవనము - అంగుళీమాలునితో

మొదట తప్పుచేసి మదినెంచి కుందుచు
మరల చేయనట్టి మానవుండు
మబ్బు ముసుగు బాసి మసలు చందురుకీతి
వెలయగలడు భవన వీథులందు. 12

రాజగృహవేణువనము - అభయరాజకుమారుడు

క్షణములో మారిపోవుచుండిన జగమ్ము
నీటి బుడగ మరీచికా నీరమట్లు
మిథ్యగానెంచి మెలగెడి మేటి నెపుడు
కాలపురుషుడు దరిజేర జాలకుండు. 13

జేతవనము - మువ్వది భిక్షువులు

ఎవడు తన పాపకర్మ లహీన పుణ్య
రాజిచే కప్పివేయునో యీ జగాన
వాడు వెలయింప జేయు దిగ్వలయమెల్ల
జలద మాలా వినిర్ముక్త చంద్రురీతి. 14

జేతవనము - ఐదువందల భిక్షువులతో

తామసము వీడి ప్రవిమలో త్సాహగరిమ
సత్యధర్మాభి రతులైన జనులు ఇహ ప
రములలో కూడ శాంతి సామ్రాజ్యసౌఖ్య
మనుభవించుచు నుండెదర హరహమ్ము. 15

జేతవనము - నమ్మజ్ఞాని వృద్ధభిక్షువుతో

మూర్ఖుల జ్ఞాను లెయ్యది మోజు పడుచు
విడువనేరరో ! దానినే విడచి జ్ఞాను
లడుగు చుందురు సతము చిత్తరువులోని
రాజవీధిని కనినట్లుగా జగాన. 16

జేతవనము - చించనితో

గగన మున నేగు రాయంచ గతిని బుద్ధి
బలముచే యోగి యాకాశ పథము పట్టి
చనెడు రీతిని మదనాసు చరుల నణచి
ధీరుడేగును నిర్వాణ తీరమునకు. 17

జేతవనము - అనాధపిండికుని పుత్రమరణసందర్భమున

బుద్ధు డమరలోక లబ్ధుడు కాబోడు
మూర్ఖు డరసి దానమును ప్రశంస
చేయలేదు ధీర చిత్తుడేదాతయై
స్వర్గలోక మరిగి సౌఖ్యపడును 18

భూతలాధి పత్యమున కంటె నాకమ్ము
నేలు కొనుట కంటె చాల రెట్లు
మాటి జన నుతమ్ము * స్రోతాప త్తి ఫ
లమ్ము సాటిలేదు సుమ్ము భువిని. 19

జేతవనమున - అలవీఅనువానితో

ఈలోకం బజ్ఞానమయం
బీలోకులలోన సత్యమెరిగిన భక్తుల్

చాలా తక్కువ వలబడి
మూలుగు పక్షుల విధానముగ నెల్లపుడున్.

బుద్ధవర్గము

ఉరువేల - మాగన్దియ బ్రాహ్మణునితో

స్థిరజయమ్ము పొంది ద్వేషాదులను చెండి
మనుజ మేధ తెలుసు కొనగ జాల
నట్టి దివ్య పథము నంద ప్రమేయుడై
వెలయు బుద్ధు నెరుగగలవె ? నీవు ! 21

విశ్వమును గ్రసించి వేయజాలిన తృష్ణ
ఎవని చేరలేక నవసిపోయె
నట్టి విశ్వమయుని ఆద్యంత రహితుడై
వెలయు బుద్ధు నెరుగ గలవె ? నీవు ! 22

కాంస్య నగరమున - దేవమనుజులతో

ధ్యానులు నిష్కర్మోన్నత
మానసులు ప్రమత్త రహిత మాన్యులు బౌద్ధుల్
కానబడినంత దివిజుల
నూనంబగు పిగ్గుచేత నాగిలెద రెదలన్. 23

జేతవనము - ఆనందునితో

మనుజ జన్మ పూర్ణమగు నాయువును ధర్మ
నిరత శ్రవణమనన నిష్ఠ కలిగి
యుండు టయును సురుచిరోత్తమ జ్ఞానులై
ప్రభవమందు టరు దవసుధయందు. 24

పాపలేశమున్న పనిచేయకుండుట
సతతము పుణ్య కార్యరతినెసంగి
యుంట చిత్తశుద్ధి యొప్పారగాంచుట
మూడు విధు లెసంగు బుద్ధులందు. 25

చింతాక్రాంతుడైన భిక్షువుతో

ధనము వర్షించినను కూడ మను జతతికి
శాంతినీయదు, స్వర్లోక సౌఖ్యములను
హేయముగ నెంచి బుద్ధాను యాయులెదల
తృష్ణ కవకాశ మీయరు ధీయులగుట. 26

అగ్నిదత్తుడను బ్రాహ్మణునితో

భయము వలన నరుడు పర్వత వనవృక్ష
ములను గొలుచు చుండు చలనమంది
వాని నమ్ముకొనినవాడు శాశ్వతదుః
సముద యమును దాటి శాంతి కనదు. 27

ప్రమాదవర్గము

కౌశాంబి ఘోషితారామమున - సామవతిరాణితో

సతతధ్యాన పరాయణ
యుత విజ్ఞల శేషధర్మ యుతులై శ్రమణ
వ్రతులై నిర్వాణ పథాం
కితులై విహరింప చంద్రు కేవల మూర్విన్. 28

## చిత్తవర్గము

### చాలిపర్వతమున - మేఘియునితో

శీఘ్రచలన చపల చిత్తమున్ మేధావి
అదుము కొన దలంచు నవస రమున
అమ్ము మొనను చేయు కమ్మరి మది వలె
విశ్చలాంత రంగని హితు డగును. 29

నీటబ్రితుకుచేప నేలపైబడ కొట్టు
కొనిన యట్లు మదను మనకరించు
వాడు రాగహీన ధీరమార్గము పట్ట
తల్లడిల్లుచుండు రెల్లవేళ. 30

### శ్రావస్తియందు - మేఘియునితో

విశ్వమున చరించు విద్యుల్లతను మించు
శీఘ్రగతిని నరుని చిత్తవృత్తి
నిగ్రహించ బడిననేకాని నిర్వాణ
సౌరభంబు పొంద జాలరెవరు. 31

### శ్రావస్తి - ఒక భిక్షువుతో

ఎగిరి పట్టు కొనుట కేరికి సాధ్యము
కాని మదివి ధైర్యమూని నిలుప
బడిన చిత్తమందె ప్రవిమలా మోఘ సౌ
రభము వరలు చుండు భ్రమనశించు. 32

శ్రావస్తి — సంఘరక్షితునితో

హృదయ గుహవసించి యేకాకిగా సర్వ
లోకముల చరించి బీకు పరచు
చిత్త మద్ది వశము చేసిన మారుని
బలము ద్రొల్లు జన్మ బంధములగు. 33

శ్రావస్తి - విశాఖఅను ఉపాసకురాలితో

పూవు వన్నెగలిగి తావిలేని విధాన
మాటలందు నీతి తేటపరచి
చేతలందులేని జీవన్మృతుల వ్యర్థ
భాషణములు నరక భూషణములు. 34

పుష్పరాశినుండి పూలమాలలనేక
మల్లజాలినట్లు అవనియందు
తనువుదాల్చినట్టి మనుజుండశేష స
త్కర్మ రతిని బ్రతుక ధన్యుడగును, 35

రాజగృహవేణువనమున - మహాకాశ్యపునితో

వాయు వేగమునకు వశపడి పూచంద
నాది సౌరభములు మోదమిడును
కాని సుజను సుగుణ ఘన సౌరభంబులు
వివిధ దిశలయందు విస్తరిల్లు. 36

శ్రావస్తియందు - విపక్షక భిక్షువులతో

మేను ముట్టకుండగా నెరింగి మనోపు
రాంతరమున ప్రజ్ఞనాయుధముగ
మానిపోరి జయముపొందిన ముక్తుడు 37

స్వీయ రక్షణమ్ము చేసుకొనడు.

కోసల దేశమున - సోరయ్య అను భిక్షువునితో

తాతతల్లి తండ్రి జ్ఞాతులు చేయగా
లేనిమేలు నీకు నిత్య సత్య
ధర్మ నిష్టయందు తనరు చిత్తమొనంగు
సూరిలోక వినుత సుప్రశాంతి. ౩౮

## పుష్పవర్గము

శ్రావస్తి - కోసియ వ్యాపారితో

గాఢనిద్ర నున్న గ్రామవాసుల నెల్ల
వాగువరద ముంచి వైచినట్లు
సతి సుతాను రాగ యుతుడైన మనుజుని
మృత్యు వొడిసిపట్టి మ్రింగివేయు. ౩౯
పూవు కందకుండ పుష్పసారముగ్రోలి
మరలి పోవునట్టి మధులిహంబు
పొలుపుతోడ మౌని వెలయుచు గ్రామసీ
మలనుసంచరించు మహితలీల. 40

శ్రావస్తి – పాఠికసాధుపుతో

పరులు పగవహించు పనిచేయబోకుము
పరుల చేష్టలందు మరులు కొనకు
స్వీయ కార్య నిహిత చిత్తమునే సదా
మనన చేయు మోయి మానసమున. 41

## బాలవర్గము

### శ్రావస్తి - దరిద్రసేవకునితో

కన్ను మొగడకున్న కడుదీర్ఘమౌరాత్రి
అలసియున్న మైలు ఆమడగును
సత్యమెరుగ కున్న సంసారమతి భయం
కరముగాదె ? మూఢనరుల కెప్పుడు. 42

### రాజగృహమున - దరిద్రసేవకునితో

తనకుతగిన జ్ఞాని తారసిల్లకయున్న
మనుజుడొంటిగానె మనుటొప్పు
కాని తాడినీడ గని విశ్రమించుట
వంటి దగును ఖలుని వెంట యుంట. 43

### శ్రావస్తి - ఆనందునితో

నాకు సుతులు కలరు నాకుండెధనమని
తలచువాడు దుఃఖ కలితుడగును
తనువు తనది కాదు ధనధాన్య సంతతి
తనవి యెట్టులగును తలచిచూడ. 44

### జేతవనమున - గిరిహటక చోరునితో

అజ్ఞుడైనను తన యజ్ఞత్వమెరిగిన
ప్రాజ్ఞుడై ధరిత్రి వరలగలడు
అజ్ఞుడయ్యు కూడ ప్రాజ్ఞుండననియెంచు
చుండువాడు మూర్ఖమండనుండె. 45

శ్రావస్తి - జేతవనమున - ఉదాయితో

గరిటె యన్నరసము నెఱుగజాలని రీతి
జీవితంబు విబుధ సేవయందు
వెరసియును వివేకపరుడు కానేరడు
మలినహృదయుడైన మానవుండు. 46

శ్రావస్తి - జేతవనమున - భద్రవర్గీయులతో

నాల్క యన్నరసము నంటిన నేపొంగి
పోవునట్లు సుగుణ భాషణుండు
స్వల్పకాల జ్ఞాని సంసర్గ బలముచే
ధర్మపథమెరింగి తనిసి పోవు. 47

జేతవనము - ఉప్పలవణ్ణాయను భిక్షురాలితో

పాపకర్మ ఫలము పండి పైబడుదాక
తేనె రీతి పాపి తినుచునుండు
కొనకు పాప ఫలిత మనుభవ మైనంత
ఘోర దుఃఖ వనధి కూలి కుములు. 48

రాజగృహమున - జంబుకుడను సాధువుతో

అజ్ఞుడనవరత * కుశాగ్రాన్నమును తిను
చుండియును వివేకి సుఖములోని
షోడశాంశమైన కూడ పొందగలేదు
నమ్ము వివర మెరిగి నెమ్మనమున. 49

రాజగృహవేణువనమున - నవ్వుబుద్ధునితో

విషము ఫలిత మిచ్చి వేయుపాపములనే
దుష్ట బుద్ధిచేయు విష్టతోడ
దాని వలన తుదకు తనకు తానే శత్రు
వై యుండు శోకవనిధి మునుగు. 50

వేణువనమున - సుమనతో

దేనివలన దుఃఖ దీనాశ్రు ధారల
జాన గురియు నట్టి పాపకర్మ
చేయరాదు శాంతి దాయకమౌ దీన
జనవితాన సేవ సలుపుటొప్పు. 51

రాజగృహవేణువనమున - అహిపేరునితో

అపుడె పితికి తెచ్చినట్టి క్షీరము రీతి
మలిన కర్మ వేగ మారబోదు
నివురు గప్పియున్న నిప్పుగా లోలోన
పొంచి పాపియెద దహించగలదు. 52

---

* బుద్ధుని కాలమందు భారతదేశమున కర్మకాండ విరతులనేకు లుండిరి. వారు నెలనెలకు శ్రార్ధతర్పణాదు లొనర్చునపుడు భోజనమును దర్భలచే మంత్రపూర్వకముగ స్పృశించు చుండెడివారు. చిత్తశుద్ధిలేక కేవలము కర్మకాండలయందే యాసక్తి గల్గియుండు కర్మిష్ఠుల గూర్చియే బుద్ధదేవుడిట తెలిపి యుండెనని గ్రహించునది.

### రాజగృహవేణువనము - సట్టి కూటునితో

కలుషచిత్తు లౌకికజ్ఞాన మాతని
పతనమునకె పాయ పడును కొనకు
వాని ప్రజ్ఞనదియె వదలించి శుద్ధాంశ
మును తొలంగ జేయు పుడమి యందు. 53

### జేతవనమున - తిస్సునితో

లోక సుఖయశస్సు లొసగు మార్గము వేరు
పరము నొసగు బౌద్ధ పథము వేరు
గా నెరింగి భిక్షుగణము లౌకిక గౌర
వముల కొఱకు మోజు పడగరాదు 54

## పండితవర్గము

### జేతవనమున - రాధునితో

ధరణి గర్భనిధుల నెరిగెడు వరరీతి
పరుల దోష మెరుగు భవ్యశీలు
చేరి పరమ భక్తి సేవించు వారికి
శ్రేయమబ్బు కీడు చెంద దెపుడు 55

### జేతవనమున - అస్సజీ - పునర్వసులతో

సదుపదేశకుండు విదిత ధర్మజ్ఞుండు
కాని పనులుచేయలేనివాడు
మంచివారికెపుడు మాననీయుండయ్యు
నజ్ఞులైన వారి కప్రియుండు 56

జేతవనమున - ధమ్మునితో

చెడు వర్తన గల పురుషుల
కడకరిగి చరింపరాదు కడు నేడుపుతో
పుడమిని గల నయ శీలుర
తడవిపట్టి కొలువ మోక్ష ధనమబ్బునుబో 57

జేతవనమున - మహాకప్పినునితో

నిర్మలాత్ము లెపుడు ధర్మామృతముదాగ్రివి
ఖేదరహితులై సుఖించు చుందు
రప్రమేయమైన యార్యోపదిష్ట ధ
ర్మమున కన్న దొడ్డ మార్గమేది. 58

జేతవనమున - భద్దియతో

ఘన నగంబు వాయు గతికి లోగనియట్లు
పండితులు వివేక వంతులగుట
నిరత మవని జనుల నిందాస్తుతులు విని
పొంగి విచలితాంత రంగులవరు. 59

జేతవనమున - కాణమాతా

ధర్మ మెరిగినట్టి నిర్మలస్వాత్ములు
కలుష రహిత హృదయ కమలులగుచు
వరసరోవరమున తిరుగు హంసల రీతి
నెంచు చనిన శాంతి పొందగలరు. 60

జేతవనమున - అయిదువందల భిక్షువులతో

మంచి వారు భువిని సంచరించుచు కూడ
వులుము కొనరు విషయ భోగములను

తల్లడిలరు కష్ట దశవచ్చి పైబడ్డ
మురిసిపోరు సౌఖ్యములు లభింప. 61

ధర్మరహిత కలుష తత్పరత్వమువీడి
పుణ్య కార్యరతిని పూని నెరపి
ఆశ దొల్లిపోవయు నికేతనుండౌను
తిరుగవలె భిక్షు దేశమందు. 62

భోగ కాంక్ష మదిని పొడమగానీయక
చిత్తమలిన ములను చెండివైచి
నిత్య శుద్ధితోడ నెగడెడినిర్వాణ
పథికుడెవడొ వాడె పండితుండు. 63

ఆహారమును పరిగ్రహాసక్తి విడనాడి
పూని బుద్ధ ధర్మమును వరించి
వెలయువాడు దివిజ వినుత నిర్వాణము
పొంది వరలు చంద్రుపో జగాన. 64

## అర్హత వర్గము

### రాజగృహమున - జీవకునితో

తొలుత తృష్ణనణచి దుఃఖవార్ధి దాటి
పరమ మోక్షసుఖము మరిగినట్టి
శ్రమణుల హృదియందు సంశయముండునే
పగటివేళ తిమిర పటలి కలదె ? 65

### రాజగృహవేణువనమున - మహాకాశ్యపునితో

హంస నీటిపట్టులందు నిల్వనిరీతి
అర్హతులు గృహాంతరాల యందు

నిలువబోరు కాంక్ష నేమాత్రముంచక
విశ్వనిలయములగుచు వెలయు చుంద్రు. 66

జేతవనమున - వేలట్ఠిసేనునితో

గగన వీధిపక్షి గమిలక్ష్యమును బోలి
అవనివస్తు సంచయము నెరుపని
శ్రమణకోటి సూక్ష్మ సంకేతశాంతిని
అజ్ఞుడెట్టు లెరుగ నర్హుడగును. 67

శ్రావస్తి - పూర్వాశ్రమమున మహాకాత్యాయనునితో

చిత్తమలినములు నశించి నిర్వాణ తీ
రమ్ము గనినవారి లక్ష్యము లను
ఆకసము వనేగు అండజయూధ సం
గతి నెరింగి తెలియ కష్టమగును. 68

సారధి మదినెరిగి చను గుఱ్ఱముల రీతి
నింద్రియంబు లుండ నెవడు దేహ
మోహ రహితు డగుచు పుడమిపై మసలు నో
వాని దివిజులెదల ప్రస్తుతింత్రు. 69

జేతవనమున - సారిపుత్రునితో

సువ్రతాత్ము డలరు సుస్థిర నగమట్లు
పుడమి రీతిక్షోభ పొంద బోడు
నిండి తేరు కొనిన నిర్మల జల సరో
వరము పగిది నలరు వాంఛలుడిగి. 70

జేతవనమున - రేవతునితో

గ్రామ మైన వనము ఘనశైలమై నను
లోయ నైన నీటి పాయనైన
ఆదరమున చేరి యర్హాతులుండెద
రో యదే ! పవిత్రమోయి భువిని. 71

జేతవనమున - అరణ్యక భిక్షువుతో

నరులు మసల లేని వరకాన నములలో
భోగవాంఛ లేని పూత చరితు
లగుటచే విరాగరాజి చరించును
మోదపడుదు రెదల ఖేదపడక. 72

సహస్ర వర్గము

జేతవనమున - కుండలకేశితో

అర్థరహిత శబ్ద వ్యర్థగాధల కన్న
వినివ చిత్త శాంతి వెలయ జేయు
మాటమేలు గొప్ప పోటరి కన్నను
చిత్తవిజయుడైన నుత్తముండు. 73

జేతవనమున - అర్థపుచ్ఛకునితో

అన్యులను జయించు టబ్బురంబదికాదు
తన్నుదా జయించు కొన్న యెడల
తెంపుతోమరుండు దేవగంధర్వుల
కూడి వచ్చిపోర నోడిపోవు. 74

జేతవనము - సారిపుత్రునితో

నేమమున సహస్ర హోమక్రియలవల్ల
గలుగు ఫలము కన్న ఘనతరంబు
సుశుచి రాత్ముడైన శుద్ధాంత రంగుని
క్షణము పూజచేయ జాలుదేని. 75

పుణ్య ఫలముగోరి పుడమిలో యేడాది
హోమ మాచరింప నొదవు ఫలము
శిష్ట ధర్మనిరతు సేవించ నబ్బెడు
ఫలము ముందు నరకభాగమగును. 76

అరణ్యకుటి - దీర్ఘాయువుకుమారునితో

వందనార్హుడయ్యు వాసిగా జ్ఞానుల
సేవచేయు వాని క్షితితలాన
బలసమృద్ధి శాంతి కలిగి పూర్ణాయువు
వెలయునా వచస్సు వినుకుమార 77

జేతవనమున - కోసంగితో

నూరు యేండ్లువనిని నిరతాగ్నిహోత్రివై
బరగుచుంటకంటె పావనాత్ము
డైన ముక్తచిత్తు నరసి ముహూర్త కా
లమ్ము కొలువనబ్బు నతుల ఫలము. 78

జేతవనమున - సప్పదాసునితో

సోమరియు ప్రయత్న సామర్థ్య హీనుడై
వందయేండ్లు బ్రతుకు వానికన్న

ధీరవినుతుడైన పారమార్థిక జీవి
ఒక్కపూట బ్రతికి యున్న మేలె ? 79

పటాచారయను భిక్షుకురాలితో

అను దినంబు మారి చనుదృశ్య వితతి య
నిత్య తత్వ మెరుగ నేరనట్టి
దీర్ఘ జీవికన్న, తెలిసిన విబుధుడు
ఒక్కపూట బ్రతికి యున్న మేలె. 80

## పాప వర్గము

జేతవనమున - ఏకసాటకునితో

పుణ్య ఫలిత కర్మములు నెమ్మదిగ చేయ
హృదిని మలిన చింత వదలబోదు
వేగసుకృత కర్మ వితతినే జేయుము
పాపచింత మదిని దోపకుండ. 81

జేతవనమున - అనాధపిండికునితో

పాపకర్మ పండి ఫలమిచ్చునందాక
పాపి కూడ లాభ పడుచునుండు
కానక పాప ఫలిత మనుభవమైనప్పు
డంతులేని దుఃఖమనుభవించు. 82
సుకృత కర్మ పండి చుట్టుముట్టెడుదాక
పుణ్యమూర్తి కష్టములనె పొందు
కాని పుణ్య ఫలము గణనీయమై నంత
సుప్రశాంతి యతని చుట్టియుండు. 83

లాజదేవునితో

ఒక్కమారు పుణ్య మొనరించి విడువక
అనుదినంబు చేయ జనుడు భువిని
పుణ్యకార్య రతిని పూని జీవించెడు
వానికంటె ఘనుడు వసుధలేడు. 84

మహాధనుడను వర్తకునితో

ధనికు డభయమైన దారిని చనురీతి
బ్రతుకుమీద మోజు పడెడివాడు
వెరచి విషముపేరు విననొల్ల నట్లుగా
పాపములకు వెరువ వలెనరుండు. 85

జేతవనమున - విలాపాతుడను వర్తకునితో

అద్దినాకు లభ్యమగువాకో యని యెంచి
చింతపడక మంచి చేయుటొప్పు
నీటిబొట్లురాలి నిలచి కుండను నింప
పూర్ణ ఘటము నిండిపోవ గనమె ? 86

జేతవనమున - కోకుడను కుక్కలవేటగానితో

కరము మీద చిన్న కురుపులేక విషంబు
తగిలి హానిచేయ దగని యట్లు
పాపచింత హృదయ పద్మమం దంటని
వాడు భువిని దుఃఖ వశుడుకాడు. 87
వాయుగతికి యెదురువైచిన దుమ్మెల్ల
విసరి వట్టి వాని ముసురు కొనును
శుద్ధ నిర్మలాత్మచూచి నిందించెడు
వాడు మునుగు పాప వార్ధియందు. 88

తిస్సడను వృద్ధ భిక్షువుతో

కొందరు జీవులు గర్భము
సందుప్రవేశింత్రు కొందరరుగుదురు దివం
బందుండగ నిర్వాణము
పొందుదురిల చిత్తమలినముడిగిన వారల్. 89

కపిలవస్తు న్యగ్రోధారామమున – సుప్పబుద్ధునితో

ఆకసమున కాని యంబుధిలోకాని
కొండబిలము చొచ్చియుండికాని
మృత్యు బారినుండి నిత్యుడు కాలేడు
దేహధారి ధర్మ దీక్ష గొనక. 90

దండవర్గము

జేతవనమున – భిక్షుకులతో

కత్తివాయి మృత్యు గహ్వరమన్నను
భయము చెందనట్టి వాడులేరు
పరుల తనను వోలె పరికించు వారల
చంపరాదు ధిక్కరింపరాదు. 91

జేతవనమున – బాలురతో

శాంతి కోరి బ్రతుకు సాటిజీవుల పట్టి
స్వాంతసుఖము కొఱకు చంపబూన
కెవడు పరుల సుఖమునెప్పొద్దు కోరునో
వాడు చచ్చి మోద వనధిదేలు. 92
చేతి కత్తియనిన భీతిచెందెదరెల్ల
వారు తనువుమీది వాంఛ వలన

కొన సాటివాని గౌరవమ్మున జూచి
మంచి చేసి యాదరించు టొప్పు. 93

జేతవనమున – కుండలధానునితో

విరిగియున్న గజు తిరిగి యతుకనిరీతి
నీవు మౌన శాంత నిష్ఠనున్న
నిఖిలలోకవినుత నిర్వాణమబ్బును
అపుడు లోకకలహ మంతరించు. 94

నిందలాడి యొరుల నిందింప నీచువాడు
నిందచేయ శాంతి నీకు రాదు
పరుష సూక్తు లెప్పుడు పలికిన నావినే
వంచనమ్ము చేయు వంచితముగ. 95

జేతవనమున – బహుభిక్షునితో

బట్ట కట్టకున్న భస్మంబు మైబూసు
కొన్న తిండితినక యున్న జడలు
దాల్చియున్న నరుడు తరియించ నేరడు
కోరికలు నశించి పొరువలకను, 96

జేతవనమున – సంతతితో

శాంతి దాంతి నియమసంపద బ్రహ్మచ
ర్యంబు భూతదయయు దండరహితి
వర్తమందె ధరణి బ్రాహ్మణుడగుగాని
బాహ్యవేషధారి బ్రాహ్మణుండె. 97

జేతవనమున – పిలోతికునితో

చాలుదెబ్బతినిన వారువమేగు న
ట్లుతుల తీవ్రనిష్ఠ సతత ధర్మ

పథము పట్టి దుఃఖ పరతంత్రుఁడవుగాక
మనుము, జన్మబంధ మణగిపోవు. 98

నీటి కాల్వత్రవ్వ నేర్పరి తనయిచ్ఛ
వచ్చినట్లు నీటివాలు చూపు
సుస్థిరేంద్రియుండు నస్థిర వాంఛల
నణచి ముక్తిమార్గ మందునిలచు. 99

## జరావర్గము

జేతవనమున – విశాఖమిత్రురాలితో

సంతతాగ్ని రీతి సంసారమదియుండ
నవ్వులేల? మోద నటన మేల?
అంధకార బంధురావృత జగతిలో
జ్ఞాన దీప్తి వెదుక వూనవేల? 100

రాజగృహవేణువనమున – సిరిమాతో (క్షేమ)

వ్రణములెదిగి బాధపరచు దేహము రీతి
నస్థిర ప్రపంచమందు. మేను
క్లేశమయములైన ఆశాలతల జిక్కి
తల్లడిల్లు కాంక్ష, డొల్లకున్న. 101

జేతవనమున – ఉత్తరితో

తలప తనువు రోగముల కాలవాలము
అనుదినంబు మార్చి తినును ముదిమి
కుళ్ళి కుముల జేసుకొని మ్రింగు మృత్యువు
అంత దీనిదంబ మంతరించు. 102

జేతవనమున - రూపానందతో

ఏముకలతోనే యొకనగ
రము కట్టబడియె రక్తమాంసమ్ముల లే
పముతో జరమృత్యువులం
దమితముగా పోరుచుండు నహరహముద్ధృతిన్. 103

జేతవనమున - మల్లికాదేవితో

మోజు గొలుపుచుండు రాజ రథమ్ములు
కొంత కాలమునకు నంతరించు
కాని సుజను ధర్మ ఘన గుణమ్ములుపోవు
ఆర్యులిట్లు పల్కి రరసితెలసి. 104

జేతవనమున - ఉదాయితో

అజ్ఞుడైన నరుడు ప్రజ్ఞావిహీనుడై
పసర మట్లు లవని నెసగు చుండు
వాని రక్తమాంస వసలు పెంపొందును
కాని జ్ఞానవృద్ధి కానరాదు. 105
పెక్కు జన్మలందు చిక్కి సంసార మా
ర్గమ్ములందు తిరిగి యుమ్మలికను
దేహ పురి చరించు దేవునికొఱకునై
మరల మరల జన్మ పరత కంటి. 106
నేడు దేహగృహము నిర్మించువానిని
తెలియ గంటి, వానితెలివి నన్ను
మరల పుట్ట జేయ వెరవు కానకయుండె
మదిని తృష్ణ నాశమగుట వలన ! 107

వారణాసి - ధనికవర్తకుని పుత్రునితో

మత్స్యవితతి లేని మడుగున నివసించు
బకమురీతి నిరత బ్రహ్మచర్య
నిష్ఠతోడ ధర్మ నియతి పూనకయున్న
మ్రుక్కి మృత్యువునకు దక్కు నరుడు. 108

బ్రహ్మచర్య నిష్టవదలి యౌవనకాల
మందు బోధధనము పొందకున్న
భగ్న బాణసెజ్జపై పడుండిన వాని
గతిని ఖేదపడును గతము తలచి. 109

ఆత్మ వర్గము

సుంసుమాగిరి - బోధిరాజకుమారునితో

తన్ను దా నెద ప్రేమించు కొన్నవాడు
తనను లెస్సగ కాపాడు కొనగవలయు
చతుర మతి రేయిలో మూడు జాములందు
ఒక్క జామైన ధ్యాతగా నుండవలయు. 110

జేతవనమున - శాక్యపుత్రుడైన ఉపనందునితో

ముందు జ్ఞాని ధర్మమును నిష్ఠతో జేసి
పరుల కనుభవంబు గరుప వలయు
తాను చేసి చూపి తగవరి యై బోధ
చేయు వాడు తిరిగి చింతపడడు. 111

జేతవనమున - కశ్యపకుమారుని తల్లితో

తనకు దానుప్రభువు ధరణిలో యెట్లగు ?
తన్ను తానణంచు కొన్న (వాడె) యపుడు

తాదృశాత్మనిష్ఠ తన్ను పాలించెడు
వాని బడసినట్లె వసుధలోన. 112

జేతవనమున — దేవదత్తునితో

* మాలువా లతలకు కూలు కాలము రీతి
ఎవని దుర్గుణంబు లెదిగియుండు
వాడు శత్రు చింతవలన క్షశించిన
వాని రీతి స్వీయహానిపొందు. 113

వేణువనమున - సంఘమున కలతలు తప్పినపుడు

అనుచితమ్ములు తన కహిత కార్యమ్ములు
చేయుటెల్ల సులభ చేష్టయగును
కాని విహితమైన కార్యంబొనర్పుచే
కష్ట మగుచునుండు నిష్టసదల! 114

జేతవనమున — కాలుడను భిక్షువుతో

అతుల ధర్మనిష్ఠులగు నర్హతుల గాంచి
నీచబుద్ధితోడ నింద చేయు
వాడు వెదురు ఫలము వలె స్వీయ నాశన
మునకు కెరలుచుండు ననయ మిలను. 115

జేతవనమున - అర్థదత్తునితో

పరహితంబు కోరి పనిచేయు వేళల
స్వీయ ధర్మహాని చెందరాదు

---

* మాలువా అను తీగ ఏచెట్టుపై పాకునో ఆచెట్టు వర్షాకాలమున నీటిధారముచే నశించిపోవునట.

స్వీయ ధర్మహాని చెందని రీతినే
పరుల శ్రేయమునకు పాటుపడుము. 116

కపిలవస్తు - న్యగ్రోధారామమున శుద్ధోదనునితో

ధృతిమై మెలగుచు మాయా
న్విత మోహము హృదయ వీధి వెలయింపక స
న్నుత సద్ధర్మము నెదపిన
క్షితిపై నిహపర సుఖంబు చేకూరు నొగిన్. 117

సు ఖ వ ర్గ ము

శా క్య న గ ర ము న - జాతివైరము పోవుటకు

పరమ శత్రువులను పరికించి మిత్రుల
భాతి నెంచి మేము పరమసుఖము
నంది వైరిజనుల యందు అవైరుల
మైచరించు చుండు మనుదినంబు. 118
భీతిగొనిన వారు ప్రీతిచెందగ వారి
ఉండ నిలచి వైరమంతరింప
జేసి చింతలెల్ల వాసి మోదమ్ముతో
మసలు మమ్మెరింగి మనుట లెస్స. 119

మగధదేశమున - పంచశాల బ్రాహ్మణాగ్రహారమున

ఎంత చిన్నవస్తు వేనియు తాకడ
లేకయుండి హృదిని చీకుపడక
నిపతులకైన దివిజనాథునకైన
సుఖము పొంది కానబడమె ? 120

జేతవనమున - పరపసేది కోసలరాజుతో

జయము వైరములను రయమున పుట్టించు
అపజయుండు చాల కృపణుడగును
అంతరంగ విజయ మందజాలినవాడు
జయమపజయముల వ్యసక్తి లేదు. 121

జేతవనమున - ఒకానొక కన్యతో

అగ్నికన్న తీక్ష్ణమైనది రాగము
ద్వేషములివ మెరుగు భాషలేదు
* పంచశాఖగమిని మించు దుఃఖములేదు
సుప్రశాంతి సాటి సుఖములేదు. 122

అలవి - ఒక ఉపాసకునితో

ఆకలి కడుపెద్ద దన్నిరోగాలలో
పాపచింత దుఃఖభాజనమ్ము
గా నెరింగి నట్టి ఘనులు నిర్వాణమే
పరమ శాంతి యనుచు పలికినారు. 123

వేణుగ్రామమున — దేవరాజుతో

తోటి నీడ నమ్మ బాటసారిని బోలు
మూర్ఖు చెలిమి దుఃఖమును ఘటించు

---

* పంచస్కంధములు ; రూపము. వేదన. సంజ్ఞ సంస్కారము విజ్ఞానము. వీనిలో వేదన. సంజ్ఞ. సంస్కారము. ఈమూడును విజ్ఞానాంతరములు. పృధివ్యాప్తేజోవాయువులు రూపస్కంధములు. స్థూలముగానిదియు అవకాశరహితమునగునది విజ్ఞాన స్కంధము. రూప విజ్ఞానముల సమ్మేళనము చేతనే ప్రపంచము నిర్మాణమైనది.

ధీవరేణ్యమైత్రి తెప్పయై ఘోర సం
సార వనధిదాట సాయపడును. 124

* ఆర్యకోటి దర్శనానందమేచాల
సుఖకరంబు వో వసుధంద నిజ
ముగము ఖజనిపొందు తెగవాడకున్నదో
శాంతి నందనేర డెంతవాడు. 125

ప్రాజ్ఞు సకల శాస్త్ర పారంగతుని నిత్య
సత్యనిష్ఠు చేరి సఖుష్ఠ సేవ
తడయ కెల్ల రాత్రి తారాపథమ్మున
చంద్రుడేగుచున్న చందమగును. 126

## ప్రియవర్గము

జేతవనమున – ముగ్గురు భిక్షువులతో

భాసురాత్మ నిష్ఠ నాసక్తి హీనుని
సక్తియందు లవము శక్తిగొనక
స్వార్థ బుద్ధినణచి సద్వస్తువెరిగిన
వాని ననుకరింప వలయుమీరు. 127

వైశాలి – కూటాగార శాల – లిచ్ఛవులతో

విషయ భోగవాంఛ వేలలేని దుఃఖము
నొసగు భీతిదాని నుండి పొడము

---

* నిర్వాణమార్గమున నిలుకడ పొందియున్న స్రోతాపన్న, సకృదాగామి, అనాగామి, నిర్వాణప్రాప్తుడు, లేక అర్హతుడు, అను ఈనాలుగు తరగతుల వారు ఆర్యులన బడుదురు.

విషయ భోగవాంఛ వెడలిన యార్యుని
చేతమందికెట్లు భీతిపుట్టు ? 128

జేతవనమున - అనితిగంధకుమారునితో

కామమున దుఃఖమొదవును
కామముచే భీతి యెదిగి కష్టము లొసగున్
కామ విహీనుండే భువి
క్షేమంకరుడై నితాంత శ్రేయము పొందున్. 129

జేతవనమున - అనాగామితో

నిరుపమాన మైన నిర్వాణసుధ కోరు
వాడు నిశ్చితాత్మ పరతనెగడి
విషయ భోగవాంఛ వెడల నూర్ధ్వస్రోతు
డని వచింతు రవని నార్యులెల్ల. 130

ఋషిపట్టణము - నందిపుత్రునితో

దీర్ఘకాల మన్యదేశాన చరియించి
వచ్చినట్టి వాని బంధు వర్గ
మాదరించి నట్లు మోదాన పరలోక
మందు పుణ్య పురుషు నాదరింత్రు. 131

క్రోధవర్గము

కపిలవస్తు న్యగ్రోధారామము - రోహిణితో

క్రోధాభిమాన రహితుడు
పోదోలిన నామరూపములు కలవాడై
అదట నపరిగ్రహ మరి
యాదను పాటింప శోకమంటకపోఋన్. 132

అటవీ ఒక భిక్షువుతో

కదలురథము వాప గల సారథిని బోలి
యెదజనించు క్రోధ మదిమిపట్టి
నిరత బౌద్ధధర్మ నిష్ఠుడు కాకున్న
పొట్ట కూటి వేష భూషణుండె. 133

జేతవనమున – ఉత్తరయను ఉపాసకురాలితో

క్రోధము నక్రోధముచే
సాధుత్వముచేత దుష్ట సంసర్గమ్మున్
మేదిని లోభము దానము
తో ధరణి నన్నృతము నిజముతో నెట్టవలెన్. 134

రాజగృహా గృద్ధ్రకూటమున – శోణకుమారునితో

సతత పరతత్వ విషయసంగతిచి జాగ
రూకులై యుండు కతన రేయింబవళ్ళు
ప్రముఖ శిష్యలు నిర్వాణ పదవినంది
యుండ వారి మనోమల ముడిగిపోవు. 135

జేతవనమున – అతులునితో

ఏమి చేయకున్న నెక్కువ మాట్లాడు
చున్న మాటలాడ కున్ననైన
తెగడు చుంద్రు మరల పొగడుచు నుందురు
జనుల తీరు లింతె సరకు గొనకు. 136

విజ్ఞులైన వార వేల విచారణ
సలిపి శీలయుతుని సన్నుతింత్రు
తప్తకాంచనముగ తనరు నిర్మలుని, దే
వతలు, బ్రహ్మయును, వినుతి యొనర్తు. 137

వేణువనమున - వజ్జయుడను భిక్షువుతో

దేహ చాంచల్యము నువీడి ధీరవృత్తి
కాయికంబైన మలినము కడిగివేసి
స్పర్శ సౌకర్య వాంఛల జాడచనక
కాయ కంబైన సత్సేవ చేయుటొప్పు. 138

వాచాలత్వము వీడుచు
వాచికసంయమము కలిగి వరలుచుధరలో
వాచిక మౌ సుచరిత్రము
నాచరింప విబుధ వందితాత్ముడుకాడే. 139

కాయిక వాచిక మానస
ధీయుతులై సంచరించు ధృతిమంతులనే
పాయక నిర్వాణాంగన
చేయిపట్టి విడువబోదు క్షితినెల్లపుడున్. 130

మలవర్గము

జేతవనము - గోఘాతక పుత్రునితో

ఓయి, పండి రాలి యున్న యాకునుబోలి
యుంటి వెదుట యముని బంటు వచ్చి
నిలచియుండె, వెళ్ళవలయు దారికి చాలు
వస్తువులు గడించ వైతివేమి. 141
నమ్మి స్వీయ రక్షణమ్మున కనువగు
జ్ఞాన శీలయత్న మూని శుద్ధ
చిత్తవృత్తి గనెడ శీఘ్రమే యార్యులు
పొందు దివ్యపదము నందగలవు. 142

రాజగృహవేణువనమున – కులపుత్రినితో

దురిత వర్తనమును మరగిన స్త్రీ చెడు
దాత చెడును బుద్ధు నీతి దలచి
ఎన్న పాపచిత్తు డిహపర దూఱుడౌ
ఔరిగి ధర్మపథము మరువ కన్న. 143

జేతవనమున – సారిపుత్రునితో

పాప చింతన కెద సిగ్గుపడెడువాడు
తన పవిత్రత కాపాడు కొనెడువాడు
ావ నుండౌట పరిశుద్ధ జీవియగుట
ష్ట తరమయ్యు సౌఖ్య నంగలకి మారు. 144

జేతవనమున – ఉపాసకులతో

ంక్ష కెనయైనఅగ్ని ఎక్కడను లేదు
పవిని ద్వేషాని కెనయైన భూత మేది ?
మోహమును మించు కష్టసమూహమేది ?
తృష్ణ సమమైన నదివిల తెలియ గలవె ? 145

కుసినగరమున – సుభద్రునితో

గనమున కుపమానమై నెగడువస్తు
వని లేనట్లు సన్న్యాసి యైన వాడు
ందుకొను సమ్య జ్ఞాన యుతుండగుటను
బాహ్య చిహ్నంబులరసి యేర్పరు పరాదు. 145

భద్దియనగరమున – శ్రేష్టితో

కపట జూదరి పాచికల్ కప్పిపుచ్చు
గతిని నరుడన్యు దోషముల్ వెతికిమరియు

పరుల దొసగులు కనుట నెప్పుడవసరంబు
కాదు, తన దోష మెఱుగుట ఘనతరంబు. 147

## ధర్మస్థనికరము

### జేతవనమున - విషవ్వునితో

సత్య ధర్మములను జనులకు బలిమిమై
కాక, ప్రేమతోడ కరపివారి
నతుల సత్యధర్మ యుతులగావించిన
ధీవరుండె ధర్మ దీక్షితుండు. 148

### జేతవనమున - ఏకద్దానునితో

అధిక భాషలాడు నతడు ధర్మజ్ఞుడు
కాడు పరుల కష్ట గణము నణచి
ద్వేష భయవిహీన ధీయుతుండెవ్వడో
వాడె పోధరిత్రి పండితుండు. 149

### జేతవనమున - లకుంటకభద్దియునితో

సత్య ధర్మాను రక్తియు సంయమనము
కలిగి మనువాడు పెద్ద లోకమ్మునందు
కాలగతియందు, తలవెంట్రుకలు నెరయగ
వృద్ధుడైనట్టి మనుజుడు పెద్దయగునె ? 150
వక్తయై చాలసౌందర్య వంతుడయ్యు
యీర్ష్యా మాత్సర్య యుత దయా హీనుడైన
నరుడు సాధువు కాడు యెన్నటికి పైగు
ణములు లేనట్టి వాడెన్న శ్రమణుడగును. 151

జేతవనమున – వర్థికునితో

నిష్ఠలేనివాడు నెరిశిరో ముండన
మాత్రమునను సాధు మాన్యుడగునె ?
స్వాంత పాపరహిత సంతతానందుడే
సాధుమూర్తి దివిజ సన్నుతుండు 152

జేతవనమున – తీర్థికునితో

బిడియ మడిగి పరుల భిక్ష నొసంగిన
యంతలోన శ్రమణు డనడెవండు
దురిత కర్మ ఫలము తునుముట్ల జేయక
సాధువెట్టులగును జగతియందు ? 1
ఎవ్వడీలోకమందు నహీన నిష్ఠ
పాపపుణ్యములను వీడి బ్రహ్మచర్య
వ్రతము నెదపూని జ్ఞానసంగతి చరించు
చుండునో, వాడె తగు భిక్షుకుండనంగ. 154
ఇహపరాల నిత్యమెరిగి మననము చేయు
వాని మౌని యనగ వచ్చుగాని
మలిన మానసుండు మౌనమూనిన యంత
మాత్రమునను కాడు మౌనివరుడు. 155

జేతవనమున – అరియ బాడిసకునితో

పగొని ప్రాణుల జంపెడు
జనుడిల నార్యుండుకాడు జగతీస్థలిలో
అవయంబు సకలప్రాణుల
తనవలె కన నార్యుడౌను తథ్యము సుమ్మా. 156

## మార్గవర్గము

### జేతవనమున - 500భిక్షుకులతో

మార్గముల శ్రేష్ఠ మష్టాంగ మార్గనిష్ఠ
సత్యముల మేలు చతురార్య సత్యములును
ధర్మమున మేలు వైరాగ్య తత్పరతయె
మానవుల యందు * బుద్ధుడే మహితు డగును. 157

మహివిశుద్ధ, జ్ఞాన ప్రాప్తికి మార్గమిదియె
వీని కన్నను మేలైన తెరవులేదు
శ్రమణులీమార్గమున చన క్రమముతోడ
మరుని సైన్యము వెరచు మీదరికి చేర ! 158

ఈగతి నేగిన దుఃఖము
లోగును రాగాదులెల్ల రూపరిపోవున్
బాగుగ నేసీ మార్గము
లో కంటి వితాంత మోక్షరూపము తొలుతన్. 159

కార్య సిద్ధికొఱకు కష్టించి బుద్ధుల
వర్తనమును సాటివారి కెఱుగ
పరచి నితతధర్మ పరులైన వారిని
2 * మరుని సేనకాంచి పశుపులెత్తు. 160

దశ్య వస్తు వితతి స్థితముగాదని యెవ్వ
డంత రంగ దృష్టి నరయ గలడో

---

2 * మరుని సేన - రాగద్వేషాదులు

* 1 బుద్ధుడు - జ్ఞాన నేత్రము కలవాడు.

వాడు విషయ భోగ వాంఛకు లొంగడు
చిత్త శుద్ధికిదియె శ్రేష్టపథము. 161

జేతవనమున — తిస్సునితో

తరుణు డారోగ్య సుదృఢ గాత్రమున వరలి
మందమతియై మనోలయ మందుతెనవు
పూని సాధించ కున్నచో పొందలేడు
జ్ఞాన సంపద. నవని నిశ్చయము సుమ్ము. 162

వాఙ్మనోకాయ నిగ్రహావంతు డగుచు
కలుష చింతనకెడ, నవకాశమిడక
పూర్ణ విశ్వాసమున * ఋషిప్రోక్త ధర్మ
పథము పట్టిన శాంతనం పదఘటిల్లు. 163

జేతవనమున - భిక్షుకులతో

తృష్ణ నొకదానినే పట్టిత్రెంచి తృప్తి
చెంద బోకుడు భిక్షుక శ్రేష్టులార
విషయ కాననమును తల్లి వ్రేళ్ళతోడ
పీకి భస్మంబుకావించి వెలయుడయ్య. 164

పాలుత్రాగు దూడ పదపడి తల్లిని
విడువ లేనియట్లు వెలది పొందు
వీడలేని నరుడు విషయాటవిని చిక్కి
ముక్తి నందలేడు ముజ్జగాల. 165

---

* ఋషిప్రోక్త ధర్మము — బుద్ధుడు చెప్పిన ధర్మము.

జేతవనమున - సువర్ణకారునితో

అనుదినంబు మిత్తి తనుమ్రింగ దలఁచెడు
టెరయలేని మూర్ఖ దేహదేహంబు
ఇపుడుకాదు రేపు యెల్లుండి యని ధర్మ
పథముపట్ట వాఁడు దాఱుమైన. 166

జేతవనమున - పటాచారతో

అనుజు లాలి తండ్రి తనయులాప్తులు మృత్యు
కీలనుండి కావలేరు నిన్ను
కాన నిత్య సత్య ఘన శీల సంపద
చేత బట్టి ముక్తి చెందుటొప్పు. 167

ప్రకీర్ణ వర్గము

రాజగృహవేణువనమున - గంగావరోహకునితో

అల్ప విషయసుఖము నాసింప కుండుచే
పరమ సుఖము మోక్ష పథము కొఱకు
జ్ఞాని విషయ సుఖము పూనికతో నెట్టి
కొసగలడు ముక్తికాంత వెలవు. 168

పరుల పీడించి వారి సంపదను దోచి
స్వీయ భోగాభి వృద్ధిని చేయువాడు
తరుగెరుంగని వైర నంతసమందు.
చిక్కుకొన వానికిల శాంతి దక్కబోదు. 169

భద్దియనగరమున - భద్దియునితో

దేహమలిన మనిత్యత తెలియు వారు
జాగరూకతతో ప్రాణి సంచయమును

ఆదరింపుము చిత్త సంశోధనమున
జంకి గొంకదు ప్రార్ద్ధమింపు వరకు. 170

వేణువనమున - దారుసాకటికపుత్రునితో

ఎవ్వ డహరహమ్ము యీ బుద్ధ ధర్మ సం
ఘముల నిత్యచింత కలిగియుండు
నో, యతండు శ్రమణధీయుత కోటిలో
మేటియై తరించు పాటవమున. 171
ఎవర హింసామయాత్ములై యెల్లవేళ
తనువు క్షణభంగురంబను తలపు కలిగి
బుద్ధ ధర్మాభిరతి నెదపూని మెలగు
చుందురో వారు శ్రేయము నందగలరు. 172

వైశాలి - వజ్జిపుత్రునితో

జనులు సంసారమును వీడి సన్యసించు
టెంతకష్ట మయోగ్యమౌ యింటనుండు
టంతకష్టము, దుర్వారవృత్తి నంటియుండు
టయ్యు, దుఃఖాంబుధిని దాటి యలకవలయు. 173

జేతవనమున - సుభద్రతో

రేయి విడచిన బాణంబురీతి నీచు
లుండనుండియు కానరాకుండ సాధు
జనులు దవ్వయ్యు నాహిమశైల ధవళ
శిఖరముల రీతినుందురు చేరువగను. 174

## నియమవర్గము

### జేతవనమున - సుందరితో

అనృత వాక్కులాడునట్టి వాడును, చేసి
చేయలేదటంచు చెప్పువాడు,
పరులకష్టపెట్టి మరియు వారును, మరణ
కాంతరమున నిరయ సమభవిత్రులు. 175

### వేణువనమున - ఒకనితో

కావి కట్టినట్టి మనుజులెందరోయిల
సంయమ రహితులగు నరణినున్న
వారు వారిదురిత వర్తన ఫలముగా
నరకమున జనించి నశించవలెను. 176

### వైశాలి - వగ్గుదాతీరవాసితో

సంయమ రహితుడగు చపలచిత్తుడు స్వదే
శాన్నమును భుజించుచున్న మేలు
కాదు, వహ్నియందు కరగెడు లోహఖం
డమును మ్రింగజాలు టమిత శుభము. 177

### జేతవనమున - కటుభాషితో

ఒడుపు తెలిసి పట్టుకున్న చేతిని దర్భ
కోయునట్లు ధరణికోపిదుండు
సన్యసించి ధర్మ సరణినేగకయున్న 178
స్వీయహానిచెంది చెడునుకాదె ?

క్షురవినొనర్పని కర్మయు

పరిపూర్తి యొనర్పబడిన వ్రతనియమంబున్
స్థిరపడని బ్రహ్మచర్యము
కరము పుణ్యఫలిత మీయగాలేవెపుడున్ ॥ 179

సన్న్యసింప కాంక్ష జనియింప నటుచేయ
వచ్చు, ధృఢనియమము హెచ్చకున్న
పట్టు సడలిపోయి ప్రాపంచికుల గూడి
దోష కర్మములకు దోఖలించు. 180

జేతవనమున - పలువురు సాధువులతో

పరిహద్దున గల నగరము
నిరత శిక్షణంబుతోడ నెగడుగితి నే
మరక నడుదెల్లవేళల
పరమార్థము నెరపకున్న పతితుడు కాడే ? 181

జేతవనమున – జైనసాధువుతో

సిగ్గు పడరాని పనులందు సిగ్గుపడుచు
సిగ్గుపడదగు పనిచేయ మొగ్గువారు
కల్లలకు పొంగి సత్యము వొల్లకున్న
వెతల బడుదురు నియమసంగతికి చిక్కి. 182

జేతవనమున - తీర్థికుని శిష్యునితో

మంచియందు చెడనెంచి చెడను మంచి
గా దలంచు కుటిల మతినశించు
మంచి చెడుగు మర్మమెంచి సమ్యగ్దృష్టి
పొందు వారు సుగతి నందగలరు. 183

## నాగవర్గము

### జేతవనమున - ఆనందునితో

సంగరమున యేన్గుశరహతి కోర్చెడు
రీతి పరులనింద కోర్తునేను
ఈప్రపంచమందు యేమూలకేగిన
నింద చేయు వారనేకులుంద్రు. 184

నేర్పు కలుగు గజమునే నృపుడెక్కును
యుద్ధమందు దెబ్బ లోర్పుగాన
ప్రతిదినము నికృష్ట మతుల దూషణముల
నోర్పువాడెపో. మహోన్నతుండు. 185

అశ్వ నాగ గార్ధభాదులు మేలైన
శిక్ష నొసగ మనలు శ్రేష్టరీతి
కాని; యాత్మదమన మూనిన మానిసి
యెంత కన్న శ్రేష్టుడైయెనంగు. 186

### జేతవనమున - మహావ్రతునితో

శకట ములను లాగు జంతువుల్ నిర్వాణ
తీరమెరిగి చేర నేరలేవు
కాని; యాత్మనిష్ట గల మర్త్యులందరు
శిష్టవర్తినమున చేరగలరు. 187

### జేతవనమున - బ్రాహ్మణపుత్రునితో

సేన నదరగొట్టి చెండాడు మదకరి
బంధనమున చిక్కి బాధపడుచు

తిండికూని వనిని తిరిగెడి యేన్గుల
చింతనమున మునిగి చిక్కిపోవు. 188

జేతవనమున — సామరేజునితో

తొలుత నాయెవ తనవు సంతోషమైన
గతినివిహరించె నేనది కాంచిపొంచి
మదగజమ్ముగను శిక్షించి మావటీడు
వశమ నట్లుగ మనసునిగ్రహించి యుంటి. 189

పారిలేయ్యకమున — పఱుపు భిక్షువులతో

నిరుపమాత్మ నిష్ఠ నెగడెడి చెలికాడు
దొరకెనేని విఘ్నపరతతి దాటి
జాగరూకతను బ్రసన్న చిత్తములతో
వానినంటి తిరుగవలయు మీరు. 190
ఒంటరిగ చరించు టొప్పగు మూర్ఖుని
చెలిమి తగదు కాంక్ష తొలగి నాగ
రాజు వనులతిరుగు లాగున యేపాప
మంటకుండ మసలు డవనియందు. 191

హిమగిరియందు — **మారునితో**

ఆర్తియందు మిత్రులబ్బిన మేలగు
పుణ్య కర్మ శుభము పొందజేయు
నిఖిల దుఃఖ నాశి నిర్వాణ మదియబ్బ
ఇహపరాల సుఖము లింపుకావు. 192
మాతాపితృ జనసేవయు
భూతలిలో సన్యసించి పోవుటశుభమౌ

పాతక రాహిత్యమ్మగు
రీతి; దీనికన్న మేలు; లేదెవ్వేళన్. 193
జీవితమున ధర్మశీలము పోషించు
కొనుట లెస్స. ప్రజ్ఞగనుట మేలు;
పాపవర్తనమున కేప్రొద్దు హృది నవ
కాశమీయ కుండు; టమిత శుభము. 194

## తృష్ణా వర్గము

### జేతవనమున - కపిలమచ్ఛనితో

మందమతిని తృష్ణ మాలువాతీగచే
చిక్కుకొనిన చెట్టు స్థితికి తెచ్చు
వనిని తిరుగు కోతివలె వాడు కోరిక
లందు చిక్కితిరుగు నహరహంబు. 195
వివిధ గతుల పొడము విషరూపియగు తృష్ణ
యెవని యెడద దోయిలించువాడు
చాపలల్లు తుంగ చందాన దుఃఖ సం
గతిని మ్రుక్కి సుగతి వెతకలేడు. 196
నిరత ముదయ మంది తిరుగు నెరుగని తృష్ణ
కెవడు తావొసంగడవని వాడు
జలజ పత్ర పతిత సలిలబిందువు రీతి
కాంక్షలందు చిక్కి కష్టపడడు. 197
పైకి కోయబడిన వనజమూలము అంకు
రించునట్లు తృష్ణ లేశమైన

హృదిని మిగిలెనేని యెదిగి వెంబడి పల్లి
వించి మానవుని తపించ జేయు. 198

పుడమియందు తృష్ణ ముప్పదియారు • ప్ర
వాహరూపములను పట్టియుంచు
వానియందు చిక్కుపడువాడు జన్మ జ
న్మాంతరాల నరకమనుభవించు. 199

ఈప్రవాహజలము ఎల్లదిక్కుల మోహ
రించి పారుచుండ రేబవళ్ళు
అంతరంగ దృష్టివలరి ప్రాజ్ఞతతోడ
దాని మూలమంట దరుగుటొప్పు. 200

ఈజగాన తృష్ణ యెంతో మనోజ్ఞమై
ప్రాణికోటి చిత్త పంజరముల
దాగియుండ విషయ తత్పరులై నరుల్
పడుట, కనమె జన్మ బంధనమున. 201

తృష్ణ నభిలషించు తీసులు బోనులో
పడిన శశమురీతి పరితపించ
వలయు. స్వేచ్ఛదొరగి. వసుధ మనోబంధ
నమువకంటె పెద్ద నరకమేది. 202

---

• ముప్పదిఆరు ప్రవాహములు :- చర్మము - కన్ను, చెవి, ముక్కు, శబ్దము, స్పర్శ, రూపము, రుచి వాసన, ధర్మము, మనోధర్మము, పంచజ్ఞానేంద్రియ పంచతన్మాత్రల విజ్ఞానములు బాహ్యాంతర భేదమువలన ముప్పదిఆరు ప్రవాహములుగాచెప్పుదురు

వేణువనమున - వినంతకునితో

కాంక్షనుండి తెలివిగా దాటి నిర్వాణ
తత్పరుండు, తృష్ణ దలచునేని
ముక్తినంది, బంధములు గల దిక్కుకే
చనును పిచ్చివాని చందమునను. 203

కాష్ఠలోహ రజ్జుగత బంధనంబులు
పండితుడు దృఢమని పలుక బోడు
ధన మణి యువతంజి దారాసుతాదులే
ఎంచి బంధమనుచు యెంచుచుండు. 204

ధీవరేణ్యులెల్ల తృష్ణయే పోనిక
ర ముగ నష్ట కాంక్షలను జయించి
విషయ సుఖములెల్ల వీడి సన్యాసులై
చనెద రఖిల జీవ శాంతికోరి. 205

రాజగృహవేణువనమున - క్షేమ

పక్షిపురుగు తాను పెట్టిన గూటిలో
పరివసించు నట్లు పుడమియందు
కాంక్షలల్లి నరుడు కష్టాల పాలౌను
దీని దెరిగి ముక్తి తెలుపగనును. 206

రాజగృహవేణువనమున - ఉగ్రసేనుడను శ్రేష్ఠితో

పుట్టి పెరిగి గిట్టునట్టి వానిత్యజించి
దాటువలయును జగదాటవులను
వివృత తృష్ణనుండి విడువడు వాడెపో
జనన మరణ చక్రమునను పడడు. 207

రాగయుతుడు యావజ్జీవనే తలపోయు
వాని మోహదృష్టి వలన మిగుల
తృష్ణ పెరిగి పెరిగి దృఢముగా బంధించి
భవ మహాబ్ధి నడుమ పారవేయు. 208

సంశయములు విడువ సన్నద్ధుడగువాడు
దృశ్యవికృతి మార్పు తెలియువాడు
ఒంటి మాయచేష్ట లెరిగి చేరగనీక
చతురుడై నితాంత శాంతి పొందు 209

జేతవనమున – మారునితో

పుణ్య పాప చింత పోయిన వాడును
తృష్ణ నణచివైచి తిరుగువాడు
సారహీనమైన సంసార కంటక
ములను కాల్చి జన్మమునకు రాడు. 210

తృష్ణనణచి యపరిగ్రహ జిష్ణువగుచు
కావ్య శబ్దార్థ మర్మసంగ్రాహము నెరుగు
మేటి తుదిజన్మకలవాడు పాటవమున
వానిలక్ష్యము నెఱుగుట పరమశుభము. 211

వారణాసినుండి గయకేగుదారిలో అజీవకునితో

నేను రాగాదులన్నియు నిగ్రహించి
కోర్కెలుడిగిన ముక్తసంగుడ నగుటను
శోకమోహాల కావలి చోటుతెలిసి
తిరుగు మందును నాకొక గురువు కలడె ? 212

సంచయ సంయమము వలన సన్న్యాసి సదా
మించి సుఖియించు తత్సుఖ
మెంచగ దరమౌనె యామహేంద్రునకైనన్. 217

జేతవనమున - హంసఘాతకునితో

హస్తవాక్పాద సంయమి యైనవాడు
పరమ సంతృప్తి నేకాంత పరతనుండి
నిత్య సత్య సమాధిలో నిలచియున్న
భిక్షువనబడు కాకున్న భిక్షువగునె. 218

జేతవనమున – కోకాలియునితో

నిరహంకారియు నన్యుల
పరిహాసమునకును బెండుపలుకాడని ధ
ర్మరతుని ఋజువాక్యము
లరయగ మధురాతి మధురమందు మహాత్మన్. 219

రాజగృహవేణువనమున — భిక్షువుతో

తనకు దొరికిన భిక్ష మత్యల్పమైన
కుంద కన్యుని కబ్బిన గొప్పభిక్ష
నరసి మాత్సర్య మూనకయతుల తృప్తి
చెందు భిక్షువు యేకాగ్ర చిత్తుడగును. 220

అల్ప భిక్షపొంది యానంద పడువాని
శుద్ధ జీవనంబు సురనుతంబు
నామ రూప మమత లేమిని శ్రమణుడు
శోకహీను డగును లోకమందు. 221

శ్రద్ధ కలిగియుండి బుద్ధ సందేశము
స్నేహమడర బోధ చేయువాడు
సుప్రశాంతి పొంది శుభమయ నిర్వాణ
తీరమంటి భువికి తిరిగి రాడు. 222

శ్రావకా జీవనౌకను సకల విషయ
వాసనా భారమును డింపివేసి వేయ
నిమ్న గొనిపోవు నిర్వాణ నిలయమునకు
లేవు ద్వేషాగ్నులచ్చట రావుభువికి. 223

* 1 ఐదు పట్టి విరచి 2 యైదింటి విడనాడి
3 ఐదు తలచుచుండు యాత్మ యందు
4 ఐదు దాటి చనిన యా॥ ఓఘతీర్ణుని॥
5 యైదవదియు విడచి యణగిపోవు. 224

ప్రజ్ఞ లేక ధ్యాన పరుడు కానేరడు
ధ్యాని కాక ప్రజ్ఞ నూనలేదు

---

* 1 రూపము, రాగము, అభిమానము. గర్వము, అవిద్య, అను వానిని ఛేదించి. 2. అహంకారము. సందేహము, కఠినవ్రతాను ష్ఠానము. భోగాశక్తి, అనువానిని విడిచిపెట్టి. 3. శ్రద్ధ, వీర్యము, స్మృతి. సమాధి. ప్రజ్ఞలను భావనచేయుచు. 4. రాగము. ద్వేషము, అభిమానము, అసత్యభావనలను అతిక్రమించిన భిక్షువు. 5. కామము సాంసారదృష్టి అవిద్యలను దాటినవాడు (ఓఘతీర్ణుడు) అని అందురు.

నిష్ఠతోడ రెంటి నెరపిన సాధువే !
పొందగలడు మోక్ష భూతినెల్ల. 225

తనకు దాను ప్రేరణను బొంది తనకు దా
కార్య విరతి నెగడ గలుగు వాడు
తన్ను దారక్షించు కొన్నట్టి భిక్షువై
ప్రజ్ఞవడసి సౌఖ్యపడు జగాన. 226

పడుచు దనము నందె భగవానుడగు బుద్ధ
ధర్మమున నిమగ్నతను వహించు
మేటి జలదపటలి దాటి ప్రకాశించు
చందమామ రీతి జగతినలరు. 227

## బ్రాహ్మణ వర్గము

జేతవనమున - శ్రద్ధగల బ్రాహ్మణునితో

పొరుడా తృష్ణ నరికట్టి ధీరసాహ
సములనెద బూని విషయసంఘమును దునిమి
కపట సమ్మోహ వస్తుసంఘంబనిత్య
మని యెరింగిన నిర్వాణ మందగలవు. 228

జేతవనమున — మారునితో

పంచజ్ఞానేంద్రియములు
సంచిత తన్మాత్ర బలమహానమ్మము భావం
బుంచని కోమల హృదయుని
యెంచి పుడమివేల్పుటంచు యేనువచింతున్. 229

శుద్ధుడును ధ్యాతయును మానసుస్థితుండు
కార్య నిరతిని మత్సర గ్లాని కాక
పరమ సత్యము నెరిగిన భవ్యతనుడు
బ్రాహ్మణోత్తముడని నేను పలుకుచుందు. 230



శ్రావస్తి - ఆనందునితో



పగటివేళ సూర్యుడగణితుడై వెల్గు
రేయి చంద్రకాంతిగ్రాలు కవచ
ధారియై నృపుండు తనరును ధ్యాతయై
భూమిసురుడు వెలయు పుడమియందు. 231



కాని రేబవళ్ళు కననౌ స్వతేజ స
హస్ర గుణితమగుచు నఖిల దిశల
వెలయు బౌద్ధ దీప్తి వెలకట్ట జాలిన
ఘనుడు లేడుపో జగత్త్రయమున. 232

పాప మొనరించకున్నచో పారుడగును
సత్వ సమదృష్టి నెగడిన శ్రమణుడగును
ఆంతరిక మలముడిగిన యట్టి సాధు
ప్రవ్రజితు డనబడునుపో వసుధయందు. 233

జేతవనమున - సారిపుత్రునితో

బ్రాహ్మణుని పట్టి పీడించ పాడిగాదు
అన్యపీడకు బ్రాహ్మణుడలుగరాదు
అలుగపారుడు నిందార్హుడగును వాని
బాధపరచెడు వాడును పాపమతియె. 234

లౌకికానంద లంపటత్వమ్మునుండి
మదిని మరలించు వారదే మాన్యుడగును
చిత్తమందున కరహింస చేయుతలపు
పోవదుఃఖము శమించిపోవుమందు. 235

జేతవనమున - మహాప్రజాగౌతమితో

హృదయ వాక్కాయములచేత పృథివియందు
పాపమొనరింప కుండుటే పావనంబు
త్రికరణంబుల సంయమి నికరమైన
బ్రాహ్మణునిగ తలంతు వాధావమందు. 236

జేతవనమున - సారిపుత్రునితో

బుద్ధదేవుని ధర్మంబు పుడమినెవని
వినమాపొంది యుండెనో వాడు, వాని
దగ్గిర కెరిగెనరతి సత్యాదరమున
కాంచి, మోక్షమున పొందును ఘన శుభంబు, 237

జేతవనమున - జటాధారియగు బ్రాహ్మణునితో

జడలు దాల్చిన ఘనగోత్ర జన్మవలన
నెవడునుం బ్రాహ్మణుండు కాడవనియందు
సత్య ధర్మాలి నిరతుడౌ సద్గుణుండె
బ్రాహ్మణుండని నేనదా పలుకుచుందు. 238

## బుద్ధపురాణము సంపూర్ణము

నమో భగవతో అరహతో సమ్మాసంబుద్ధస్స

---

రచన 1960 జూన్ లగాయతు 1961 మే వఱకు.

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 57 | 9 | తింకంబు | తిలకంబు |
| 59 | 7 | సత్పర్వ | వత్సర్వ |
| 59 | 9 | సకృత్ప్రపా | సత్కృప్రపా |
| 69 | 12 | శుదోదనుడు | శుద్ధోదనుడు |
| 84 | 19 | దుహా | మహా |
| 92 | 12 | శాక్యముని | శాక్యనృప |
| 126 | 22 | మ్మాతృత్వ | మాతృత్వ |
| 133 | 7 | జనయా | తనయా |
| 136 | 10 | నెరుకగ | నెరుఁగ |
| 143 | 11 | వెమలి | నెమలి |
| 164 | 11 | గోర ప్రక్రియ | ఘోర ప్రక్రియ |
| 186 | 20 | కుటుంబము | కుటుంబముల |
| 184 | 7 | వన | నవ |
| 218 | 1 | అసలూడ | అసలూర |
| 253 | 16 | గొక | నొక |
| 260 | 20 | చిపబోన్ | దివబోన్ |
| 265 | 17 | బంది | బండ |
| 271 | 17 | దుర స్త | దుశవ స్త |
| 340 | 17 | షిగ్గు | సిగ్గు |
| ,, | 19 | నిరత | నిరతి |
| 341 | 3 | శుది | శుద్ధి |
| 342 | 8 | నునకరించు | ననుకరించు |
| 348 | 7 | యసస్సు | యశస్సు |
| 376 | 1 | బడిన | బడని |
| ,, | 11 | నెగడుగతి | నెగడెడుగతి |

# రాజంరాజు కవి రచనలు

## ముద్రితములు

బుద్ధపురాణము

సంయుక్త

చిత్రవాణి ఖండకావ్యము 1 భాగము

చిత్రవాణి రెండవభాగము

రామభూపాల శతకము

## అముద్రితములు

మోక్షసన్యాసయోగము

ప్రణయ తపస్విని

అమరలోకము

సలీమా

కరుణాంతరంగిణి

ఉద్విగ్న హృదయాలు


శ్రీ వాసుదేవాశ్రమమున

చోడవరము

(వయా టి. పి గూడెం)

ప॥ గో॥ జిల్లా.